శ్రీ శైవ గ్రంథమండలి — ద్వితీయ గ్రంథము.

# బ్రహ్మోత్తరఖండము

## (వచన కావ్యము.)







శ్రీ శైవ గ్రంథ మండలి

రాజమహేంద్రవరము

# శ్రీ శైవ గ్రంథమండలి నిబంధనలు

1 ఈగ్రంథమండలిలో సంవత్సరమునకు 4 గ్రంథములు వెలువడును

2 సంవత్సరమునకు చందా పోష్టుఖర్చులతో సహా 2—0—0 మా యేజంటుకు యిచ్చి రశీదు పొందినా లేక మనియార్డరు ద్వారా పంపిన చందాదారుగా పరిగణించబడును.

3 సంవత్సరమునకు అభిమానులు 5/—ప్రధానపోషకులు 10/—ము రాజపోషకులు 25/— వీరి పవిత్ర నామములు ప్రతి గ్రంథ...

... వెలవేసి పంపబడును.

...గ్రంథ మండలి

...ర్య స్థా న ము:

...హిం ౨ చ్ర వ గ ము

సర్వస్వామ్యములు
ప్రకాశకులవి



మొదటి కూర్పు

రాయవరమున
మల్లిడి సత్తిరెడ్డిగారి శ్రీ మేరీ ముద్రాక్షరశాలయందు ముద్రితః
1934

వెల రు 1—0—0

---

నిజాంరాష్ట్ర ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై యీ దిగువన వద్ద యీ కాపీలు విక్రయింప ఏర్పాటుజేసినాము.

కొండా శంకరయ్యా
సికింద్రాబాద్ బుక్కుడిపో,
మహంకాళివీధి, సికింద్రాబాద్ (దక్కన్)

# ప్రధాన పోషకులు

శ్రీ. వీ. మ. స్వ. బిక్కవలి పెద్దస్వామిదేవరగారు విజయనగరము

„ వంటెద్దు నాగభూషణందేవరగారు రాజమండ్రి

„ గరికిపర్తి సుబ్రహ్మణ్యందేవరగారు విజయనగరము

„ బిక్కవలి చిన్నస్వామిదేవరగారు „

„ బిక్కవలి మహాలింగందేవరగారు „

„ అమృతకవి వీరయ్యదేవరగారు „

మ. రా. శ్రీ తడవర్తి సీతారామబ్రహ్మశాస్త్రి వారు రాజమండ్రి

# అభిమానులు

శ్రీ. వీ. మ. స్వ. వంటెద్దు అమ్మిరాజుదేవరగారు రాజమండ్రి

„ వంటెద్దు సూర్యారావుదేవరగారు „

„ కాళహస్తి శరభయ్యదేవరగారు „

„ వంటెద్దు సోమరాజుదేవరగారు „

„ గరికిపాటి నరసయ్యదేవరగారు పాలకొల్లు

„ జోణం చిన్నగంగాధరదేవరగారు లింగంపర్తి

మ. రా. శ్రీ పగడాల చిన్నాబ్బాయి, పగడాల చెన్నమల్లయ్యగార్లు బూరుగుపూడి

„ బళ్ళా వీరాస్వామిగారు పాలకొల్లు

„ పి. అన్నాజీరావుగారు శ్రీకాకోళము

---

# ఒక్కమాట

ఇదివరలో వాగ్దానము జేసినవారు వెంటనే సహాయపడి, దీనిపై యభిమానముంచి తగినంత చేయూత నొసంగవలెను.

తాము జేసిన సహాయము చందాగాను, మా యత్నం వర్తకము గాను భావించక, ప్రతి శైవసోదరుడు ప్రోత్సహించుట తన విధ్యుక్త ధర్మముగా యెంచవలెను.

కార్యనిర్వాహకుడు

పాపయ్యలింగం

# విజ్ఞాపన



వర్తమానమునందు పురాణాది మతవిషయైక గ్రంథములు మాన్య విద్యానిధులకుఁ గూడ ననవగతంబులై యున్నవి. దీనిం బరిశోచించిన జనసంఘమున ఆంధ్ర వాఙ్మయ మొతవరకు క్షీణించినది నాతి సులభముగ బోధపడకమానదు. పూర్వము సామాన్య స్త్రీపురుషాదు లెల్లరు సులభముగఁ జదువుకొని గ్రహింపదగిన పురాణములు ప్రబంధములు ఇకాలంబున నెల్లరకును దుర్గ్రాహ్యంబులై నామమాత్రావశిష్టంబులై యుండెను. మత జ్ఞాన వైరాగ్యోపదేశము ప్రబంధ పురాణములమూలమునఁ బ్రబోధింపవలయునను పురాణపురుషోద్దేశములు కాలవైపరీత్యంబున నివ్విధముగఁ బరిణమించెను.

కావున సనాతన పుణ్యగ్రంథంబులమూలంబున సకల ధర్మాధర్మంబులను బ్రబోధించుచుఁ బురుషార్థ చతుష్టయ సంపాదనంబులకు నిదానంబులై, భౌతికాధ్యాత్మిక తత్వవిజ్ఞానంబున కాధారంబులై జీవైక ముక్తిమార్గప్రబోధకంబులై, అఖిల తత్వ రత్నాకరంబులై యున్న గ్రంథరాజములను వచనరూపకముగ శైవజన సామాన్యంబునంతకును గ్రాహ్యమగునట్లు బ్రచురించుట మతసంబంధమగు గ్రంథమండలములకు కర్తవ్యమై యున్నది.

ఈ ఉద్దేశముతో శైవగ్రంథమండలీ కార్యనిర్వాహకులగు శాహస్తి పాపయ్యదేవరగారి ప్రోత్సాహమున పూర్వకవియగు శ్రీ ధర్మల్లి వేంకటరామకవి ప్రణీతంబగు ఈ యుమ్మక్రష్టగ్రంథమును పద్యకావ్యమునుండి వచనకావ్యంబుగ వ్రాసి, నూతనముగ వెలసియున్న ఈ గ్రంథమండలికి ద్వితీయగ్రంథముగ నర్పించి యీమాత్రము సేవనొ జేయఁగలిగినందులకే నెంతయు వినమ్రుడను.

వివిధాంశములను నాకుఁ దెలుపుచు వ్రాతప్రతిని సమూలముగ బరిశోధించి శ్రమఁగొన్న శ్రీ శైవగ్రంథమండలీ గౌరవ సహాయ సంపాదకులగు విద్వద్వినోద శ్రీ వేదుల సత్యనారాయణశర్మగారి కే నెంతయు కృతజ్ఞుండను.

దేశ కాల ధర్మములనుబట్టి కొన్ని మార్పులను జేసియుంటిని. ఇయ్యది నా ప్రథమ ప్రయత్నం బగుటచే నుత భాషావిషయములం దెట్టి లోపములున్నను బుధజనులును, శైవాభిమానులును నగు మా చదువరులు నన్ను క్షమింతురుగాక.

ఇట్లు

విశ్వనాథం



# పీఠిక

శా. నామాంతంబునఁ గౌరిసుందర ముని శ్రీ వ్రాతంబు వెన్ దిక్కునన్
శ్రీమద్వాసవుఁ డబ్జయోని హరియున్ జెల్వొప్పు పార్శ్వమ్ములన్
నియమంబంది చెలంగఁ సర్వప్రమథుల్ నేర్పొప్పఁ సేవింపఁగా
నామధ్యన్ మణిపీఠికన్ వెలయు శ్రీ యార్యేశుని న్వేడెదన్.

మహాశయులారా! అపూర్వమునుండియు వేదశాస్త్రాగమాద్యఖిల విద్యాపారగులగు మహాకవివర్యులచే నాచంద్రార్కంబగు యశోధనం బార్జించియున్న, రాణ్మహేంద్రవర పట్టణంబునఁ దేశోద్ధారకులును, విద్యాభిమానులును, ముముక్షుజన మార్గదర్శులగు శ్రీ. వీ. మ. స్వ. కాళహస్తి తమ్మయ్యదేవరగారిచే శైవమతగ్రంథమండలి యను నామంబున నొక గ్రంథావళి స్థాపింపఁబడినది.

వీరి యభిప్రాయ మత్యంతశ్లాఘాపాత్రంబుగా విరాజిల్లుచున్నది. ఏమందురా! కృతయుగాదియగు వేదకాలము మొదలుకొని కలియుగమందలి శ్రీ శంకరాచార్యస్వాములవారి కాలమువరకును, శ్రీసూక్త పురుషసూక్త, మహాన్యాస, నమక, చమకాది వేదవాక్యములచేఁ గొనియాడఁబడుచున్న చరాచరాంతర్యామియై, సర్వజగత్సృష్టి స్థితి లయకారకుండగు మహాదేవుని మహిమం బెఱింగించెడి మహాగ్రంథము లెవ్వియో? యథార్థముగా కవివర్యులచే రచియింపఁబడుటయే; గాక? ఏతద్విధియుక్తముగానే సర్వజనులును, ఆచరణం బొనర్చుచు సత్యముఁ దప్పక సాయుజ్యమును బొందిరనునది ప్రాజ్ఞులెల్లరు నెఱింగినదేగదా?

అట్టి మహామతరాజం బిప్పటి కలియుగమందలి శ్రీ రామానుజాచార్య మధ్వాచార్యాది మతకర్తల వాగ్లిఖితోదకంబులచే వ్యాస వాగ్బీజాంకురంబులం బెద్ద వృక్షంబులుగాఁ బెంచి వాని విచిత్రఫలరసఁ

బులఁ గోలు మధురామధురంబుఁ జవిఁజూపుటచే క్రమ క్రమముగా లోకులు "క్రొత్త యొక వింత ప్రాత యొక రోత" అను లోకోక్తి ననుసరించి అదివరకు తా మనుభవించుచున్న యథార్థపదవినిన్ మఱచి; "ఎందరుమునులో యన్ని మతములు" అనున ట్లనేక భిన్న మతావలంబులై కలియుగచర్యలఁ దవిలి చెడుచుండుట మన మెల్ల రమూఁ గన్నులారఁ గనుచున్నదే. పూర్వయుగములయందలి శైవమత మొక్కటియే లోకం బెల్లెడలఁ బ్రచారమొనర్చి; సత్యధర్మముల నుద్ధ రించి మోక్షసామ్రాజ్యంబు నొసంగినదనుటకు నిప్పటికిని ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరదిక్కులం గల పుణ్యస్థలములుగా వాడఁబడుచున్న దివ్య క్షేత్రములయందు నెచ్చటఁగాంచినను పూజ్యంబులో నున్నవియేగాక, శిథిలములైన శివాలయము లనంతములుగాఁ గన్పట్టుట మీా రెఱింగి నదే; అందు నెందైన నట్టి యపూర్వములగు నితరదేవతాలయము లుండున ట్లెఱుంగము. ఇతరదేవాలయము లన్నియు నీ కలియుగ మ్మందలి వివిధ మతగురువు లరుదెంచినతరువాత వేయై యున్నవి.

అట్టి మహాశైవమత ప్రచారయుగము లెల్లను, సత్యధర్మాభి వృద్ధిచే మహామహిమలుం గల్గి శాపానుగ్రహసమర్థులై యున్న మహాత్ము లెందరో గలరని మన కిప్పటికిని చరిత్రాంశములే చాటు చున్నయవి. ఈ యుగమం దట్టి మతము క్షీణించుటచే, వివిధమత ములలోఁ జిక్కి మనోనిలకడం జెడుటంజేసి ఎచ్చటనియు నిగ్రహాను గ్రహంబులున్న నొక్క మహాత్ముఁడైనను వ్రేలుమడచి చూపుటకు, ఆధారం బగపడకున్నది.

గ్రంథవిస్తరభీతిచే యీా విషయ మింతటితో విరమించి, ఏతద్గ్రంథమందలి వారి సదుద్దేశమును నేను నా జ్ఞానానుసార ముగా వ్రాయ నుత్సహించుచున్నాఁడను. ఈ సంఘము వారి మ హోద్దేశము ముముక్షుజనుల కత్యంతోపయుక్తంబై యలరారుటచే

యాదృల కానందదాయకమేగదా? పూర్వ మీ శైవ మత ప్రచార దినములలో, ముద్రణాయంత్రము లేకుండుటచే; ఉద్గ్రంథములెల్లను తాళపత్రలిఖితములే యగుటం జేసి; ముద్రణాయంత్రములు గల్గు కాలమున కా మతప్రచారము తగ్గుటచే ఇటీవలి మతగ్రంథములే ముద్రింపఁబడి ప్రచురింపఁబడుటవల్లను, ఆ యపూర్వగ్రంథము లెల్లను చెద పురువులు నాతలం జిక్కి చెడుచుండుటం గాంచి; ఈ సంఘమువారఖండ వ్యయ ప్రయాసలకోర్చి శేషించిన గ్రంథముల జిక్కినంతవరకును సంగ్రహించి, ఆబాల గోపాలము వఱకును తేటతెల్లముగాఁ దెలియునటుల సులభ శైలిలో వచనప్రబంధములుగా ననుభవశీలురచే రచియింపించి వానిని శుద్ధప్రతులుగా చక్కని కాగితములపై మంచి యక్కరములతో నచ్చొత్తించి, స్వల్ప చందాలపై మూఁడు మాసముల కొక గ్రంథము చొప్పున చందాదారులు పొందునటులు జేసిన వీరి లోక మతాభిమానము లేమని కొనియాడగలము? ఇట్టి గ్రంథావళి సంఘమువారి యుద్యమం బవిఘ్నముగా నొనర్పుచు నా సర్వేశ్వర స్వాములు డఖండైశ్వర్యాయురాభివృద్ధులొసంగి రక్షించుగాత.

ఇట్లు

ఏతత్సంఘశ్రేయోభిలాషి

రాజమండ్రి
22—9—1934 } కవులూరి సూర్యనారాయణాచార్యకవి

# పండితాభిప్రాయము



ఆంధ్రోద్యమవ్యాప్తి కన్నివిధముల నాటపట్టయిన రాజమహేంద్రవరములో నెన్నియో మతవిషయైక గ్రంథమాల లుద్భవించి యచిరకాలములో నశించిపోయినవి. ప్రస్తుత మట్టి గ్రంథమండలి లేదను తలంపు రాజమహేంద్రవరమునకు లేకుండ శైవగ్రంథములతో నాంధ్రశైవుల నానందాబ్ధి నోలలాడింప నూతనముగ "శ్రీ శైవగ్రంథమండలి" యనుపేరున మూడుమాసములక్రిందట శ్రీ కాళహస్తి తమ్మయ్యదేవరగారిచే నారంభింపఁబడి యచిరకాలముననే చెన్నబసవపురాణము మొదలగు గ్రంథచతుష్టయమును ప్రకటించినది. గ్రంథములన్నియు సులభశైలిలో భక్తి జ్ఞాన వైరాగ్యములకు నిలయములుగ నుంటునటుల పండితులచే రచింపఁజేసి స్వల్పమూల్యముననే చందాదారుల కందజేయుచున్నారు. ఆర్థికదుస్థితి యొకవంకను, అన్యభాషా ప్రచారము లొకవంకను, వివిధమత విద్వేషము లొకవంకను తలయెత్తినకాలములో గ్రంథమండలిని స్థాపించి యత్యల్పకాలములో నిట్టి యుత్తమగ్రంథముల శైవహస్తముల నలంకరింపజేయుట పురోభివృద్ధిహేతువే. ఈ గ్రంథమండలి మున్ముం దింకను తులలేని సమ్మతుల నొందుచు పండితులచే నుత్తమ గ్రంథముల వ్రాయించి శాస్త్రిత రాంధ్రశైవులకుగూడ నందింతురని యాసింపుచున్నాడ.

ఇట్లు విధేయుడు

పండిత మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి



# కృతి సమర్పణము

ఆ. వె. ఆంధ్ర వీరశైవ జాతుల దీప్తంబు
భృంగిగోత్ర మాత్మ వంగడంబు
స్వార్జితార్థరక్ష వంటెద్దువంశమ్ము
నకును గృతిమొనర్తునయ్య దీని.

క. పొత్తము వనితయు వంశా
దత్తంబగు గుణవిశేషదమ్ములుగానన్
చిత్తేశుని సంసేవల
నత్తమిలన్ భక్తవరుల కందగజేతున్.

విశ్వనాథం

# విషయసూచిక

## ప్రథమభాగము



## ద్వితీయభాగము

## తృతీయభాగము







శుభమస్తు

# బ్రహ్మోత్తర ఖండము

## ప్రథమ భాగము

### నైమిశారణ్యము

"చ. అలసుధఁద్రావి యమర్త్యుడు జరామరభావముఁజెందు నొక్కఁడే
సలలిత శైవకీర్తనము శంభుకథా శ్రవణంబుల న్నివి
శ్చలతనొనర్చు మానవుని సంతతికిం దనకుం దలంపగా
గలుగు సమస్తసౌఖ్యములఖండితవీత జరామరత్వముల్"

శ్రీమంతంబును గోమల కుసుమ విరాజిత వివిధ లతావేల్లిత చూత చందన మందారాది నానావనీరాజ విరాజితంబును, హంస సారస చక్రవాక భరద్వాజ శుకశారికాది పక్షి కలకలారావ కాసార కలితంబును, సింహ శరభ శార్దూల గండభేరుండ వరాహ సారంగ గజ గవయ రోహిష మహిషాది మృగసంకులంబును గలిగి భువనపావనంబై యొప్పు నైమిశారణ్యము శౌనకాది మహామునుల ఆశ్రమ రాజితంబై, నిరంతర హోమధూమ నిబిడీకృతమై, సతతాధ్యయనాధ్యా

వన గంభీరస్వరముఖరితంబులతోడను, మునిగణ వచన విషయ విశా
వినిర్ణయ న్యాయనిపుణ విద్వత్సంభాషణములతోడను, నఖిలశాస్త్ర
పురాణేతిహాస కథాశ్రవణ కుతూహలాయత్త చిత్త మునిసత్తమా
రామంబుతోడను, భూలోకస్వర్గమై విరాజిల్లుచుండెను.

ఆవనోత్తమంబున కొకనాడు వ్యాసమహర్షి శిష్యుండును, రో
హర్షుని కుమారుడును నైన సూతమహాముని విచ్చేసెను. అప్పు
తపోవనమునందలి ఋషిసత్తములెల్లరు అమందానందభరితు జ్ఞాను
విద్వజ్జనమాన్యుండగు ఆ సూతమహామునికి అర్ఘ్యపాద్యాదు లొస
అతిథిసత్కారములఁ గావించిరి.

పిమ్మట వారు సూతునితో "మహాత్మా! నీవు విద్యాసా
ఖ్యాముఁడైన వేదవ్యాసమహామునీంద్రునకు ప్రియశిష్యుండవై, ఆ ము
సత్తమునివలన సకల వేదపురాణేతిహాసంబులందును కుశలమతివై
మానితగుణసౌజన్యుడవైతివి. నీకు సమానులైన మానవులు ఈ భూమి
యందు లేరు. నీవు నిక్కముగ ధన్యుండవు. నీవలన మేమెల్లరము
సర్వధర్మములను, వివిధ పురాణేతిహాసములను, పవిత్రవంతములైన
పెక్కు రాజన్యుల చరిత్రంబులను, శ్రీమన్నారాయణుని సత్కథలను
వినియుంటిమి. ఇంక శ్రీ పరమేశ్వరునిగూర్చి విన కుతూహలమున
గలిగియుంటిమి. యముని జయించి బాలుఁడగు మార్కండేయునకు
దీర్ఘాయు వొసంగినట్టియు, భక్తుండగు పార్థునకు పాశుపతాస్త్రము
నిచ్చి కౌరవనిర్మూలమునందు సహాయమొనరించినట్టియు, భక్తవత్సలు
డగుటచే బాణాసురుని ఋుటఁ గావలి యుండినట్టియు, పరమపవిత్రు
డగు ఆ చంద్రశేఖరుని ఆశ్రయించినవారికి సకలశుభంబులు గలుగును
ఆయన భక్తులపాలిటి కల్పద్రుమంబన జెల్లును గనుక స్థావర జంగమా
త్మకమైన జగమునంత నేలుచుండిన ఆ గౌరీనాథుని చరిత్రంబును, ఆయ
వ్రతక్రమ ప్రభావంబును, శివభక్తులయొక్క లక్షణంబులను, మహాశి

గించి మా హృదయములను రంజింపఁజేయ ప్రార్థించుచుంటిమి" అని నుడివిరి.

సూతుండును పరమానందమునుఁ జెంది "మునిశ్రేష్ఠులారా! సర్వజ్ఞులైన మీకు దెలియని ధర్మశాస్త్ర పురాణేతిహాసంబులు లేవు. అయినను మీరు అడిగియుంటిరి గాన అంతులకు నేను విధేయుడనై చెప్పవలసియున్నది. సావధానులరై వినుఁడు" అని బలికి గురుదేవునకు వందనంబు గావించి మంత్రోత్కృష్టంబైన పంచాక్షరిని గూర్చి ఇట్లు చెప్పఁదొడఁగెను.

## 2

### పంచాక్షరీ ప్రభావము

ఓ మునిశ్రేష్ఠులారా! ఈ జగమందు పరమేశ్వరప్రీతుంబై, మంత్రరాజంబై వెలయుచున్న పంచాక్షరియొక్క మహాత్వము లెంచగ యెవ్వరికినిశక్యంబుగాదు. ఆ మహామంత్రంబును అభీష్టసిద్ధికై శ్రీమన్నారాయణుఁడు, దేవేంద్రుఁడు, చతుర్ముఖుఁడు మొదలుగాగల వారెల్లరు జపించుచుందురు. ఆ మంత్రమును పుణ్యకాలములగు వ్యాస పూర్ణిమ, యేకాదశి, ద్వాదశి, భానువారము, సంక్రమాణము, సూర్య చంద్ర గ్రహణములందు మధురా ద్వారవతి చిదంబరము కురు క్షేత్రము మిథిల అవంతి వారణావతము గయ ప్రయాగ రామేశ్వర మాదిగాగల పుణ్యక్షేత్రములందును, సింధు యమున సరస్వతి వేణి తుంగభద్ర నర్మద బ్రహ్మపుత్ర గౌతమి మణికర్ణిక మొదలుగాగల నదీ తీరములందును, పవిత్ర పర్వతక్షేత్రములందును, తపోధనులగు మునీశ్వరుల వలనను, కామ క్రోధ మద మాత్సర్యాదులనుండి విముక్తులై శివపూజాపరులై శాంతిగుణులై స్థిరబుద్ధి గలిగి శివప్రియులగు పుణ్య

పురుషులవలనను, ఆత్మశుద్ధి కలిగి మాత్సర్యగర్వములను వీడి గుణ వంతులైనవారు పంచాక్షరీమంత్రమును ఉపదేశమును పొంద అర్హు లగుదురు. అద్దానిని భక్తిశ్రద్ధలతో ఆచరణయందు బెట్టుకొనుచుండు మానవుని మహిమలను వేరొక్కన అదిశేషునికైనను యలవికాదు.

మరియు పుణ్యక్షేత్రమునందు ఐక్యము నొందుచుండిన సాధు జనుని వలన ఆ శాంకరీమహాగుప్తమంత్రమును ఏ మానవుడైనను ఉపదేశమును పొందిన సముద్రపు అడుగున యున్న ముచ్చికచిప్పల యందు బడు స్వాతివాన వలె ఆ మానవుని శుభమోక్షములు సార్థక మును జెందును.

సల్లలితమగు ఈ మంత్రరాజమును మానవులు ఉపదేశమును పొంది హోమతర్పణ దీక్షాదులు లేకున్నను జపమొనర్చి పాపరహి తులై యిష్టార్థములను బడయగలరు.

పూర్వకృతపాపములను పంచమహాపాతకములను హరియించు నదియు, ధర్మార్థ కామ మోక్షములను అతిదక్షతగ నిచ్చునట్టియు, కాశికాగస్త్యాది ఘనమునీంద్రులయొక్క ఘనతను విశదపరచుచున్న ట్టియు, జపపరాయణులకును, సాధుజనులకును నక్షయదశప్రదంబగు నట్టియు, మిక్కిలి శ్రేష్ఠమైన యీ పంచాక్షరీ మంత్రరాజము పూర్వ పుణ్యముల వలన లభియించినదని వేదములు తెలుపుచుండెను.

ఈ మంత్రమును ప్రణవము అయినట్టి 'ఓం' అను శబ్దముతో జపించిన అయ్యది షడక్షరమగును. మీరయ్యది శ్రద్ధాభక్తులతో యెల్లప్పుడును జపియించిన భక్తవత్సలుండగు ఆ పరమశివుండు ప్రీతిం జెందును. కనుక ఆ మంత్రశ్రేష్ఠము భక్తజనులకు పుణ్యలోక మును చూపెట్టుటకై ఉత్తమమైన మార్గదర్శిగను, సంసారసాగర మందు యీదులాడుచు దరిజేర ప్రయత్నించువారిని కష్టములనుండి

తొలగించుటకు అన్వేషణాయోగ్యముగను, స్వచ్ఛమైన సుఖముల నిచ్చి ఆత్మానందమును కలుగజేసి ఫలంబునిచ్చు మంత్రంబులలో కెల్ల ఉన్నతమై యలరుచున్న ఈ శైవషడక్షరము నిత్యము అనేక పూజ్యులచే స్మరింపబడెను.

మరియు నక్షత్రమండల మధ్యమందు విరాజిల్లు చంద్రుని వలెను, బహువృక్షమధ్యమందు కల్పవృక్షమువలెను, పర్వతముల మధ్యమందు కనకగిరివలెను ఈ షడక్షరమంత్రము మంత్రములమధ్య శ్రేష్ఠతరమై యొప్పెను.

"శా. మంత్రంబు శివస్వరూపము దూరీభూత తాపత్రయం
బామోదప్రద మార్యసమ్మతము తత్త్వార్థప్రదీపంబు శ్రీ
రామాగస్త్య మహర్షి లోకభజనార్హంబైన పంచాక్షర
శ్రీమంత్రంబున నమశ్శివాయయనుచున్ జింతింపుడశ్రాంతమున్"

## ౩

### కాశీపురము

దిగంత విశ్రాంతకీర్తియగు భరతవర్షంబున బరమసుఖాస్పదంబై, సకల సంపత్సమృద్ధంబగు కాశీపురంబను మహాక్షేత్రము గంగాతరంగిణీ తటంబున విరాజిల్లుచుండెను. ఆ పవిత్రనదీజలము మాధుర్యంబున జెరకుపాలను నిర్మలత్వంబున మౌక్తికరాజంబులను పరిహసించుచుండెను. ఆ నగరము నారికేళ క్రముక పనస జంబీర ఖర్జూర మాలూర సౌవీర చందన మందార జంబూకదంబాది తరుమండంబుల తోడనున్న, మాలతీ మల్లికా శ్యామంతి కురంటక చంపకాద్యనేక పుష్పవాటికా శోభితంబైన ఉద్యానవనములతోడనున్న శోభిల్లుచుండును. ఆ నదీతీర మనుదినము బక బలాహ చక్రవాక కోయష్టిక

కారండవ మొదలుగా గల పక్షిసముదాయమునకు విహారయోగ్యమై మంజుల నిస్వన మండితంబై, విశ్వేశ్వర మహోత్సవ సందర్శనార్థమై యరుదెంచు చతుర్విధ వర్ణాశ్రమ జనుల కలకలారావసమన్వితంబై మృదంగ పటహ నిస్సాన వేణువీణాది వాద్యహృద్యంబునై, బ్రహ్మలోకమువలె వేదాధ్యయనములతోడను, మహేంద్రభవనమునుబోలె బహు విబుధాకీర్తనములతోడను, మానస సరోవరమువలె రాజహంసలతోడను, చంద్రమండలమును పోలె నమృతాస్పదంబై నారాయణాశ్రమంబునుఁబోలె జగత్పావనంబై యొప్పుచుండెను.

ఈ భూలోకమందున్న ముక్తిదాయకంబులై యొప్పు నగరంబులన్నిటియందు ప్రథమగణ్యంబై కాశీపురము మిక్కిలి సిరిసంపదలతో తులతూగుచుండెను. అయ్యది బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి మొదలుగా గల వారెల్లరకు సేవ్యయోగ్యమై యలరారుచుండెను. మరియు దర్శనమాత్రమున పంచమహాపాతకములనెల్ల భస్మీభూతము గావించుచు కైవల్యసంధాయకంబై, భువనప్రసిద్ధమై ప్రళయకాలమునందు కాలభైరవుని మొలయందుంచబడిన త్రిశూలమువలె ప్రకాశించు హేమాలయ కటియందు స్థిరముగ సంస్థాపితంబు గావింపఁబడెను. ఆ క్షేత్ర మహాత్మ్యము నీలకంఠునికిఁ దక్క వనజభవునికైనను, కౌశికునికైనను, మరెవ్వరికైననుఁ జెప్పశక్యముగాదు. ఆ క్షేత్రమందు కాలభైరవుఁడు, గణాధిపతి, బింధుమాధవుఁడు, విశ్వనాథుఁడు, పార్వతీదేవి వెలసియుండిరి.

"నే నెప్పుడు కాశికాపురి కేగి గంగాస్నాన మాచరించి వేడ్కతో విశ్వనాథునిఁగాంచి యింపుమీరగా కాలభైరవేశ్వరునకు మ్రొక్కి మోక్షమునొందుదును" అని కోరికఁ గలిగి ఆతురతతోయుండు మానవునకు ఆ పరమేశ్వరుడు అఖండసంపదలను కలుగజేయును.

అన్నగరంబునందుగల సౌధములు హాటక వజ్రమణి ప్రభలం బ్రదీప్తములై, నభశ్చుంచిత సంవరణప్రావృతంబులై, దినవాథ రజనీ నాథుల బాటల కాటంకము గలిగించుచున్నవో యనఁ జూపరులకు వింత గలిగించుచుండును. మరియు సకలవేదశాస్త్ర పురాణాది విద్యా గరిష్ఠులైన విద్వాంసప్రవరులతోడను, గదనతలంబునం దడుగిడి వెన్నిచ్చి పారక పురహరునైన నోడింపఁగల సమర్థులగు మహాయో ధులతోడను, కోటికి పడగలెత్తి అలకాధిపతినైన నిరసింపగల వణి క్పుంగవులతోడను, మిన్నులరాయు ధాన్యపురాసులు గల్గి బలునైన మెచ్చని పూతస్వాంతులగు సేద్యగాండ్రతోడను, వేగ తిరస్కృత పవ మానస ఘోటకరాజంబులతోడను, నవిరళ మదధారాసిక్త మార్గం బులు గల వారణశ్రేష్ఠములతోడను, ఘోరరణ గంగోద్భటులగు వీర భటులతోడను, శైలోపములై ప్రవిమల కేతుయుక్తములగు రథాంగ పంక్తులతోడను, నర్తనయందు రంభోర్వశీ మేనకాదులనైన వ్రీడబుచ్చు రత్నహాటక మణిమయ భూషణాలంకృతులగు వేశ్యాంగనలతోడను, భూకాంతకు మేలిభూషణంబో యన ప్రశస్తవస్తు విసరనికేతనంబై యా కాశికాపురంబు వరలుచుండెను.

ఆ పట్టణమునకు సకలలక్షణసంపన్నుఁడగు ఒక రాజన్యచూడా మణి యేలికయై దుర్మదాంధులగు వైరిధరాకుతంధరుల నాజిరంగం బులఁ బరాజితులంజేసి తనప్రతాపమును వెల్లడిజేయుచు, రాజ్యమందు చోర యీతి క్షామములు లేకుండ యేలుచుండెను. మరియు ఆ నృపా లుఁడు నిరంతరము దైవకార్యములందును, దానధర్మంబులందును, నిమగ్నుఁడై ధనరాసులకు మహోత్సవములను జరుపుచుండెను. ఈ విధ ముగ ఆ రాజన్యుఁడు శ్రీ విశ్వేశ్వరుని కరుణచే బుధులెల్లరు నుతింప మహా వైభవముతో దేవేంద్రునివలె రాజ్యము నేలుచుండెను.

# 4

## కళావతి

ఇంతటి మహావైభవమును యనుభవించుచున్నను యీ రా
చంద్రుని బిడ్డలులేని కొరంత బాధించుచుండెను. అందుల కాతఁడు అ
నిష్టతో భార్యాసమేతుఁడై పార్వతీపరమేశ్వరుల వ్రతములను శు
ప్రదముగ నాచరింపుచు వివిధ దానధర్మములను చేయుచు, ని
సదనమున కరుదెంచు ఋషీశ్వరులకు సేవలుజేయుచు, భక్తియుక్తుఁడై
యుండ ఆ పరమేశ్వరుని కృపచే యెల్లరకు సంతసము గొల్పునట్లు
నా యింతి గర్భమును దాల్చెను. మణిభూషణాదులెల్ల బిగువయ్యెను.
నడుము లావయ్యెను. నిద్దుర హెచ్చెను. దేహకాంతి మించెను. ఆహా
మంగు నిష్టములేనిదయ్యెను. గోరిక లుదయించుచుండెను. ఇట్లు
ఆ తరుణీరత్నము నానాటికిని యంతర్వత్నియై తొమ్మిదినెలలు నిండ
పదవమాసమున గణములన్నియు యొక శుభరాశియందుండ రాజాంతః
పురముననేగాక పట్టణమునందలి జనులెల్లరకు ఆహ్లాదము గొల్పునట్లు
లక్షణవతియగు ఒక కన్యక జన్మించెను.

ఇట్లుదయించిన ఆ కన్యకారత్నమునకు జాతకకర్మాది సంస్కా
రంబులెల్ల నిర్వర్తించి యీ భూపాలుఁడు పరమానందముతో విశ్వేశ్వ
రుని గొల్చుచు శివభక్తులకు భూహిరణ్యాది దానంబులుగావించి హైమ
వతిని గాంచిన హిమవంతుని వగిది సంతుష్టాంతరంగుఁడై యుండెను.
ఒక శుభముహూర్తమున ఆ కన్యకాలలామ శ్రీమతియు, ధీమతియు,
భానుమతియు యగుటఁజేసి గళావతి యని నామకరణ మిడెను. ఇట్లు
ఆ బింబాధరి దిన దిన ప్రవర్ధమానయై ఆ నెమలియొక్క నెమలిపింఛమును
మించు తుమ్మెదరెక్కలవంటి కురులును, చంద్రబింబమును కళంకము
జేయు మోమును, శ్రీకారముల శ్రీహసించు కర్ణంబులును, కమల

దళంబుల దెగడు నేత్రములును, చంపకంబుల బ్రద్దలుచేయు నాశికయును, బింబంబుల విరక్తిజేయు నోష్ఠంబును, కుందకుట్మలంబుల విదళించు దంతపంక్తియు, దర్పణంబుల దర్పంబడంచెడు చెక్కులును, శంఖంబుల కీచుమనిపించు గళంబును, బ్రహ్మయొక్క సృష్టిని ఆశ్చర్యంబు గొల్పుచుండెను.

ఆయమ శైశవమునందే అతి మేధావంతురాలై కావ్యనాటకాలంకారముల నెల్ల భాసంబుగావించి విద్యాధరియై తలిదండ్రుల హృదయమును రంజింపఁజేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు ఘనతపోవిలాసుఁడై యోగాభ్యాసుఁడైన దూర్వాసమహాముని రాజసభ కరుదెంచెను. సాక్షాత్తు శంకరునిపగిది యరుదెంచుచున్న యా మహామునిని గాంచి యా నృపాలుఁడు తన యదృష్టమున కెంతయు సంతసించి మంత్రివర్గంబుతోడను, విద్వాంసులతోడను యెదురేగి అతిథిని అభ్యుత్థానపూర్వకముగా గొనివచ్చి అర్ఘ్యపాద్యంబు లొసంగి యర్హాసనమున కూర్చుండ నియమించి యభివాదన మొనర్చి మృదువచనములతో భాషింప మొదలిడెను.

"ఓ యోగికులచంద్రా! చిరకాలము తప మాచరించి యనేక పుణ్యతీర్థములను సేవించి దేవస్వరూపులై మహర్షిశ్రేష్ఠులైన మీ చరణసేవచే సత్వరమార్గంబున మోక్షప్రాప్తిని బొందితిని. మరియు నో మునిసార్వభౌమా! తమ రరుదెంచినందున నా గృహమెల్ల పావనం బయ్యెను. నా కామితములెల్ల ఫలించెను. కడు ధన్యమాన్యుఁడనైతిని. నా మనం బెంతయు సంతసముగ నుండెను" అని నుడువుచు ఆ మునిసత్తమునకు సతీకుమారీ సహితుఁడై పూజ లొనర్చి సదమల మృష్టాన్నపాన సంతృప్తుని గావించి పాదసేవ యొనర్చెను.

ఇవ్విధంబున పరిచర్య లొనరింపుచున్న రాజునుఁ గని ఆ మునీశ్వరుఁడు పరమానంద కందళిత హృదయారవిందుఁడై "ఓ నృపసార్వ

భామా! నీయొక్క రాష్ట్రమందున్న దుర్గములు సౌధములు బలము నున్నవిగదా? భద్రాశ్వబలగములు గోగణంబులు ఆరోగ్యము నున్నవిగదా? నీవును భార్యాబిడ్డలతోడను, బంధువర్గంబుతోడ సుఖివై పూర్ణభోగంబులను పొందుచుంటివిగదా? నీ రాజ్యమందె బాధలును లేవుకదా?" అని ప్రియము మీర బలుక ఆ నృపచంద్రుడు మహావేడ్కతో "మీయొక్క ఘనతర కారుణ్యముచే సర్వము కు లముగ యున్నది. ఓ మునిచంద్రా! నా యొక్కయు నా రాజ్యమ యొక్కయు క్షేమ మారసి మదీయ గృహమందు కొన్ని దినంబు వసించి నా కనులకు పండువొనరింపుము" అని ప్రార్థింప దూర్వా సుడు అందుల కియ్యకొనెను. అప్పుడా ధరణీపతి ఉప్పొంగుచు త కుమారీరత్నమగు కళావతిని గాంచి "అమ్మా! ఈ మహాత్ము మన గృహమందున్నంతకాలము నీవు అతి వినయముతో సమ్మతము భోజనపానములతో సత్కరించి పూజించుచుండెదవేని తన హృ యంబునందు సంతసిల్లి జగమునంతను సంతసింపజేయును. అప్పుడ మన యభీష్టము లెల్ల శుభప్రదంబుగ సిద్ధించును" అని ప్రి మీరం బలుక కళావతి అందులకు వినయవతియై సమ్మతించి, ఆ ము చంద్రుని సుందర వనమధ్యమందు నిర్మింపబడియున్న ఒక దివ్యభ నంబునకు గొనిపోయి అందు నివాస మేర్పరచెను.

పిదప రాజకుమారియగు కళావతి ఆ మునీంద్రుని యనుదినమ సంధ్యాకాలములందు పుణ్యోదకముతో స్నాన మాచరింపజేసి, విలు గల మధుపర్కములను గట్ట నిచ్చి, సువర్ణాసనముపై కూర్చుండ నిం మించి, మంచి పరిమళముగల సుగంధమును మేనునకుంబూసి, బి దళముల చేతనున్నూ, పుష్పముల చేతనున్నూ యా మహానుభావు పాదపద్మములను పూజించి పరిమళ దీప ధూపంబుల నొసంగి మ పేతముగ భోజనమిడి పరితుష్టునింగావింపజేసి శీతలజలముతో అ

దాహమును దీర్చి, హస్తపాదములను శుభ్రపరచి, హిమాంబువులను ఆచమింపఁగఁజేసి, హంసతూలికాతల్పముపై శయనింపఁజేసి, ఆతని పాదములను తన మృదుహస్తములతో ఒత్తి యిట్లు అనేకవిధముల వినయవతియై ఆరాధించుచుండెను. ఈ రీతిగ కొన్నిదినములు గడచెను. ముని కళావతిపై కారుణ్యము వహించి ముదముతో "బాలామణీ! నీ సుశీలవృత్తములకు వినయములకు నీ వివేకమునకు పరమానందముఁజెందితిని గనుక నీకు పంచాక్షరీమంత్రమును యుపదేశించెద శ్రద్ధగొనుము" అని బలికి ఆ క్షణమునందే కృపాకలితమగు కటాక్షామృత దృష్టిని యా బింబాధరిపైఁ బరపి పంచాక్షరి నుపదేశించి యథేచ్ఛగా రాజాంతఃపురమును విడిచి వెడలెను.

## 5

### కళావతీ పరిణయము

మహామునీంద్రుఁ డగు దూర్వాసునిచే పంచాక్షరీ మంత్రోపదేశంబునుఁ బొంది, కన్యకాలలామ యగు కళావతి విధూతకల్మషయై, వినిర్మల స్వాంతయై, సదాచారపవిత్రయై, పుణ్యచరిత్రయై, నిరతంబును ఆ మంత్రానుష్ఠానమందు నిమగ్నయై యుండెను. ఇట్లుండ కొంతకాలమున నవయౌవనవతియై, సకలసద్గుణవతియై, సర్వజనమాన్యయై సౌజన్యధన్యయై యున్న యా కన్యకకు వరుని అన్వేషించుటకై రాజన్యుఁడు చారులను నియమించెను.

మహావిద్వాంసులతోడను, సకలవైభవముతోడను, ధన కనక వస్తు వాహనములతోడను, విరాజిల్లుచున్న మధురాపురి యను పట్టణమొకటి కలదు. అయ్యెడ మదనప్రోజ్జ్వల విగ్రహయువకుఁడై మృదువాఙ్మయధురీణుఁడై యదువంశచంద్రుఁ డనదగు దాశార్హుఁడను రాజ

మహాప్రతాపముతో పరిపాలనాదక్షుఁడై శౌర్య ధైర్యగుణములకు నిధియై ప్రజలచే నుతింపఁబడుచుండెను.

ఆతని గుణగణముల నన్నిటిని విన్నవాఁడై కాశీపురాధీశు దాశార్హుని గౌరవపూర్వకముగ బిలిపించి సమ్మతినిఁ గొనినపిదప శుభ ముహూర్తమున వేదోక్తవిధిని సకలజన నయనోత్సవంబుగా తన కుమార్తె యగు కళావతిని యాతనికిచ్చి పాణిగ్రహణముఁజేసి హయ గజ స్యందన విలాసిని శతంబులును, గోసహస్రంబులును, అపరిమితంబు లైన సువర్ణ మణి మయాంబరాభరణంబులు మొదలుగాఁ గల సమస్త వస్తు సముదాయమునిచ్చి ఆ వధూవరులను మధురాపురికి సాగనంపెను.

వివిధాలంకారశోభితం బగు మధురాపురికి దాశార్హమహీ పాలుఁడు సతీసమేతుఁడై తూర్యఘోషణంబులు చెలంగ విచ్చేసి రత్న స్తంభ విభ్రాజితంబును, హరిన్మణిస్థాపిత ద్వారదేహళీ నిర్మితంబును, నవాశ్వత్థ రసాల పల్లవతోరణ మాలికాకృతంబగు నిజశుద్ధాంతభవన మునకు సకలకళ్యాణ మహోత్సవంబుతో ప్రవేశించి సంతర్పణంబులఁ గావించి, నిజసామ్రాజ్యభోగంబు లనుభవించుచుండెను.

పిమ్మట దేవేంద్రభోగముల ననుభవించు ఆ దాశార్హ మహీపా లుఁడు ఒక శుభముహూర్తమున నాటిరాత్రి నిజకాంతా ప్రథమ సంగ మాపేక్షుఁడై కమలాప్తప్రభ గల్గునట్టి శయనాగారమున మల్లికాసుమ శయ్యయందు మన్మథునివలె శయనించియుండెను. అప్పుడు రాజమంది రమున విడిచిపెట్టఁబడిన లేడిపగిది, మన్మథుని రాచిలుకవలె, నక్షత్ర మండలమున నుండి జారిన నక్షత్రము భాతి, మయునిచే నిర్మింపఁబడిన రత్నమయ పుష్పకమువలె దీపించు మోహినీదేవిలీల, నిర్మల సువర్ణ రత్న మాణిక్యఖచిత భూషణంబులను దాల్చి కళావతి సహజవ్రీడతో యరుదెంచి జీవితేశ్వరుని మ్రోల నిలచియుండెను. ఇట్లు తన సామీప్య మున నిలచియున్న సౌందర్యవతిని జూచి దాశార్హుఁడు సంగమాశక్తి

గలవాఁడై యెన్నివిధముల బిలచినను బలుకకుండుటచే యామెను కరముబట్టి దరికిఁదీసికొన నుద్యుక్తుఁడయ్యెను. అప్పుడా కళావతి పతి సంభ్రమమును గ్రహించినదై "ఆర్యా! నన్నంటవలదు. మీరు వార కాంతాది కామినులతో ప్రవర్తింపుచు, నిర్మలాచారంబు లేమియు లేక మధుమాంస ద్రవ్యలోలురై మెలంగుచుండిరి. వ్రతము లాచరించు యింతియు, యుపవాసదీక్షనుంచున్న వధూటియు, గర్భిణీసతియు, రోగపీడితయు సంగమమున కయోగ్యులు. ఇప్పుడు యేను శంకరవ్రత జపమంత్రతంత్రములందు నన్నెక్కి పరమపవిత్రురాలనై యుంటిని. అట్టి నన్ను మీవంటి అనాచారపరులు అంట శక్యముగాదు గనుక దయచేసి తొలగిపొండు" అని బలికినంతనే ఆ రాజన్యుఁడు అత్యంతాశ్చర్యంబును బొంది భయోత్కంపముల నెద్దియు నుడువుటకుఁ దోచక కొంతతడవు మిన్నకుండెను. కళావతిపై మోహభ్రాంతి కలవాఁడగుటచే ఆ మహీపాలుఁడు కొంత ధైర్యమును చిక్కఁబట్టినవాఁడై "ప్రాణేశ్వరీ! ఇదియేమి? నీ విట్లు నన్ను నిందించుట న్యాయమా? ఎందైన దంపతులపట్ల నిట్టి నిబంధనలుండునా? సతీపతులు కలసియుండునప్పుడు కలుగు సుఖమును మించినది లేదని నీవు వినలేదా?" అని పలికిన ప్రాణవల్లభునకు కళావతి "ఆర్యపుత్రా! పరమ తపోధనుఁడును, అత్రిమహాముని పుత్రుఁడును, త్రినేత్రాంశావతారుండును, మంత్రపురాణాగమ తత్వవేదియు నగు దూర్వాసమహర్షి యొకప్పుడు నా తండ్రి సదనమున కరుదెంచి నాచే పరిచర్యలను బొంది ప్రీతిఁజెందినవాఁడై దయతో నాకు శైవ పంచాక్షరీ మంత్రమును యుపదేశించెను. నే నద్దానిని విధ్యుక్తంబుగ జపియించి బవిత్రనైతిని. మీరు సదాచారులు కారు. దురాచారవృత్తిని గలిగిన మీరు సద్గురునియొక్క సేవ యొనరించి సదుపదేశమును బొందిన మేలుచేకూరును" అని పలుక ఆనృపాలుఁడు పంచాక్షరీ మంత్రమును తన కుపదేశించి పవిత్రునిగ యొనరింపుమని

నడుమ కళావతి ప్రౌఢవాక్యములతో "నాథా! మీకు నేను భార్య
నానలన మీరు అట్టి మహామంత్రము నుపదేశమును పొందిన
మీకీర్తికి లోపము కలుగును గనుక మీరు మీ కులగురువగు
మునీశ్వరునకు ప్రణమిల్లి పూజించిన, ఆ మహాత్ముఁడు ఆ పవిత్ర
క్షరిని మీకుపదేశించి కృతపుణ్యునిగ నొనరించును" అని పలికిన
దాశార్హుఁడు ఆనందించి పసులెవ్వ రెఱుంగకుండునట్లు భార్యా
తుఁడై గర్గమునీశ్వరుని ఆశ్రమమునకుఁ జని ఆ మునీశ్వరుని యచ్చ
గాంచి, యాతని పాదములకు ప్రణమిల్లిరి. భయభక్తులతో నడి
యచ్చటి కరుదెంచిన వారలను కనుగొని యా సంయమీంద్రుఁడు
నార్ద్రహృదయుఁడై "ఓ రాజేంద్రా! ఈ యర్ధరాత్రమునందు శయ
గారము విడచి మీరిచ్చటికి వచ్చిన కారణమెద్ది?" అని ఘన
భాషించెను.

అప్పుడు కళావతి "మహాత్మా! ఈ మహీపాలుఁడు పా
పురుషుండును సదాచార వర్జితుండును నై యుండెను గావున మీ
రిప్పు డీ నృపాలుని కటాక్షించి భోగమోక్షప్రదంబును, నిహపర
కంబును, బరమపవిత్రంబును, మంత్రరాజంబు నైన శైవ పంచా
బుపదేశించిన యితండు కృతార్థుండగును. ప్రారబ్ధంబులైన దుష్క
బులఁ దొలంగి సకలశుభంబులు ప్రాప్తించునట్లు ప్రసాదింపుఁడు"
ప్రార్థించెను. అప్పు డా యోగివర్యుఁడు అమ్మానినియొక్క
మధుర భాషణంబుల కలరుచు యట్లు గావింప సమ్మతించెను.

అప్పు డా ఋషిసత్తముఁ డా రాజదంపతులను యమునా
సమీపమునకుఁ గొనిపోయి, కళావతిని నదీతీరమునందే యుండ
మించి, భూపాలుని సంకల్పపూర్వకంబుగ నఘమర్షణస్నాన
రింపఁజేసి, లలితమైన విభూతిని ఫాలతలమున నలది సిద్ధాసనస్థుని
తన పాదతలంబున యాతని హస్తంబుల నునిచి విధ్యుక్తమార్గ

శైవపంచాక్షరోపదేశంబును యొనరించెను. పిమ్మట యా ధరణీపతి మహేశ్వరుని మదిలోఁ దలంచుచు జపము చేయుచు నుండెను. అట్లు గిరిజాధీశుని మనస్సునందు మహానిష్ఠతో భూకాంతుఁడు జపియింపఁగా ఆతనిని యాశ్రయించుకొని యున్న పాపంబు లనేకములు పైకెగసి వాయసంబులుగ మారి రెక్కలు దగ్ధము కాఁగా కాకారముఁజేయుచు ఆ యమునానది మధ్యమందుఁ బడెను.

అప్పుడద్దానికి మహాశ్చర్యమును జెంది నృపాలుఁడు గురువు వద్దకుఁ జని ఆతనికి వందన మాచరించి జరిగిన చోద్యము నెల్ల నివేదించెను. మునివర్యుండును సంతసమంది "ఓ భూవల్లభా! నీవు పూర్వ భవ కృతంబై వెలయు గలుషంబులన్నియు పంచాక్షరీ ప్రభావంబుచే నిన్ను విడచి గడ్డిపోచవలె దగ్ధములై నశించెను గనుక సదాశివానుగ్రహమున యీ మంత్రరాజంబు ప్రాప్తంబయ్యెను. దానివలన నీవు ధర్మశీలుండవైతివి. ఇంక నీవు దేవీసహితుండవై సమ్మదంబున సుఖమును బడయఁగలవు. మరియు నీయొక్క వంశంబున భగవంతుఁడైన శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణభగవానుఁడై యవతరించి మీ కులంబును పావనం బొనరించును" అని పలికి యా రాజదంపతుల నాశీర్వదించి వారలను తన ఆశ్రమమునకుఁ దోడ్కొనివచ్చి పిమ్మట రాజధానికి సాగనంపెను.

అప్పుడా రాజదంపతులు రాజహంసలవలె సముల్లసతేజముతో తమ సౌధమునకు విచ్చేసి తమవరి పరస్పర ప్రేమానురాగంబుల సురుతర సౌఖ్యముల ననుభవింపుచు పరిపూర్ణ మనోరథులై యుండిరి. మరియు వా రనుదినము వందిమాగధుల కైవారంబులతో నిదురనుండి మేల్కాంచి నిర్మలచిత్త మనస్కులరై విధ్యుక్తమార్గమందు స్నాన మాచరించి పంచాక్షరిని జపియించి దేవపూజ యొనరించి, శివభక్తులను మృష్టాన్నపాన సంతృప్తులను గావించి వర్ణాశ్రమ ధర్మములను దప్పకుండ ధారుణీతలమును పాలించుచుండెను.

# 6

## మిత్రసహ మహీపాలుఁడు

పంచాక్షరీ మంత్రంబును, యీ మంత్రరాజముయొక్క మ
మయు శౌనకాది మహామునులకెల్ల చెప్పిన పిదప వారియొక్క కో
ననుసరించి సూతమహర్షి శివమహత్త్వంబును చెప్పఁదొడంగె
"ఓ మునివరులారా! పాపంబులనన్నిటిని నశింపఁజేసి, ముక్తిమార్గ
నకు మార్గదర్శియై, దివ్యభోగములకు సాధనకారియై, ఆపదల
బాపి జయప్రదమునుగొల్పు రమ్యతరమైన ఫాలలోచనుని మహత్త్వ
నెన్నఁగ నెవ్వరికిని శక్యముగాదు. అయ్యది ఆయుర్వర్ధనమై రుజాప
ణమై ఆరోగ్యసంధాయియై శ్రేయసాధకమై తపోఫలమును జేకూర్చు
క్షేమకరంబై యెల్లప్పుడును ప్రాయశ్చిత్తములేని పాపములఁ బాపు
పుణ్యప్రదంబైన ఆ పరమశివుని గాథనంతయు ప్రమోదపూర్వకము
మీకెల్లరకు వినిపించెదను. ఉత్తమంబైన సుత్తరాయణంబున పు
ప్రదంబైన మాఘకృష్ణ చతుర్దశియందు వేకువఝాముననే లేచి
యుక్తముగ స్నానమాచరించి దినమంతయు నుపవాస మొనరిం
భయభక్తులతో పరమశివునకు ఆగమాభిషేకము లొనరించి బిల్వద
ములతో పూజించి రాత్రియంతయు శైవ కథా శ్రవణముతో జాగ
మొనర్చవలెను. బ్రహ్మ విష్ణు మొదలుగాగలవారు, సంయమివరు
విమలాభిషేక పూజాక్రమముల వ్రతము నాచరించి యభీష్టసిద్ధి
బడయుచుండిరి" అని చెప్పి ఒక యితిహాసమును చెప్పఁదొడంగెను.

సకలసంపదలకు నాకరంబై కరంబలరారు ధరణీరమణికి నాభి
గాయమానంబై యీ భరతఖండంబున సంపాదిత సుకృత విసర య
సరయూనదీ పరిసరంబున నిఖిలసిద్ధ జనారాధ్యమై సాకేతంబను పు
బొండు కలదు. అయ్యది మిహికులవరేణ్యులగు రాజన్యులకెల్ల బ

పరానుభూతంబై యుండును. అట్టి పట్టణంబునకు గగనమణి గోత్ర గ్రామణియు రాజన్యచూడామణియు నైన మిత్రసహుఁడు యేలికయై ధరాపరిపాలనంబుఁ గావించుచుండెను. ఆ నృపాలుఁ డెల్లప్పుడు ఘోర వనముల కేగి దారుణంబులైన క్రూరమృగంబులనెల్లఁ గూల్చుచు సంయమీంద్రులకు సౌఖ్యమును జేకూర్చుచుండెను.

ఇట్లు వనంబులోనం గలుగు దుష్టమృగంబుల సమయించుచున్న సమయంబున నొక రక్కసునిఁ గని వాని నొక్క నిశితశరంబున విగత ప్రాణుని గావించెను. అప్పుడు వాని సహోదరుఁడు మాయచేసి సూప కారి వేషమును దాల్చి ఆ రాజన్యునికడకు వచ్చి బద్ధాంజలియై తాను నానావిధ విచిత్ర.పాక క్రియా నిపుణుండననియు, తన్ను సేవింపఁగోరి యట కరుదెంచితి ననియు విన్నవించెను. రాజయ్యది యదార్థమని దలంచి వానిని దోడ్కొనివచ్చి తన మందిరంబున సూపకారిగ నియ మించెను.

ఒకనాఁడు పితృకర్మను జేయుటకై మృగమాంసమును పచ నము చేయ కలంకమతి యగు యా మాయా సూపకారికి నియమించి తాను నిజపురోహితునిని మంత్రితునిఁజేసి భోజనంబిడు వేళయందు సూపకారి గొని వచ్చిన మాంసమును వడ్డన గావించెను. అయ్యది నరమాంసముగ గ్రహించి ఆ వసిష్టమానీంద్రుఁడు అలుకఁజెంది తన కయోగ్యమైన పిశీతమును వడ్డన గావించినందులకు రాజేంద్రుని తూల నాడుచు దైత్యుఁడవుఁ గమ్మని శపియించెను. అప్పు డా రాజపుంగ వుఁడు తాను నిరపరాధి గావున గురువునందు కోపమును వహించి ప్రతిశాపం బిచ్చు తలంపుతో జలమును గొనియున్న సమయంబున అతని సతి యచటి కరుదెంచి శాంతపరచెను. నిజభార్యానుకూలుఁడు గావున మిత్రసహుండు చేతియందలి జలమును ఆమె చెప్పిన పగిది తన పదములపై నిడుకొనెను. అట్లు గావించినంతనే ఆ జల స్పర్శనమువలన

మిత్రసహుని పాదములు కమలెను గనుక అదిమొదలు ఆ రాజున్ గల్మాషపాదుండను నామముతో సార్థకమును జెందెను. పిదప మహర్షి తన దివ్యదృష్టిచే జరిగిన వృత్తాంతమునెల్ల గ్రహించి ఆ న్యుని అపరాధము గోరంతయును లేకుండుటను గాంచి మిక్కిలి తించి తుదకు పన్నెండుశతాబ్దంబులు రాక్షసత్వమును పొందిన పి మానవుఁడై చరియించునని బలికెను.

అట్లు గురుశాపమును పొంది గల్మాషపాదుఁడు ఘోరరా రూపమును దాల్చి క్రూరుఁడై తన రాజ్యమునందలి జనులనెల్ల బ చుచు నిష్కరుణుఁడై మృగ పక్షి పశువులాది జంతువులఁబట్టి యించి వాని మాంసములు దినుచు కాలంబును గడపుచు కఠినల్పై యుండెను. ఒకనాఁడు గల్మాషుఁడు యొకన మొకింతయైన సమరకపి దున దారుణమైన ఆకలిబాధకు ఓర్వఁజాలనివాఁడై, ఒక పవిత్ర మిథునంబును గాంచినవాఁడై హఠాత్తున ఆ ద్విజునిపైఁబడి, యడ్డు వచ్చి తత్పత్ని రోదనముఁ గావించుచుండినను లెక్కఁగొనక వా చంపి భక్షించెను. మహాఘోరమగు తన భర్త మరణమునకు వి లిగా విలపించి తుదకు వేసారి కోపఘూర్ణితయై యా భూసురాం "ఓ నృపాధమా! కృపావిహీనుఁడవై పవిత్రుఁడైన నా ప్రియునిఁ అ చంపితివి గావున నీవు నీ సతిని పరిగ్రహించిన భ్రష్టజీవి వౌదువు" శాపంబిచ్చి తన భర్త కళేబరములతో తాను అగ్నిప్రవేశ మయ్యె అంత భూకాంతుఁడు ద్వాదశాబ్దములు నిండినందున రాక్షసభావంబు పరిత్యజించి క్రమ్మర మానుషత్వంబును వహించి గురుజనులయొ ప్రేమకు పాత్రుఁడై రాజ్యము చేయుచుండెను.

ఒకనాఁడు ఆ రాజేంద్రుఁడు నిజ భార్యా సంగమాపేక్ష భూసురశాపంబును జ్ఞాపకమునకు వచ్చినను లెక్కఁగొనక భోగలా

తను జెందెను. పిమ్మట రాజపత్ని గర్భమును దాల్చి నవమాసానంతర మున అశ్మకుండను కుమారునిఁగనెను.

ద్విజభామినీ శాపప్రాప్తిచే గల్మాషపాదుఁడు రాజ్యమునందును భార్యాబిడ్డలయందును నిస్సంగుఁడై సర్వమును విసర్జించి సన్యాసియై దేశమునందెల్ల సంచరింప మొదలిడెను.

ఇట్లు దేశదిమ్మరియై జరుచుండిన గల్మాషుఁడు తానొనరించిన బ్రహ్మహత్యాపాతకమువలన మార్గమధ్యంబున భీకరమైన దంతావళ ములతోడను, బిరుసైన వెంట్రుకలతోడను, అగ్నికణముల రాల్చు నేత్రములతోడను, కంఠమునందు పుర్రెలతోడను మహాభయంకరమైన పిశాచిని గాంచెను. గాంచినంతనే భూవరుని గుండెలు ఝల్లుమనెను. ముచ్చెమటలు బట్టెను. మహాభీతచేతస్కుఁడయ్యెను. చేయునదిలేక కొంతవడికి యా భీకరారణ్యమునుండి పిశాచము వెంటఁబడి దరుము చుండఁగా గల్మాషపాదుఁడు పరుగిడఁజొచ్చెను అప్పుడు దైవవశమున గౌతమ మహామునిని గాంచి సవినయంబుగా దండప్రమాణంబు లాచ రించి ముకుళిత కరకమలుండై నిలచెను. దీనవదనముతో నిలచియున్న ఆ రాజును గాంచి గౌతముఁడు "రాజవతంసా! నీవు రాజ్యాభరణాదు లెల్ల త్యాగము గావించి, ఒంటరిగ ఈ కాంతారములందుఁ దిరుగ కారణమేమి? రాజ్యమందు నీ భార్యాబిడ్డలు, బంధుప్రియులు, ప్రధాన తతులు క్షేమముగ నున్నవారా?" అని కృపాళువై పలికెను.

అప్పుడా నరేంద్రుఁడు "మునీంద్రా! నా రాజ్యమునందు పుత్ర కళత్ర సుహృజ్జనాళి యెల్లరు సౌఖ్యముగ నుండిరి. అయినను మత్కృత కల్మషంబులు పిశాచరూపమున భీకరముగ మారి నన్ను వెంటాడించు చుండెను.

గోమేధంబు లొనరించితిని. గ్రామంబులతో రథాశ్వ కరివర ముక్తాదామాది దానంబు లొనరించితిని. అనేక పుణ్యతీర్థములను

సేవించితిని. వ్రతములు పూజలు క్రతువులు నెన్నియో యొన్ని
గాని నా పాపంబు లన్నియు నశించుటలేదు. అదియునుఁగాక య
హారంబులైన ప్రాయశ్చిత్తంబు లనేకంబు లొనరించితిని. అయి
యిమ్మహాదుష్కృతంబులకు నిష్కృతి గలుగ నేరకున్నది. మహా
కారుణ్యసముద్రుండవగు నీ ప్రసాదంబునం జేసి కృతార్థుఁడ నగు
నన్ననుసరించుచున్న ఈ బ్రహ్మహత్యా మహాపాతకము నితరుల క
రంబై నా యొక్క దృష్టిపథంబునంబడి పీడించుచు వెనువెంట
యున్నది. ఇట్టి విపత్సముద్రమున మునింగియున్న నన్ను దరిజేర్చి
క్షింపుఁడు" అని ప్రార్థించెను.

# 7

## గోకర్ణక్షేత్రము

మహాతపోధనుఁ డగు గౌతముఁడు దీనవదనుఁడగు రా
కటాక్ష వీక్షణంబుల నిరీక్షించి "ఓ సాకేతపురాధినాథా! నీవు
ముడిగి తక్షణమే గోకర్ణస్థలికి జనుము. అయ్యది గిరళకంఠుని శ్రీ
మందిరంబై సుకృతక్షేత్రంబై సకలశుభప్రదంబై బహుపాపంబు
దహింపజేయునట్టిదై యుండెను.

ఆ గోకర్ణాధీశుఁడైన పరమేశ్వరుఁడు తన భక్తులకు సిరులొ
గును. బ్రహ్మహత్య, గురుద్రోహము, కృతఘ్నత మొదలైన పా
బులును, పూర్వజన్మమున యొనరించిన యెట్టి పాపంబైనను, ఆ క్షే
దర్శనమాత్రమున నిన్ను వీడి పరుగిడును. రావణ కుంభకర్ణ వి
ణాది రాక్షసవీరులు, భగీరథాది రాజన్యులు, యక్షకిన్నరులు దేవత
మునీశ్వరులు, దిక్పాలకులు యచ్చట దప మాచరించి ఆ దే
సాన్నిధ్యమున యనేకలింగములను ప్రతిష్ఠించిరి. అచ్చట నుండెడి లి

పూజ వలన గలిగెడునట్టియు, ఆ క్షేత్రజలములయొక్కయు మహత్వ మును నుడువ శక్యముగాదు. అచ్చట ఆదిదేవుఁడైన ఆ పరమ శివుఁడు మహాబలుఁడను నామముతో భక్తులపాలిటి కల్పవృక్షమై వెలసియుండెను.

మఱియు నా మహాబలదేవుని మందిరంబునకు బ్రహ్మ విష్ణువులును, వసురుద్రాదిత్య విశ్వదేవ మరుద్గణంబులును, చంద్ర సూర్యాది గ్రహంబులును, విమానారూఢులై ప్రథమద్వారంబున వసియించి యుందురు. యముఁడు దేవేంద్రుఁడు యాదిగా గలవారు దక్షిణ ద్వారంబున సేవించియుందురు. వరుణుఁడు గంగాది మహానదీదేవతులతో పశ్చిమద్వారంబున భద్రముగా కావలిగాయుచుండును. భద్రకర్ణియు, సప్తమాతృకలును, చండికాది దేవతలును, ఉత్తరద్వారంబున కొలిచియుందురు. విశ్వావసు చిత్రరథాది గంధర్వులు ఆ మహాదేవుని యెదుటఁ గానమును చేయుచుందురు. రంభోర్వశీ మేనకా తిలోత్తమాది అప్సరసలు భగవంతుని సాన్నిధ్యంబున నాట్యమును సల్పుచుందురు. వశిష్ట కశ్యప కణ్వ విశ్వామిత్ర అత్రి భరద్వాజ జాబలి నారద సనక సనందనాది మహామునీంద్రులు మరియొక భాగమున ధ్యానము గావింపుచుందురు. యతి బ్రహ్మచారి స్నాతక వ్రత జటావల్కలాంబరధారులును, యోగులును, తాపసులును నా చంద్రశేఖరు నారాధింపుచుందురు. తక్కుంగాగల దేవ గంధర్వ కిన్నర కింపురుష చారణ సిద్ధ విద్యాధర గరుడోరగ భూత భేతాళ యక్ష రాక్షసులు ఆ వృషభధ్వజుముందట నాడుచు బాడుచు జయ జయ శబ్దంబులతో స్తోత్రంబు లాచరింపుచు యథేష్టభోగంబు లనుభవింపుచు నిత్యానందంబున సుఖంబుగ నుందురు.

మరియు దశకంఠుఁడు ఆ మహాబలుని యతి భక్తితో పూజింపుచు మహావైభవమును బొందెను. తొల్లి యొకప్పుడు అగస్త్య

మహాముని గౌరీశుని గూర్చి ఘోరతప మాచరించి జగ మంతట
నున్న నుతింపఁబడెను. వేల్పు లందరకును మహాబలదేవుఁడే సా
భౌముఁడు. స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వమంతయు యా
నాథుని యధీనమం దున్నది. అతఁడు కృతయుగంబున శ్వేతవర్ణ
తోడను, త్రేతాయుగంబున రక్తవర్ణంబుతోడను, ద్వాపరంబున
వర్ణంబుతోడను, కలియుగంబున కృష్ణవర్ణంబును గలిగి వెలయు
డును. మాఘకృష్ణ చతుర్దశియందు ఆ పరమేశ్వరుని బిల్వదళముల
అతి భక్తిశ్రద్ధలతో యెవరైన పూజింతురేని ఫలితములను అతి సు
ముగఁ బడయఁగలరు" అని గోకర్ణమహాత్వమునెల్ల యా రాజస్య
విన్నవించి ఆ గౌతమమునీశ్వరుఁడు తా నప్పుడే గోకర్ణమునుండి వ
నట్లును, అచ్చట యొక చిత్రమును గాంచినట్లును చెప్పఁదొడఁగెను.

## 8

### దీసురాలు

పూర్వ మొకప్పుడు యజ్వకులసంభవుండైన సకలశాస్త్ర
పారంగతుఁ డగు ఒక బ్రాహ్మణుఁడు కలఁడు. ఆతనికి రూపవతి యగ
కన్యక జనియించెను. ఆమె దిన దిన ప్రవర్ధమానయై గారాబమున
బెరుఁగుచుండెను. ఇట్లుండ కొన్ని దినముల కామె యువ్వనవతి కాగ
తగిన వరున కిచ్చి వేదోక్తవిధిని వివాహ మొనరించెను. కాని దైవ
విధిచే ఆమె మగఁడు కాలగతిజెందెను.

వాలుకన్నులతోడను, బిగిచన్నులతోడను, వట్రువైన పిరు
దులతోడను, అబ్జరాగములవంటి కరాగ్రములతోడను, బాలచంద్రుని
బోలు చక్కని ఫాలదేశమును గలిఁగి భావజాస్త్రమువగిది నొప్పి
యున్న యా యౌవ్వనవతి కామాస్త్రంబుల కోర్వఁజాలక లజ్జను వీడి
గతశేముషియై కాముకులను గూడ నిరంతరము కామక్రీడలయందు

జరించుచుండెను. ఇట్లు జీవా శ్లేషణ చుంబనాది సురతక్రీడా విశేషంబులతో వర్తించుచు కాలవశమున గర్భవతి యయ్యెను. అప్పు డామెను జ్ఞాతి బంధువర్గం బంతయు పరిత్యజించగ ధనికుఁడగు నొక శూద్రుని ఆదరమును గొని వాని గృహంబున కేగి వానితో గూడి మధుపానమును జేయుచు, మాంసభక్షణమును గావించుచు ఒకరీతిని కులట వృత్తిని కాలము గడపుచుండెను.

ఒకనాటి రేయి యామె మధుమద పరవశయై మేషమాంస భక్షణాసక్తయై కరవాలమును చేబూని గోరియలు గోవత్సంబులు యున్న సాలవద్దకు జని తామసమున మేషమని దలంచి ఒక గోవత్సమును ఖండించెను. అప్పు డది యాక్రోశింపగా ఆమె విహ్వలమతియై 'శివ శివ' యని నుడివి మాంసభక్షణాసక్త గలదగుటచే ఆ మాంసమును కొంత భక్షించి, తక్కుంగల భాగ మట్లునిచి, శార్దూల మొకటి గోష్టంబునఁ జొరబడి ఆ వత్సమును జంపెనని మరు చటిదినమున పురమంతయు జాటెను. పౌరు లెల్లను అయ్యది గని నిజమని తలచి కొంతవడి విచారించి తమ తమ నెలవుల కరిగిరి.

ఇవ్విధంబున ఆ కాంత కొంత కాలం బా శూద్రనాయకునిఁ గూడి యథేచ్ఛావిహారంబుల వర్తించి యమసదనమునకరిగెను. అప్పుడు యమధర్మ్మఁడు చిత్రగుప్తునివలన యా కులటయొక్క వృత్తాంతం బెల్ల యారసి దుర్గతికిఁ ద్రోయించెను. పిమ్మట కాలసూత్రాసిపత్రదారు యంత్రతప్త పాషాణ శూలారోహణ వైతరణీ కుంభీపాక మహా ఘోర వాది రనరకంబుల ననుభవించి దండధరుని శాసనంబున తిరిగి భూలోకమందు చండాల యోనిం బుట్టి జాత్యంధతయు, రోగభూయిష్ఠయు, క్రిమిసంకులవ్రణయు నై భిక్షాటనంబు సేయుచు సంచరించుచుండెను.

* * * * * *

ఉత్తమంబైన మాఘమాసమున నిర్మల కృష్ణపక్ష చతు
యందు గోకర్ణక్షేత్రమందు జరిగెడు మహాబల దేవోత్సవమును
సకల దేశముల నుండియు జతలుగూడి వేలకొలంది జను లరుదెం
సౌరాష్ట్రాంగ వంగ కళింగ పాంచాల ఆంధ్ర కర్ణాటక కాశ్మీర ద్రా
చోళ పాండ్య కురుక్షేత్ర కాశీదేశ భూపాలకులు భేరీ ధం ధణా
లతో డోలికాశ్వరథ గజాశ్వరూఢులై యరుదెంచిరి. శాండిల్య
మరీచి వసిష్ట వ్యాస కాత్యాయన వేదవ్యాస కణ్వ శుక అగ
దూర్వాస విశ్వామిత్ర మైత్రేయ గౌతమ మార్కండేయ నారద
మహామునులు విచ్చేసిరి. మరియు యతులు బ్రహ్మచారులు గృహ
వనస్థ వీత భర్తృక వారకామినీ జార వధూటికాదులు దూతిక
ప్రతితులు, సంగులు అంధులు బౌద్ధులు సిద్ధులు యోగులు తండో
తండలుగ వచ్చిరి.

అంత ఒక మధ్యాహ్న సమయమున గౌతమ మహామునీంద్రు
సమయ కృత్యముల నెల్లఁదీర్చి ఒక వృక్షచ్ఛాయయందు కూర్చొ
వెడలుచున్న ప్రజలను అతివేడుకతోఁ జూచుచుండెను. అట్టి సమ
మందు ఛండాలియు, అంధయు క్రిమికుల సంకులవ్రణయు జగ
మానవ యాచమానయు కుమతియు లోష్టపాణియు కుత్సితరూపి
నైన యొక వృద్ధవనితను గాంచెను. ఆమె ఆకలిచే మలమల మా
అతి దీనత్వమున ఆ గోకర్ణక్షేత్రమున వీధులందు భిక్షమునకై యరచు
బోవుచుండెను.

“ఓ పుణ్యాత్ములారా! నేను బంధుమిత్ర జ్ఞాతివర్గమును
దానను. పతి వివర్జితురాలను. తినుట కన్నము లేని కులహీనురాల
కట్ట సరియైన వస్త్రము లేని కష్టజీవిని దుర్గంధ దూషిత దుష్టవిగ్ర
రాలను. భోగశూన్యనై రోగపీడితనై యుంటిని. దిక్కుమాలి
బక్కమానవురాలను. అట్టి నాపై కరుణ గలిగి కొంత భిక్ష మిడు

ఈశ్వరుని పూజ యెన్నఁడును యొనర్చినదానను గాను. ఆ మహేశ్వరుని పర్వదినంబులందు యుపవాసంబులు సల్పి యెఱుంగను. ఆ భక్త వశంకరుని లింగరూపమైన యాకారమును యెన్నఁడును కన్నులారఁ గాంచనైతిని. మరియు శ్రీ పార్వతీదేవిని భజింపనేరని దౌర్భాగ్యురాలను. పంచాక్షరీ మంత్రమును పఠియింపని పాపాత్మురాలను. ఆ చంద్రశేఖరుని కథాశ్రవణ వర్జితనైన దరిద్రురాలను. చేతులార యెన్నఁడును యెద్దియును భగవంతుని కర్పింపని దిక్కుమాలినదానను. అయ్యయ్యో! ఆకలి హెచ్చుగ నుండెను. "ఓ యన్నలారా! ఈ దీనురాలిపై దయకలిగి గుప్పెడు అన్నమును బెట్టి రక్షింపుఁడు" అని తల్లడిల్లుచు నమస్కరించుచు సకలదిక్కులందు సంచరించుచు పేరాకటికిఁ జిక్కి అతి దీనాతిదీనమున నేడ్చుచుండెను. అయ్యది మహేశ్వరారాధనా సమయం బగుటచే యా దీనురాలి నెవ్వరును జూడరైరి.

ఇట్లు రోదనమొనర్చుచు పోవుచుండిన ఆ వృద్ధురాలను యొకదుర్మార్గుఁడు గాంచి భిక్షమని నుడువుచు గుప్పెడు బిల్వదళములను ఆమె చేతులలో బడవైచి వెడలిపోయెను. అప్పుడామె అయ్యది తిను పదార్థముకాదని గ్రహించి ఒక రాతిపైఁ బడవైచి చేరువనున్న కాళికాలయమువద్ద అమితమైన యాకలిచే శోషించి విగతజీవియయ్యెను.

ఆ క్షణంబున యీశ్వరాజ్ఞాబద్ధులై విభూతి రుద్రాక్ష మాలికాధారులును, మణిమండల భ్రాజిత గండభాగులును, త్రిశూల ఖట్వాంగ ధారణులును, అతిశాంతులును, ధీమంతులునైన నలువురు శివప్రియ కింకరులు విమానమును గొని యరుదెంచిరి. గౌతమ మునీంద్రుఁడు ఇదియంతయు గాంచి యాశ్చర్యపడి శివకింకరుల చెంత కరిగి వినయ విధేయుఁడై భయభక్తులతో వారిని "అయ్యలారా! శంకరస్వరూపుల రగు మీరెవ్వరు? యీ పుష్పకమేటికి?" అని యడిగెను. అప్పుడు వారు మోమున చిరునవ్వు తాండవింప సంతోషముతోడను మృదు

మధుర వచనములతోడను "మునీంద్రా! మేము గగనమునుండి
యుంటిమి. నగజారమణుని కింకరులము. ఇప్పుడు మృతిజెందిన
దీనురాలి దేహమును గొనిరమ్మని మహాదేవుని ఆజ్ఞయైనది. సు
తుఁడును, భక్తరక్షకుఁడును నగు ఆ పరమేశ్వరుని మహాత్యము
ద్భుతములు. భక్తుల కతఁడు అత్యంతసులభుఁడు. అల్పసంతోషి.
ప్రీతికై జేయు పను లెవ్వియైనను, యెంత యల్పములైనను య
ఘంబులై యక్షయఫలంబు లొసంగును" అని పలికిన వారిని గ
గౌతముఁడు "మహాత్ములారా! ఈ నీచురాలు కైలాసమునకు
దగునా? దీనికి దివ్యవిమాన మెక్క అర్హతఁగలదా? అంతటి య
మును పొందుట కీమె యొనరించిన వ్రతజపము లెవ్వి? క్రతువు
ఈమె యట్టి యర్హతను గలిగియుండుటకు చలి బందిళ్లను క
యుండలేదు. వీథులందు అన్నసత్రంబులు పెట్టించియుండలేదు.
గోపురాదులు నిర్మించియుండలేదు. క్షేత్రములకుఁ జని షోడశ
ములు గావించలేదు. భళిరే! ఇట్టి విమానము నెక్క యీమె గావి
పుణ్య మెద్దియోకదా? నిత్యానిత్య వివేకములు కలిగి ప్రవర్తించె
లేక సత్యవ్రతయై చరియించెనో! లేక శివకథాశ్రవణమును గావించె
దయయుంచి మహాత్ములారా! నాకు తెలియఁబలుకుఁడు. నిక్క
ఆ విశ్వేశ్వరుని మహిమలు విశ్వమున కంతకును పరమాద్భుతము
అని బలికెను.

అప్పుడు శివకింకరులు కల్మషపూరితంబైన ఆమెయొక్క పూ
జన్మ వృత్తాంతంబంతయు గౌతమునకు వివేదించిరి. అది అంతయు
అట్టి పాపభూయిష్టకు కైవల్యసంప్రాప్తి యెట్లు గలిగెనని గౌతము
యడిగెను. అట్లు పలికినంతనే ఆ మహాత్ములు "మునీంద్రా! పూ
జన్మంబున యీమె అన్నదాన విహీన యగుటచే ఈ జన్మంబున తీ
పాసార్తయై క్రుస్క్కెను. కామాంధురాలై కన్నుఁగాననందున జా

ధయై భూమిపై జన్మించెను. గోవత్సమును జంపి దాని మాంసమును దినినందున ఛండాలయోనియందుఁ బుట్టెను. విధువయై జారవిద్యలతో మెలంగిన కతంబున రోగపీడిత యయ్యెను. మరియు మద్యపానము మాంసభక్షణము చేసియున్నందున గర్భశూల మొదలుగాగల బాధలచే పీడింపఁబడెను. దానధర్మములు వ్రతకర్మలు ఆచరించనందున నిర్భాగ్యురాలై ఛండాలత్వము వహించెను. శ్రీకరంబగు శివరాత్రి యను మాఘకృష్ణ చతుర్దశీ దినమున యీమెకు బిల్వార్చనంబు సంఘటించెను గాన జన్మాంతరార్జితదోషంబులన్నియు ఈమెను విడిచిపోయినవి. మరియు పుణ్యక్షేత్రమగు ఈ గోకర్ణమునందు మహాశివరాత్రి దినమున ప్రాణములు బాసెను గావున ఈమె పుణ్య వైభవమును జెంది దేవదేవుని కరుణచే భద్రకరమైన కైవల్యపదమును పొంది దివ్యమైన విమానమును ఆరోహింపఁగలిగెను. పూర్వజన్మమందు మదాంధతచే గోవత్సమును జంపునపుడు 'శివశివా' యని భీతిచే పలికెను. అందుచే పాపములెల్ల నశించెను. నిర్మలభక్తితో ఆ మహాదేవుని భజించిన మృత్యులకు మోక్షప్రాప్తి తప్పక గలుగును" అని ఆ ఛండాలి పూర్వవృత్తాంతంబంతయు నెఱింగించి ఆ శివకింకరులు ఆ క్షణమునందే అయింతిని దివ్యవిమానంబున నెక్కించుకొని శివలోకమునకుఁ గొనిపోవుచుండిరి. అప్పు డామె దివ్యాభరణభూషితయై సుగంధవిలేపితయై తన దుష్కృతములెల్ల పోయి తన కెట్లు అట్టి మహావైభవము కలిగెనో యని ఆశ్చర్యంబందుచు పరమేశ్వరుని స్తుతించుచు గంధర్వగానంబుల నాలకించుచు విద్యాధర కీర్తనంబు లాలోకింపుచు బరమానందంబున శివలోకమునకుఁ జని యీశ్వరసాన్నిధ్యంబున సుఖంబుగ నుండెను.

కైవల్యమును బొందిన దీనురాలి వృత్తాంతంబంతయు సావధానచిత్తముతో విన్నవాఁడై గల్మాషపాదుఁడు గౌతమ మహామునిని శివలోకమెట్లుండునని వినయముతో ప్రశ్నించెను. "ఓ భూవరా! పుణ్యాత్ము

లెల్లరు మరణానంతరమున శివలోకమున కరిగెదరు. వారి కచట క్షు
వేదన గాని ఆకలిబాధ గాని దప్పిక గాని ఆశ గాని మోహము గాని
మరెట్టి కష్టము గాని యుండక నిర్మలముగ వసియింపఁగలుగుదు.
ఆ లోకమందు సూర్యచంద్రాదులు ప్రకాశింపరు. మునులు సి
యోగులు మహానందముతో యుందురు. అందున్న పుణ్యజను
పునర్జన్మ లేక అనపాయస్థితియందుందురు. గురుభక్తులు, మంచి అ
కరణమును కలవారు, సాధుజనులు, పరోపకారపరులు, తత్వజ్ఞులు
మొదలైనవారు అచ్చట చిరకాల ముందురు" అని చెప్పి గౌ
మహర్షి రాజునుజూచి "నీ విఁక ఆలస్యము చేయవలదు. సత్వర
గోకర్ణక్షేత్రమునకుఁ జనుము. నీ దుష్కృతంబులన్నియు నశించు
నీకు ముక్తిఫలములు కలుగును. భవిష్యత్కాలంబున నీ వంశము
భగవంతుఁడైన శ్రీ మహావిష్ణువు శ్రీరామ నామంబున నవతరించు
నీ యొక్క వంశమునకు గొప్ప కీర్తిని తేఁగలఁడు" అని యానతిచ్చి
తాపసోత్తముఁడు నిజాశ్రమంబునకుఁ జనెను.

పిమ్మట కల్మాషపాదుఁడు గౌతమమునీంద్రుని ఆజ్ఞాప్రకారము
గోకర్ణంబునకుఁ జని గిరిజారమణుండగు శ్రీకంఠుని సేవించి పాపవిముక్తుఁడై సాకేతంబునకుఁ జని ధర్మయుక్తముగ రాజ్య మేలుచుండెను.
అంత కొంతకాలమునకు శివభక్తాపరుఁడగు ఆ యుర్వీనాథుఁడు శివ
లోకమున కరిగి మహాదేవుని చరణసాన్నిధ్యమం దుండెను.

## 9

## దీపకలికా ప్రభావము

ఇట్లు శివరాత్రిమహాత్త్వమును గూర్చి శౌనకాది మహామును
లను లిన మృదుమధుర వాక్సుధారసధారలచే ఆనందసాగరంబున నోలలాడించి, సూతపౌరాణికుఁడు దీపకళికను గూర్చి "ఓ మహామును

లారా! మాస సంవత్సర శివరాత్రులయందు శివసన్నిధానమున శివ ప్రీతికై మంగళప్రదంబులగు దీపంబులు వెలిగించినచో నద్భుతప్రభావము గలుగును. శివుండు ప్రీతిజెంది యిహలోకమున సమస్త భోగైశ్వర్యంబులను, సంతానమును, శాశ్వతసుఖానందములను గలుగఁజేసి మరణానంతరంబున దివ్యతేజోమయమైన తన కైలాసమున నిత్యవిరామయ సుఖంబుల ననుభవింపఁజేయును. ఇందుల కొక్క నిదర్శనంబు గలదు. శ్రద్ధాళువులై వినుండు—

నిషధ యను నొక సుందరమైన పట్టణము గలదు. దానిని దాశరాజు పరిపాలించుచుండెను. ఆతఁడు కుముద్వతి యను నొక సౌందర్యవతి యగు రాజకన్యకను వరించి వివాహమాడెను. కాని యతఁడు కామాతురుఁడై భోగాసక్తతం జేసి నానాజాతి స్త్రీలను రమించుచు అనాచారుఁడై స్వేచ్ఛావిహారమును గావించుచుండెను. అయినను ఆతఁ డెంతటి కాముకుఁడో యంతటి పరమభక్తుఁడు దయార్ద్రహృదయుఁడు. ప్రజలను కన్నబిడ్డలవోలె పరిపాలించుచుండెను. అనేకమైన శివమందిరములను గోపుర మంటపములను కట్టించియు, సహస్ర ఘటాభిషేకముల నాచరించియు మహోత్సవములను జరుపుచు అనుదినము శివమందిరమును దీపమాలికలతో నలంకరించి, బిల్వదళములతో పూజించుచు తదానంద పారవశ్యమునుఁ జెందుచుండును. ఈ వింతచర్యలను మది నాశ్చర్యమును జెంది ధీరమతి యగు కుముద్వతి యేకాంతమున నిజభర్తనుగాంచి "మనోనాథా! మీకు కోపము రాకుండెనేని నా దొక్క మనవిగలదు. మీకీ దుర్బుద్ధియేమి? ఈ జారకృత్యములేమి? జారిణీ సహవాసమును విడువలేని మీకీ భక్తజనగోష్ఠి యెందులకు? సద్గ్రంథపఠన మెందులకు? శివపాదతీర్థము పానముచేసిన నోటితో వేశ్యాధరపానమ మెట్లు చేయుచున్నారు? మహాభక్తిశ్రద్ధలతో దీపారాధనమును గావించి

దివ్యమంగళస్వరూపులగు గౌరీశంకరులను దర్శించిన నేత్రముల
వేశ్యావదనమును గాంచి యెట్లు మెచ్చుకొనుచుంటిరి? స్వా
పూజించు పవిత్రహస్తములతో కులటయగు వేశ్య నెట్లు స్పృశి
చుంటిరి? ధనకామినితో పొందుజేయుట మీకు హేయముగా
లేదా? గంగాస్నాన మాచరించి పరిశుద్ధులైనవారు మో
దొమ్మరిగుడిసెలో దూరి యపవిత్రులు కానేల? కనుక మీ భ
మీ యోగ్యతకు, మీ విద్యకు నీచస్త్రీ సాంగత్యము తగదు. ద
యుంచి నా ప్రార్థన త్రోసిపుచ్చక యింతటినుండి యిట్టి దుష్టప్ర
నమును మానుడు" అని దీనముగ వేడుకొనెను.

అప్పుడా రాజేంద్రుఁడు చిరునవ్వుతో "ప్రియసఖీ! నీవు చె
విషయములెల్ల నే నెఱుంగనవికావు. సద్బుద్ధుల కే దైవము క
సూత్రము మూలకారణమో, దుర్బుద్ధులకును ఆ రెండే హేతువు
నమ్ముము. అందులకు నా ప్రజ్ఞావిశేషముగాని యిందులకు
వివేకహీనత గాని కారణము గాదని తెలిసికొనుము. సుమో
కాలము తటస్థించినప్పుడు నా చిత్తము దానియంతట నదియే స
ధర్మపదముల నడువగలదు. అంతవరకు నోరిమి వహింపుము. ఇ
యట్లుంచి నేను చెప్పఁబోవు నా పూర్వజన్మవృత్తాంతము నెల్ల స
ధానచిత్తవై వినుము.

పూర్వము నేను అంపానగరమను పట్టణమందు శునకము
పుట్టి ప్రతిగృహమునకును ప్రతి వీధియందును దిరుగుచు, జనభు
శేషమును భుజించుచు కొన్ని సంవత్సరములచటఁ గడపితిని. అ
నొక మాసశివరాత్రియందు పురజను లనేకు లొక శివాలయము
కరిగి దీపమాలికల నొసఁగి అమృతాభిషేకము నాచరింపుచు
నలుదిక్కులనుండి వచ్చిన సకలజనులు మక్కువతో నొసగిన ఆ దీ
పమాలికల వలన ఆ ముక్కంటియొక్క భవనము నక్షత్రమండలము

విరాజిల్లుచుండెను. ఇట్లున్న సమయమున దేవుని పీఠముపై యుంచ బడిన భక్ష్యముల నారగించబోయి నిశ్చలతేజంబున వెలుగుచున్న ఆ దీపములను గాంచియు, అచ్చటనున్న అర్చకుఁ లొనరించుచున్న వేద ధ్వనులను వినుచును నిలువబడియుండగా అచ్చట నున్నవారు నన్ను దండించి తరిమివైచిరి. పిమ్మట నేను కబళమునకై వెదకుచుఁ బోవు చుండ కొందరు దుర్మార్గులు కరుణాహీనులై శరమును సంధించి ఆ శివాగారప్రదేశంబునఁ బడవేసిరి. మహేశ్వరనివాసంబైన ఆ పుణ్య క్షేత్రమందు కృష్ణచతుర్దశీ ప్రదోష పుణ్యకాలంబున విరూపాక్షుని సాన్నిధ్యంబున దీపమాలికల నవలోకించుచు నిరసనత్వము నొందితిని గాన నికృష్టంబైన శునకదేహంబును వీడి దివ్యదేహముఁ దాల్చి విమానారూఢుండనై కొంతకాలంబు స్వర్గభోగంబుల ననుభవించి పిమ్మట సివధరాజ్యమునకు రాజునై జన్మించితిని ఇది నా పూర్వ వృత్తాంతము. నాకు ప్రియపత్నివి గావున నీ రహస్యము నీకు తెలియఁ బలికితిని. నీవు అప్పరమేశ్వరుని భక్తితో పూజింతువేని మహాను భావుండగు ఆ భక్తవత్సలుఁడు నీకు ఇహపరసౌఖ్యంబు లొసంగును" అని బలికిన కుముద్వతి ఆశ్చర్యము జెంది పూర్వజన్మజ్ఞాన మెట్లు కలిగె నని ప్రశ్నింపగా దీపమాలికాలోకనము వలన భూత భవిష్యత్తు వర్త మాన జ్ఞానసిద్ధిని గలిగియుంటినని రాజు పలికెను. మరియు తాను దీపమాలికలను వీక్షించుచు ప్రాణములను బాసెను గావున ఈ జన్మ మందు ఆ శంకరునకు దీపమాలికల నర్పించు భాగ్యము, రాజత్వము, శివపూజాశక్తి కలిగినదనియు, తన పూర్వజన్మమున మరెట్టి సుకృతము లును ఆచరించనందున దుష్టవృత్తి తన్ను వీడలేదనియు నుడివెను. పిమ్మట కుముద్వతి "నాథా! మీరు మహానుభావులు. త్రికాలజ్ఞులు. విశేషించి సుజ్ఞానులు. అందువలన మీరు భూత భవిష్యత్తు వర్తమాన కాలములందు జరిగిన జరుగుచున్న జరుగబోవు సంగతులను

జెప్పగలుగుచుంటిరి. ఇప్పుడు దయయుంచి నా యొక్క
వృత్తాంతమును గూడ దెలియజెప్పుము" అని భర్తను వే
అప్పుడు దాశరాజు నిజభార్య కోరికను సఫలిత మొనరింప సంకల్పి
"ఓ గజగామినీ! నీవు పూర్వమున యొక కపోతివై ఆహారమును
గరచుకొని గగనంబునఁ బోవుచుండ యొక డేగ అయ్యదిగాంచి
వెంటాడించెను. రౌద్రముతో వచ్చుచున్న ఆ డేగనుజూచి నీవు
మంది ఒక శివాలయముచుట్టుఁ దిరుగుచు శోషించి పోలేక ధ్వజ
ముపై వ్రాలగా ఆ డేగ కృపావిహీనమై నీ ప్రాణములను హ
మాంసఖండమును గొనిపోయెను. పురహరుని మందిరమునకు ప్ర
ణము గావించి ఆ మహాదేవుని యెదుట తనువును బాసితివి గా
పుణ్యముఁగొని రాజకుమారివై జన్మించితివి" అని చెప్పిన కుముద
అమందానందముఁ జెంది "మనోవల్లభా! నీవు ఆ నీలగ్రీవుని మహ
త్సవంబులు నిత్యము ఆచరించి కాలజ్ఞానమును గల్గియుంటివి గ
ఈ భూలోకమున నీకంటె ఘను డెవ్వఁడును లేడు. నా మనసూ
గా వేడుచుంటిని గాన క్షమించి మన భవిష్యజ్జన్మవృత్తాంతమునుగు
వినిపింపుఁడు" అని కోరఁగా దాశరాజు సంతసించి "దేవీ! నీ మృ
భాష లారయగ సుధారసములు. ఇతరు లెవ్వరును నీవలెఁ బ
నేరరు. భావిభవంబులనుగూడఁ దెలియఁబలికెద వినుము. నీవు
బోవు జన్మంబున సృంజయేశ్వరుని గారాబుపట్టివై జన్మించి సిం
భూపాలుఁడనగు నన్ను పతిగా బడయఁగలవు. తృతీయజన్మంబున
సౌరాష్ట్రాధీశుఁడనై జన్మించెదను. నీవు కళింగరాజన్యునకు కూఁ
పట్టివై జననమొంది నన్ను బడయఁగలవు. చతుర్థభవమునందు గ
ధార ప్రభుఁడ నగు నన్ను పాంచాల రాజ తనయవై గూడ
పంచమభవంబున నేను అవంతీకి రాజునై జననమొంది బహు
సంపన్నుఁడనై యుండ నీవు దశార్ణమహీపతికి ముద్దుపెంపు పుత్రి

నన్ను మోహించి పరిణయ మాడుదువు. మరల షష్ఠభవంబునందు బ్రహ్మావర్తదేశంబునందు ధరణీనాథుఁడనై జనించిన నన్ను అత్యంతానురాగముతో నీవు యయాతి వంశరత్నమవై జన్మించి పాణిగ్రహణము కొందువు.

మరియు ఓ పద్మాయతాక్షీ! సప్తమజన్మమున నేను పాండ్యభూవరుఁడనై జన్మించి దాన క్షాత్ర సాహస ధైర్యాది సద్గుణములఁ బద్మమిత్రప్రభతో వెలుంగుచుండ నీవు సౌందర్యాతిశయములతో వసుమతి యను పేరుతో వైదర్భివై జన్మింతువు. అంత సకలదేశంబుల నుండి రాజకుమారులు నీ స్వయంవరంబునకు వచ్చియుండ వారి నందరిని విడచి నన్ను వరింతువు. అంతట వా రందరు యేకమై దంతిప్రాముఖ్య సేనాతతితో మహోద్దాములై ఘోరసంగ్రామకాంక్షతో వచ్చి నన్ను ముట్టడింతురు. అప్పుడు చండాటోపములచే ముట్టడించిన పరక్ష్మాపాలుర నెల్లరను తీవ్రకోదండ విముక్త నిశితశర పరంపరలతో కరి స్యందన ఘోటకాదులచే ఖండీభూతులను జేసి ఢక్కారావము లొనర్చుచుండ నిన్ను గొని తెత్తును. అంత మహాహర్షముతో నిన్ను నగరంబునకుఁ గొనివచ్చి శుభలగ్నమున వివాహ మొనర్చుకొని యశ్వమేధాది యాగము లాచరించి శైవతతికి మహాదానము లొసంగుదును.

ఇవ్విధముగ సకలప్రజానురంజకంబుగా బహువర్షంబులు రాజ్యమును పాలించి యనంతరంబున నిజనందనునకుఁ బట్టముఁగట్టి తపోవనికిఁ జని యచ్చట అగస్త్యమహామునిని గాంచి వినయముతో నాతనికి ప్రణమిల్లి, ఆ మహానుభావుని వలన ఆత్మవిజ్ఞానంబును బడసి కొంత కాలమునకు యీ తనువును చాలించి పునర్జన్మరహితంబైన శివలోకంబున శివసాయుజ్యంబు నొందియుందుము. అటుమీదట మనకు జన్మంబులు లేవు” అని భార్యకుఁ దెలిపెను.

తదనంతరంబున ఆ దంపతులు మహాదేవుండైన శ్రీ విశ్వ
శునియారాధింపుచు అనేక వత్సరంబులు సౌఖ్యంబుల ననుభ
మరియు సప్తజన్మంబులు రాజ్యంబు పాలించి యంత్యంబున శివ
సేవను జేయుచు కైలాసమున సుఖంబుగ నుండిరి.

# 10

## చంద్రసేనభూపాలుఁడు

దీపకళికాప్రభావమును జెప్పి సూతమునీంద్రుఁడు "ఓ
శ్రేష్ఠులారా! స్త్రీలైనను పురుషులైనను సజ్జన దుర్జనులైనను ప
లైనను అపవిత్రులైనను సర్వకాల సర్వావస్థలయందును పార్వ
మేశ్వరుల పూజ లాచరింతురేని వారు సంసృతిబంధముక్తులై మో
ప్రాప్తిఁ జెంది శంభుసన్నిధానమున కేగెదరు. మరియు యీ
మున నొక ఇతిహాసము గలదు. అయ్యది వినిపించెదను. సావ
ముగ వినుండు"___

సజ్జనజనుల కాశ్రయమై సమున్నతమైన గోపుర ధర్మహర్మ
బులతో విరాజిల్లుచు ఉజ్జయిని యను పట్టణ మొకటి కలదు. ఆ
రమును గుసుమాస్త్రసమానుఁడై విద్వాంసుఁడై రాజనీతిదక్షుఁ
చంద్రసేనుఁడను రాజన్యుఁడు ఉదారభావముతో ప్రజల నేలు
డెను. ఆ రాష్ట్రము గ్రహపీడాదిక్షోభలులేక సకలవైభవములతో
విరాజిల్లుచుండెను. అతఁడు మహాధైర్యశాలియు, బాహుబలయు
డునునై యుండుటచే శాత్రవులెల్ల అతనిపై దాడివెడలుటకు భీతిజె
చుండిరి. మరియు అతఁడు నిత్యము అంబికాధవుల నారాధించ
యోగులకు సిద్ధులకు వైరాగ్యులకు కోరినధనము నిచ్చుచుండెడివా

ఇట్లుండ నొకనాడు విభూతి లేపనములనుఁ దాల్చి, మృగ చర్మాంబరములను ధరించి, దండకమండలాదులతో మహేశ్వరభక్తుఁడగు మాణిభద్రుఁడను తపోధనుఁడు చంద్రసేనుని ఆస్థానమున కరుదెంచెను. అప్పుడు చంద్రసేనుఁడు మునీంద్రున కుచితమర్యాదలు గావించి మజ్జనభోజనపాన శయ్యాదులనెల్ల అమర్చి యాతని కెక్కువ ప్రీతిని గొల్పెను. రాజన్యుని భక్తిశ్రద్ధలకు మెచ్చి మాణిభద్రుఁడు ఒక దివ్యరత్నము నాతని కిచ్చెను. పిదప శివపారిషదముఖ్యుఁడగు ఆ మాణిభద్రుఁడు నృపాలుని హస్తంబుఁ బట్టి యిష్టసల్లాపంబులతో "ఓ నృపవర్యా! ఈ రత్నమును నీవు యెల్లప్పుడును గళమునందు ధరింపుము. ఇయ్యది అత్యంత శుభప్రదంబై నీకు వలయునంత ధనమును చేకూర్చును" అని నుడివి దానియొక్క ప్రభావం బంతయు ఆతనికిఁ బోధించి ఆ శివయోగి చనెను. మునీంద్రుఁడు చెప్పిన చొప్పున యా నృపాలుఁడు దానిని గళమునఁ ధరించి కౌస్తుభధరుఁడగు రమావల్లభునివలె వెలుంగుచుండెను. సూర్యప్రభావముతో ప్రకాశించుచున్న ఆ రత్నకాంతి సోకిన వెంటనే ప్రతివస్తువు హేమముగ మారజొచ్చెను. ఇట్లు మహాధనికుఁడై శివపూజాదురంధరుఁడై సర్వజనులకు సమ్మదమగునట్లు ఆ రాజన్యుఁడు ధరాతలమును బాలించుచుండెను. సాంద్రయశోవిశాలుఁడును, సత్యవిరాజితుఁడును యగు చంద్రసేనుఁడు శౌర్య ధైర్యములందు హరిశ్చంద్ర కార్తవీర్యుని మరిపించుచు, యక్షేంద్ర మహేంద్రులకు మించిన వైభవములతో చెలంగుచుండెను. ఇవ్విధముగ సామ్రాజ్యము నేలుచుండ అయ్యది దైవలబ్ధానుభవంబని తెలియఁజాలక చంద్రసేనుని సంపదలెల్ల హరింప అన్యదేశాధిపతులు వివిధ ప్రయత్నములు సల్పుచుండిరి.

ఇట్లు చంద్రసేనుని జయించవలెనని కోరికతో సౌరాష్ట్రాంగ కళింగ వంగ కురు పాంచాలాంధ్ర గాంధార నీశావంతాది భూపాలకు

లెల్లరు యొక్క మొత్తమున యుర్వీభాగ మంతయు అల్లాడునట్లు యినీపట్టణముపై మహాట్టహాసముఁ గావింపుచు దండెత్తి వచ్చిరి. వచ్చియుండిన ఆ వీరాధివీరులఁ గాంచి ఉజ్జయినీసైనికు లెల్లరు గందిరి. సహజ ధైర్యయుతుఁడగు చంద్రసేనుఁడు కూడ భీ సుఁడై చేయునది లేక ప్రమథగణాధిపతి యగు ఆ మహాదేవు భారమిడి మహారథుల కొందర నలుదిశలందును నియమించెను. పి ఆతఁడు "ఓ భక్తవత్సలా! కమలభవుని సారథిగా గొని, మేరు తమును విల్లుగా ధరించి, భూమిని రథంబుగను, సూర్యచంద్రులు చక్రములుగను, వేదములను తురంగములగను విష్ణుమూర్తిని శర గను భుజంగపతిని వింటినారిగను ధరించి వచ్చి నా పట్టణమ రక్షింపుము. ఓ త్రిపురారీ! నిన్నుఁ గొల్చెదను" అని మనం దలఁచి శూలాయుధుఁడైన మహాకాళేశ్వరు దేవళమునకుఁ జని భగవానునకు అభిషేకాలంకార క్రియలనెల్ల మహాభక్తియు క్త యొనర్చెను. మరియు ఆ చంద్రమౌళీశ్వరునకుఁ గోరికదీరునట్లు సుగ దీప ధూపాదులు, సురుచిరమైన భక్ష్యభోజ్యములు, చోష్యఫల మృతోపహారములు, నిరుపమ మంత్రపుష్పములు అర్పించి అనే లైన ప్రదక్షిణంబులు, గురుతరవందనములుఁ గావించెను. ఇట్లు మహీపాలుఁడు నిజమంత్రి పురోహిత సామంత శైవభక్త ప్రముఖ వృతుండై మహోత్సవంబుల నహోరాత్రంబులు అనన్యమానసుం ఆచరింపుచుండెను. అట్టి సమయమం దొకనాఁడు యొక గోపవ విధవ యొకతె సూక్ష్మజ్ఞానము గలిగి పంచవర్ష ప్రాయము గల బాలకు నెత్తుకొని ఆ మహాదేవుని ఆలయంబులోనికిఁ జని యం దొ చో నిలచి, భక్తవత్సలుఁ డగు పార్వతీనాథుని ధాత్రీశుఁడు పూ గావించుచుండుటను బొంచి చూచెను. పిమ్మట ఆమె మహాదేవున నమస్కరించి తన బాలకునితో గృహాభిముఖ యయ్యెను.

# 11

## గోపబాలుఁడు

ఆ గోపస్త్రీయొక్క కుమారుఁడు, రాజేంద్రుఁడు శివాలయమున జేయుచుండిన పూజాక్రమంబంతయు అనురాగముతోడను, భక్తితోడను వీక్షించి ఆ విషయము నతను పలుమారు దలంచుకొనుచు తాత్పర్యమును గ్రహించి పుష్పములను దళములను దెచ్చి శివపూజఁ గావింప నిశ్చయించుకొనెను. ఇట్లు తనకు మనోహరంబులైన పత్ర పుష్పంబులను దెచ్చుకొని తన యింటికి చేరువయందున్న పాడు గుడిసె నొకదానిని పరిశుభ్రముగ నూడ్చి యం దొక శిలను దెచ్చి దివ్యలింగముగ బ్రతిష్టించెను.

అవ్వా డతి వేడుకతో నభిషేక మొనరించి, వస్త్రభూషణంబు లర్పించి గంధాక్షతల నొసంగి పత్రపుష్పంబులతోఁ బూజఁ గావించి ధూప దీప నైవేద్య తాంబూలాదులను అర్పించి సాష్టాంగ నమస్కారములను గావించెను. పిమ్మట ఆ గోపబాలుఁడు ఆ నగపతి ముందట జగధీశ్వరుని సంస్తవమును పఠించుచు శివగానమును చేయుచు నాట్య మొనరించెను. ఇవ్విధంబున ఆ గోపబాలకుండు బాలక్రీడా వినోదంబున నృపాలుం డాచరించు విధంబున దానును శివార్చనంబు ననుదినముఁ జేయ సంకల్పించి యా కృతకలింగంబునకు షోడశోపచార విధుల నమస్కారంబులఁ జేయుచు కొంతప్రొద్దుఁ గడపి భోజనవాంఛా రహితుండై నిశ్చలభావంబున బరమేశ్వరధ్యానంబుఁజేయుచు నిమీలిత లోచనుండును బద్ధాంజలీపుటుండును ననన్య మనస్కుండును నగుచు సమాధి నిష్టాతిశయంబున స్థాణురూపుండై యుండెను.

అంత ఆ బాలకుని తల్లి యరుదెంచి భుజింప రమ్మని పుత్రునిఁ బిలువ నాతఁడు పలుకకుండుటను గాంచి వగ్గరకేగి స్థాణువుపగిది

నిశ్చలతనున్న యా ముద్దుబాలకుని మహాశచే మోది దుర్మ
యచ్చటి పూజనంతయుఁ జెరచి ఆ అశ్మలింగంబును దూరముగ
వైచెను. కొంతవడికి ఆ బాలకుఁడు కన్నులను దెరచి పూజ యం
చెడియుండుటను గాంచి రోదనంబు చేయఁదొడఁగెను.

ఇవ్విధంబున ఆ గోప బాలకుఁడు కొంతప్రొద్దునకు విగతశో
యికార్యంబు నా జననీకృతంబుఁగావలయునని మనంబున విశ్వ
తద్దోష పరిహారార్థంబుగా సప్పరమేశ్వరుని ధ్యానం బొనరిం
"ఓ చంద్రశేఖరా! నిన్ను ప్రీతిమూర పూజించితిని. కాని నా
అజ్ఞానియై పూజనంతను బడఁద్రోచి పోయెను గనుక ఓ దేవ
నన్ను కరుణించి రక్షింపుము" అని పలు తెరంగుల ఈశ్వరుని ప్ర
తుదకు మూర్ఛయందు మునిఁగెను. అంత కొంతసేపటికి తెలివి
కొనినవాఁడై లేచి మహాయద్భుతముగ యెదుట నొక దేవాలయ
గాంచెను.

పిమ్మట సువర్ణద్వార కవాటములతోడను వజ్ర వైఢ
మౌక్తిక ప్రభాపూరిత వేదికా దివ్యచింతామణి ప్రభాదివ్యమాన
పీఠంబునందు ప్రభాతకాల భానుకోటి ప్రకాశమై బరగునట్టి భవ్య
గంబును ఆ బాలకుఁడు గాంచి తదీయ మహాప్రభావమునకు
పడి, విస్మితస్వాంతుఁడును, పులకాంకితగాత్రుఁడును, హర్షాశ్రు
నేత్రుండును నై గద్గదస్వరంబున

"సీ. జయ భక్తసముదాయ సంరక్షణోపాయ
జయ కాలకూట భక్షణ వినోద
జయ విష్ణుకాండ కాంచన శైల కోదండ
జయ పద్మజాండ భాస్వత్ప్రచండ
జయ శైలజాచిత్త జలజాత రోలంబ
జయ రక్షితాపన్న జనకదంబ

జయ జహ్నుకన్యకా జలసిక్త వరజూట
జయ జయ హల్లక సఖి కిరీట
జయ రజిత భూధరాంచిత స్థలనివాస
జయ వృషతురంగ రాజీవ శరవిభంగ
జయ కృతాంతక మృత్యుభంజన విలాస
జయ కృపాపాంగ ధవళాంగ శంభులింగ"

అని ప్రార్థన గావించి "ఓ స్వామీ! నేను మూఢుఁడను. విశేషించి గోపబాలకుఁడను. ప్రజ్ఞాశూన్యుండను. లీలామూర్తివగు నిన్ను బ్రహ్మ విష్ణు మొదలుగాఁగల విబుధులే నీ సామర్ధ్యమును కొనియాడఁజాలరు. మా తల్లి నిన్ను త్రిలోకఖ్యాతునిగఁ దెలియఁజాలక కఠినాత్మకయై పీఠప్రజ్ఞతయై జేసిన ఆ పాపములను ఓ పరమాత్మా! పరిహరింపుము" అని బహువిధంబుల వినుతులు చేయు సమయంబున పద్మినీదివాసంగమంబులఁ జేసి తద్దోష పరిహారసిద్ధికొరకు స్నాన మొనరింపఁబోయినట్లు భానుఁడు పశ్చిమాంబుధిలో గ్రుంకెను. ఆ సమయంబున గోపబాలకుఁడు భోజనేచ్ఛావిరహితుండై యమ్మహా ప్రదోషకాలంబున మహాదేవ పూజనంబు గావించి యద్భుతకరంబైన యీ వృత్తాంతమును తన తల్లికిఁ దెలియఁబలుకవలయునని మనంబున నిశ్చయించుకొని యతిత్వరితముగ నిజగృహంబున కరుదెంచెను. అంత ఆ గోపీభవన మంతయు నవరత్న హేమమయమై, యవిరళధనధాన్యయుక్తమై ఆ మహాదేవుని కృపచే నిభవనంబువలె వెలయుచుండెను. అప్పుడు గోపబాలుఁడు తన జనని శయనించియున్న మందిరంబున కేగి యామెతో "అమ్మా! లెమ్ము. ఈశ్వరుఁడు కరుణార్ద్రహృదయుండై మనకు సకల సంపదల నొసంగెను" అని బలికెను. ఆమె మేల్కాంచి నిజమందిరంబును శయ్యాతలంబును గాంచి రత్నకలిత కనకమయం బగుటఁజేసి కడు వెరగందెను. మరియు తన శరీరముపై దివ్యాంబరములను గాంచియు,

మహిత ధనరాసులతో నొప్పుచున్న గృహమునుజూచియు, స్వర్ణ
దీపితంబైన ఖట్వాంబు జూచియు, అయ్యది యపూర్వముగ యున్న
దలంచెను. ఆ గోపబాలుఁడు తల్లినిదోడ్కొని రత్నసౌధంబునై స్ఫటి
కలశ శ్రీమంతమై కాంతమై విరాజిల్లుచున్న భూతేశాలయమును ప్రో
ప్రమోదంబుతో జూపించెను. పిమ్మట గోపస్త్రీ రాజువద్ద
పురహరుని వ్యాపారమును గూర్చియు, తన తనయునియొక్క పూ
విధానమును గూర్చియు తెలియఁబలికెను.

ఆ వార్త వినినంతనే రాజేంద్రుఁడు ఆశ్చర్యమును జెంది త
యొనరించుచుండిన శంభు పూజావిధానము నంతయు విడచి పరి
సహితుండై యరుదెంచి దివ్యమాణిక్య దేదీప్యమానంబైన అం
రమణుని దేవాలయమును, అందు కాంచనమయంబగు రత్నవే
స్థలమున యొక పీఠమధ్యంబున వెలసి బాలభాను కాంతి పరి
అఖిలజన చిత్తలోచనాహ్లాదమగుచు పూర్ణవిభవాభిరామ మపూ
మైన కనక మణిమయ దివ్యలింగంబునుఁ గాంచెను.

ఈ సమాచారం బంతయు విని పౌరు లనేకు లరుదెంచి న
నముగ వెలసినదేవాలయంబును, అందలి శివలింగమును, గోపబాల
సౌధమును అద్భుతముతో వీక్షించుచుండిరి. ఇట్లు వచ్చినవా రెల్ల
ఆ రాజన్యునితో భక్తిపూర్వకముగ అభిషేక బిల్వపూజనంబుల
సంకీర్తనంబులను జేయుచు, సాష్టాంగవందనము లాచరించుచు,
మానందములో మునింగియుండిరి. ఇవ్విధంబున నితరవ్యాపారము
మాని పౌరజన పరివారసమేతంబుగా నమ్మహీవల్లభుఁడు ప్రహృష్టా
రంగుఁడై భుజంగాభరణంబైన యమ్మహాలింగంబునకు పూజామహో
త్సవంబులు సలుపుచుండెను.

అప్పుడా నరపతికిని పట్టణముపై దాడి వచ్చిన అన్యభూవరు
లకును సంధిని పొసగించుటకై యరుదెంచినట్లు సూర్యభగవాను

నుదయించెను. పిమ్మట తమ చారులు దెలుపగా చంద్రసేనుని పట్టణమందు దొరక గోపబాలుఁడు ఆటలకు శివార్చనమును జేయుటయు, శంకరుని మందిరము గన్పట్టుటయు శాత్రవులెల్లరు విని కడు విస్మయం బంది రహస్యముగ నెల్లరు గుమిగూడి చంద్రసేనుఁడు మహానుభావుఁ డనియు, దైవబలాభిరాముఁడనియు, సంగరమందాతనిఁ జయించుట దుర్లభంబనియు, స్నేహభావంబుతో మెలంగిన మంచిదనియు నిశ్చయించుకొని సంధిని పొసగించుటకై రాయబారులను చంద్రసేనుని వద్దకు పుత్తెంచిరి. రాయబారులు రాజువద్దకు వచ్చి "ఓ మానవ నాయకా! యుద్ధకాంక్షతో వచ్చిన భూవర్యులెల్లరు శ్రీహరుని సాక్షిగ ఆయుధములనెల్ల వర్జించి తమ ప్రయత్నములనెల్ల వీడి శివాలయ గోపకదర్శనార్థమై వచ్చి ద్వారమువద్ద నిలచియుండిరి. దేవర వారు వారి వాక్యముల నాదరింప ప్రార్థించుచుంటిమి" అని నుడివిరి. అప్పుడతి మైత్రితో వారలను తోడ్కొనిరమ్మని ముదమందుచు తన భృత్యుల నంపెను. పిమ్మట ఆ దూతవర్యులు దేశాధీశ్వరులకు చంద్రసేనుని యనుమతి నెరిగించి వారికి స్వాగతమిచ్చిరి. ఇట్లు పురంబులోని కరుదెంచిన ఆ రాజసత్తములకు అత్యంతవినయంబున చంద్రసేన మహీనాథుం డెదుర్కొని వందనాలింగాది సత్కారముల వారల నాదరించి తోడ్కొనితెచ్చి వారలుఁ దానును అత్యంత మిత్రభావముతో హేమరత్నమయంబైన నూతనశివాలయంబునకు వచ్చి యమ్మహాదేవుని దర్శనంబు గావించి సాష్టాంగ దండప్రమాణాదు లాచరించి అందరు సభాస్తరణంబుల సుఖాసీనులై మృదుమధుర సల్లాపంబు లొనర్చుచు పరమానందంబున నోలలాడుచుండిరి. అంత వారు గుణగణాలంకారుఁడై ప్రాభవరేఖాకారుఁడై శంకరునకు ప్రీతిని గొల్పిన బాల్యవయస్కుండగు గోపబాలకునిఁ బిలచి ప్రియమార చేరఁదీసి వాని నుత్సాహమున కెంతయు కొనియాడి కొందరు భూమ

ణములను, కొందరు ఘోటకంబులను, కొందరు భద్రగజో
లను, కొందరు రత్నకిరీట కేతువులను, మరికొందరు రాం
లను, కానుకగా నర్పించిరి. అచ్చటఁ గల గోపకులంబువా
ఆ గోపబాలకుని తమ కులమునకు అధ్యక్షునిగ జేసిరి.

అంత సర్వధరాధినాధులు ప్రమోదాయత్తులై చూడ, ప్ర
తుఁడై నట్టియు, ఉజ్జ్వలమైన కీర్తినిఁ బడసినట్టియు, విశేష బ
దులు గలిగినట్టియు, దైత్యాంతకుఁడును, రామనామ జప
ధ్యాన సంతోషితస్వాంతుఁడును యగు హనుమంతుడు
సాక్షాత్కరించెను. అప్పుడు రాజన్యులెల్లరు సత్యోజ్జ్వలతే
హనుమంతునకు ప్రత్యుత్థానము మొదలైన శ్రుత్యుపచారమ
యొనర్చి శోభఁజెంది యుండిరి. ఆ సభామధ్యమందు క్షితి
మధ్య నక్షాసురదమనుఁడు నక్షత్రమండలంబున నక్షత్రేశునివలె
నుతుఁడయ్యెను. ఇట్లు రాజసభయందు కనకసింహాసనముపై
నుఁడై ఆ మారుతీనందనుఁడు గోపకుమారు నుద్దేశించి యు
నాధులతో "ఓ రాజచంద్రులారా! ఈ బాలకుఁడు యశోవిశా
పావనచరితుఁడై, గోపకులమునకంతకు కీర్తిని దెచ్చును.
ఈతని వంశమునందు అష్టమపురుషుండై, ధార్మికాగ్రణియై
భీరనాధుండై నందుండను నామముతో వెలసి యశోదాదేవికి భ
ఆ ర్తరక్షకుం డగు శ్రీమన్నారాయణుఁడు శ్రీకృష్ణావతా
జన్మింప ఆతనికి పెంపుడుతండ్రియై జన్మమును తరింపఁజేసుకొను

ఈ గోపకుమారుఁడు శనిత్రయోదశియందు శ్రీ గౌ
పూజించినందున భవ్యవిభవస్ఫూర్తులు వేగమె సమకూరెను.
ఆ దినంబున యెవ్వరైన శివపూజన మాచరించిన సకలవైభవ
పొందుదురు" అని వారికిఁ దెలిపి గోపకుమారునకు అనుపమ
మంత్రమును, శివాచారవిధుల నుపదేశించి, అంతర్హితుఁడై

పిమ్మట చంద్రకీర్తియైన చంద్రసేననృపాలుఁడు అఖిల భూపతులకును హర్ష మొదవునట్లు వారిని భూషణాదికములచేఁ బూజించి వారి వారి నగరములకు గౌరవపూర్వకముగ సాగనంపెను. అనంతరమున ఆ చంద్రసేన మహీపాలుఁడు గోపబాలుఁడు మహేశ్వరారాధన తత్పరులై యనేకవర్షంబులు భూలోకమున అపరిమిత సామ్రాజ్య భోగముల ననుభవించి యత్యంతమున సిద్ధ గంధర్వ విద్యాధర జేగీయమానులై శివలోకమునకుఁ జని తత్సాయుజ్యము నొందిరి.

## 12

### ధర్మగుప్తుని బాల్యము

విదర్భదేశమున సత్యరథుండను భూవరుండు ధర్మశీలుఁడై, ఆశ్రితజనరంజనుండై నీతిపథంబున అనేకవత్సరములు ధారుణీతలమును సుఖంబుగ పాలించెను. అంత కృతాంతతుల్యులును, మహాబలవంతులును, దుర్మదాంధులును నైన శత్రుభూకాంతవరులు ససైన్యులై చనుదెంచి అతి పరాక్రమముతో ఆ నగరముచుట్టును విడిచియుండిరి. సత్యరథుఁడును నిజసేనాసహితముగ నరిగి రిపులతో ఘోరసంగ్రామ మొనర్చెను. ఇరుకక్షులవారును వెనుకంజవేయక దారుణముగ పోరాడుచు యుద్ధభూమినంతను రక్తమండలముతోడను, మానవ గజాశ్వ కళేబరములతోడను నింపుచు రణ మొనర్చుచుండిరి. ఆ మహాసంకులమందు సత్యసంధుఁడు నేలఁ గూలెను. ఆ క్షణమందు విదర్భసైనికులు నిరుత్సాహమునుఁ జెంది ప్రోత్సహించు నాయకుఁడు లేనివారై శత్రుదాడి కోర్వఁజాలక నగరాభిముఖులై పారఁజొచ్చిరి. ఆ సమయమున శాత్రవులు ఆ విదర్భనగరము నాక్రమించి బాల వృద్ధ స్త్రీ పురుషుల నెల్ల బాధించి విదర్భపట్టణ మంతయు కోలాహలముఁ గావించిరి.

అరివీరు లట్లు పురముఁజొచ్చిన వృత్తాంతము నాలించి జెంది గర్భవతియై యున్న పట్టపుదేవి నొరు లెవ్వ రెరుంగకుండ ము పశ్చిమద్వారమున కాంతారమార్గంబు ననుసరించెను. కాంతారపథమున నేగి యేగి శ్రమంబంది నొక్క సరోవరత నుండు శీతలవటంబుక్రింద చతికిలబడెను. అంత యా వేళ ముహూర్తమునందు లలితసామ్రాజ్య లక్షణ లక్షితాంగుఁడగు సుతునిఁ గాంచి యచ్చోట నునిచి సలిలపానాభికాంక్షయై కాస నొద్దకుఁ జనెను. ఆ ధరణీశ సతి జలముఁ ద్రాగుచుండ కాలవ నొక మొసలి ఆమెను జలాంతరంగమున కీడ్చి హ్రదమ్మున మ్రింగెను. ఇట్లు పితృ మాతృ హీనుఁడై, బాలభాస్కరుని మహాప్రభతో వెలుంగుచు ఆకలిచే రోదనము గావించుచున్న రాజకుమారుని సామీప్యమునకు భిక్షార్థియగుచు సుమయను ము గలిగి వీతభర్తృకయగు నొక విప్రభామిని తన చిన్నిసుతు కొని యట కరుదెంచెను. నిరతము యూరూరు దిరుగుచు దైవ గమున యచ్చటి కరుదెంచిన యా వధూటి, లాలితరూపకాంతి లక్షణ లక్షిత దివ్యదేహుఁడై యున్న రాజసుతునిఁ గాంచి విస్మయంబంది జనని యచ్చట కానబడనందునను, ఆ యర్భ విప్రుఁడో, నృపుఁడో, వైశ్య శూద్రుఁడో లేక చండాలుఁడో యక తా నెట్లు వానిని పెంచుదునని డోలాయమానసయై విచా చున్న సమయంబున ఒక భిక్షుకవర్యుఁ డటకు వచ్చి "అమ్మా! సంశయింపక శివసుతునివలె శుభలక్షణములు కలిగిన ఈ పసి నిశ్చలమతివై సమ్మదమొదవి అవశ్యముగా భరింపుము. నీకు శు చేకూరును" అని పలికి తన దారిని రయంబునఁజనెను.

అప్పుడా లేమ భిక్షుకవర్యుని యాజ్ఞను శిరసా వహించి నెత్తుకొని యేకచక్రపురమునకు వచ్చి తన యింట తన పుత్రు

బాటు చనుబాలొసంగుచు కొన్ని దినములు, ఇంటింట దిరిగి భిక్షాన్నము దెచ్చి కుడువబెట్టి కొన్నినాళ్ళు, దేవతాసంతర్పణములకుఁ దోడ్కొనిపోయి కొన్నిరోజులు, గొప్పవారిండ్లకు గొనిపోయి హవ్యగవ్యములైన కోరికలను సమకూర్చుచు కొన్ని దినసంబులును ఆత్మసుతుండనియు పరమసుతుండనియు భేద మింతైన లేక సమ్ముదము తోడను ప్రేమతోడ నిరువుర నొకేరీతిని పెంచుచుండెను. తన కుమారునకు శుచివ్రతుండనియు, రాజకుమారునకు ధర్మవ్రతుండనియు నామమిడెను. వారిరువురకు ప్రాయము వచ్చినంతనే బంధుజనుల సమ్మతిని గైకొని ఉపనయన సంస్కారంబులను గావించెను. ఫాల తలమున విభూతిని బూసి, జోలెలు చంకలందిడి బ్రహ్మచారులైన ఆ బాలకు లిద్దరు నుభయపార్శ్వములందు జనుదేర గ్రామాలయ సీమలందిరిగి నాయమ భిక్షాటనము గావించుచుండెను.

ఈ రీతిగ యాచనము గావించుచు సుర యొకనాఁడు విధిప్రేరణముచే నొక శివాగారమునకు దేవదర్శనము చేయ బాలకులతో వెడలెను. అప్పు డచ్చట వృద్ధులగు మహర్షులు, పౌరజనులు, ఆశీనులై దేవోత్సవమును సాగించుచుండిరి. సురయు నయ్యది గాంచుచు నిలచియుండెను. అంత టామెకు ఆశ్చర్యమును గొల్పునట్లు శాండిల్యుఁడను మౌని, రాజకుమారుని సంబోధించి "ఆహా! దైవమాయ అతి చిత్రమైనదికదా! నిజకర్మపాక మెవ్వరికిని ఉల్లంఘించ శక్యముగాదు. ఈ బాలకుఁడు రాజకుమారుఁడై బుట్టి పరసతి నిజమాతయని భావించుచు మానహీనుఁడై యింటింటికిని దిరిగి భిక్ష మెత్తుకొనుచుండెను" అని పలుకుచున్న మౌనిఁ గనుఁగొని యా విప్రవనిత కౌతుకమతియై వినయముతో ఆ మునీంద్రుని పాదపద్మములకు నమస్కరించి కలరవంబున "ఓ మహానుభావా! ఈ బాలకుం డెవ్వరు? ఏ కులమునందు యే పుణ్యాత్ములకుఁ జన్మించెను? ఒకప్పుఁడు యేను భిక్షాట

నమును జేయుచు విధివశమున ఒక సరోవరతీరమున ఆకలిగొని రోదనము గావించుచు మాతృహీనుఁడైన అర్భకుని గాంచి, యొక భిక్షుకవర్యుని ప్రేరణచే దెచ్చి యీ నా పుత్రునితో సమముగ బెంచితిని. గనుక ఓ మునినాథా! ఈ బాలకుని జన్మంబును సవిస్తరముగ దెలియ ననుగ్రహింపుడు" అని ప్రార్థించిన ఆ విప్రభామినినిఁ గటాక్ష దృష్టితో బరికించి యమ్మహాత్ముఁడు సత్యరథుఁడు యుద్ధమునందు ప్రాణములను గోల్పోవుటయు, అతని భార్య కాంతారమున కరుగుటయు, బాలకుఁడు జన్మించుటయు, ఆమెను మొసలి మ్రింగుటయు తెలియఁ జెప్పెను "మహాత్మా! ఇయ్యది మహాద్భుతముగ నా మదికి దోచుచుండెను. తాపసోత్తమా! నీవు కరుణాంబురాశివి. మఱియు సర్వజ్ఞమూర్తివి. తమ కొసంగుచున్న శ్రమకై నన్ను క్షమించి యీ యర్భకుని తండ్రి ఏ పురాకృతకర్మచే సమరరంగంబున పంచత్వము నొందెను? ఏ పురాకృత దుష్కృతంబున జనని మకరిగ్రాహ సంగ్రస్తమయ్యెను? మరి యే పాపఫలముచే యీ రాజసుతుఁడు భిక్షాన్న జీవనంబు జేయుచుండెను?" అని యడిగిన, తాపసవర్యుండు ఆ భూసురాంగన కిట్లనియెను. "ఓ ప్రియభాషిణీ! పూర్వము పాండ్యదేశాధిపతి నిజభవనమునందు యొకనాఁడు శివపూజ యొనర్చుచుండెను. అట్టిసమయమందు ఆ సౌధప్రాంతమున పెద్ద కోలాహల ముప్పతిల్లెను. అయ్యది నాలకించి శివపూజాసక్తి వర్జించి భీమాకారమును దాల్చి రాజన్యుఁడు ఆ కోలాహలమధ్యమున సిల్వగా ప్రధాని వచ్చి శాత్రవుఁ డొకఁడు దుర్గప్రవేశ మాచరించె ననియు, రాజభటులు వానిని బట్టిరనియు దెల్పగా క్రోధోజ్వలుఁడై ఖడ్గమును చేబూని వాని శిరమును ఖండించెను. పిమ్మట కొంతవడికి శాంతుఁడై మృష్టాన్న తృప్తుండై, కోమల పుష్పతలంబున నిద్దురఁజెందెను. పంచవక్త్రుని పూజ వర్జించినట్టి దోషమున సామ్రాజ్యపాలనమున శాటంకము

వచ్చెను. మరియు బద్ధుడగు వైరిని జంపిన పాపమున కా నృపుడు
సంగ్రామమందు తనువుల బాసెను. ఆ నరపాలనందనుండు మరహం
కారముచే ఒక ప్రదోషకాలంబున ఆ నగజాకళత్రుని సమర్చన మాని
భుజించి యంతట తాను నిద్రించినకతమున ఈ జననంబునందు భిక్షా
నియతాత్మకుం డయ్యెను. ఆ రాజపత్ని కుత్సితమతియై తన సవతికి
ఘోరవిషాన్న మిడి జంపెను. ఆ కారణముచే ఈ జన్మమున మకరిచే
భక్షింపబడెను. పరమేశ్వరుని పూజింపని నరులకు పేదరికము సంభ
వించును. మరి యా మహానుభావుని నమ్మి పూజించిన చిరతరమగు
సంపదలు కలుగును" అని ఆ విదర్భరాజకుమారుని పూర్వవృత్తాం
తంబు సవిస్తరంబుగా దెలియ జెప్పి యా భూసురాంగనతో సాండి
ల్యుడను ఘోరసంసారసాగరమందు నిమగ్నులై కష్టముల ననుభవించు
చుండిన జీవుని దరిజేర్ప యీశ్వరపూజ తప్ప వేరొక సాధన మేమి
యు లేదు. నేను నుడువు వాక్యము వేదసమ్మతసారము మరియు
నయ్యది నిక్కముగ ఆపదోద్ధారకమైనది. ఎవరు మహాప్రదోషకాల
మున యీశ్వరార్చన చేయకుందురో యెవరు విశిష్టభక్తితో గిరిజేశ్వ
రునకు నమస్కృతు లాచరింపరో మరి యెవరు నిరంతరంబు పరమేశ్వ
రుని సత్కథల వాలకింపరో వారు మరుజన్మమున భూమిపై అతి
మూఢులై దరిద్రులై బుట్టుదురు. యేనరులైనఁ గాని నిటలేక్షణుని
గూర్చి యనన్యచిత్తులై పూర్ణప్రదోషకాలమున పూజ లొనర్చిన
వార లెప్పుడు భూసుత భోగభాగ్య జయ పుత్ర కళత్ర సుహృత్సమే
తులై దీనత్వము లేక సుజనులై ముదంబుతో నుందురు.

మహాప్రదోషకాలమున కైలాసగిరిపై పరమేశ్వరుడు దివ్య
హాటక రత్నసింహాసనముపై పార్వతీసమేతుడై అధిష్ఠించియుండ,
సకలదేవర్షులు సన్నుతింప సరస్వతీదేవి వీణను మీటుచుండ, కమల
సంభవుండు దాళములువైవ, మహావిష్ణువు మృదంగవాద్యము సల్ప,

మహాలక్ష్మి గానంబు చేయుచుండఁ వాసవుఁడు వైణవోన్నతస్వరమును
గూర్ప యక్ష కిన్నర గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాధిపులు హర్ష
ముతో గొలుచుచుందురు. గనుక ఆ ప్రదోషకాలమున హరుఁ
డొక్కఁడే పూజార్హుఁడు. మరియు ఓ వనితారత్నమా! నీ తన
యుఁడు పూర్వమున విప్రశ్రేష్ఠుఁడై యాత్మజీవన రక్షార్థమై యావజ్జీ
వము దుష్ప్రవర్తన మాచరించినకతంబున ఈ జన్మమందు సంపత్కళా
హీనుఁడై నీ గృహమున జన్మించెను. కావున నీ తనయుని రాజకుమా
రుని ఈ ప్రదోషకాలమున శివపూజాపరులను గావించెదవేని వారికి
సంచితదోషములెల్ల నశించి, భాగ్యమబ్బును" అని ప్రియమారఁ బలికి
నంతనే యా వనిత ఆ మహాత్మునకు వందన మాచరించి పూర్ణకృపా
రసముతో శివపూజాక్రమం బుపదేశింపుమని కోరెను.

## 13

### బాలకులు శివారాధనతత్పరులగుట

అంత నా భూసురభామినికి శాండిల్యమహామునీంద్రుఁడు శివపూజా
విధాన ముపదేశింపఁదొడంగెను, "భూసురాంగనా! ఉభయపక్షంబు
లందును, త్రయోదశిదినంబున నిరాహారుఁడగుచు అస్తమయపూర్వము
మూఁడు ఘడియలకు స్నాన సంధ్యాదికృత్యములు సలుపవలయును.
పిమ్మట ఒక నిర్మలమైన స్థలంబు శుభ్రపరచి గోమయమున జలమును
మిశ్రమము గావించి యచ్చోటు నలుకవలయును. అటుపైని పంచ
వర్ణములుగా పద్మకాది విచిత్రరంగవల్లుల నొనర్పవలయును. ఆ మీఁ
దట నవపల్లవామేయ ఫల పుష్పవృతమంటపము నిర్మింపవలయును.
అచ్చట నవరత్న ఖచిత భద్రాసనమున భద్రముగ శివమూర్తిని యథి

ష్టింపఁజేయవలెను. అంతట గంధపుష్పాది పూజోపకరణ వస్తుసంగ్ర
హంబుఁ జేసి పూజాప్రారంభ మొనరింపవలయుచు.

ప్రథమమున ఆగమోక్తప్రకారము మంత్రాభియుక్తముగ
పీఠంబు నావాహనము మొనర్చి, ఆత్మసంశుద్ధి భూతశుధ్యాదివిధుల
నొప్ప కూర్చుండవలయును. పిదప ఆ శ్రేయస్కాముఁడు ముమ్మారు
ప్రాణాయామంబును నిశ్చలుఁడై కామాంధకారమునెల్ల ఖండించి,
ఆచరింపవలయును. అట్లు గావించినపిమ్మట "ఓ దేవా! కలుషమైన
ట్టియు, భయంకరంబులైనట్టియు, దురంతరమైన రోగంబులనుండి నన్ను
తప్పించి, నా యొక్క దుఃఖములను నివారించి, ఘనమైనటువంటి
కళ్యాణపరంపరాన్వితునిగా నన్నొనరించి, సౌభాగ్యమును వర్ధిల్లఁ
జేయుము" అని భక్తియుక్తముగను, ఇంపుగను సంకల్పమును
జెప్పవలెను.

ఇట్లు సంకల్పమును గావించి బంధుకంబులైన బీజవర్ణంబులతో
మనస్సుయందు మాతృకాధ్యానమును దక్షిణోత్తరప్రదేశంబుల
ముద్రాధారణంబునుగావించి, సాంబసదాశివుని బ్రతిష్టించి, యమ్మహా
దేవుండు చంద్రకోటి ప్రతీకాంశుఁడును, చంద్రార్క వహ్నిలోచనుం
డును, చంద్రశేఖరుఁడును, బిశంగ జటాజూటుండును, నీలకంధరుం
డును, నాగేంద్రకుండలుండును, నాగ కేయూర హార కంకణముద్రికా
వలయ విరాజితుండును, వ్యాఘ్రచర్మాంబరుండును, బ్రహ్మేంద్రాది
సమర్చిత పాదపద్ముండును, రత్నసింహాసనాసీనుండును, మృత్యుం
జయుండును, వృషభధ్వజుండును, నీలలోహితుండును, అష్టమూర్తియు,
శూలపినాకిహస్తుండును, జగధీశ్వరుండును, భగవంతుడునుగా మనం
బునఁ దలంపుచు తద్వామభాగంబునఁ జపాకుసుమముతో సమాన
వర్ణమును, ఉదయసూర్యునితో సమానమైన కాంతియు, మెరుపుతో
సమానమైన వస్త్రమున మిక్కిలి స్వచ్ఛమైనటువంటియు, నల్లని శిరో

జములు గలదియు, తుమ్మెదలవలె ఫాలభాగమున నటించు ముంగు రులుఁ గలదియు, ముఖపద్మముపై ప్రకాశించు మాణిక్యఖచితమైన కుండలములు కలదియు, నుదుట కస్తూరీతిలకముఁ గలదియు, చెక్కుటద్దముల మంచి గంధలేపనముఁ గలదియు, మందహాసముతో నొప్పుచున్న పెదవులుఁ గలదియు, కంబుకంఠియు, పద్మకోశములతో సమానమైన కుచములుఁ గలదియు, చతుర్భుజములుఁ గలదియు, పాశాంకుశ ధనుర్బాణముల ధరించినదియు, మణిమయ మేకలయు, కదళీస్తంభ సమానంబైన యూరువులుఁ గలదియు, దేవగంధర్వులచే మందార పారిజాతములచే నిత్యము పూజింపఁబడునదియు, మహా త్రిపురసుందరియు, జగదంబయు నైన గిరికన్యకను నాత్మలో దలంచి తదనంతరంబున బాహ్యపూజాపరుండై సవ్యాపసవ్యంబుల గురుగణేశులఁ బూజించి యీశాన్యాద్యష్ట దిగ్భాగంబుల క్షేత్రపాలక వాస్తు స్పతి సరస్వతి పార్వతీ ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యంబుల నామోంతంబులుగా పూజనంబులుఁ గావించి, ఇంద్రాద్యష్ట దిక్పాలకులను, సప్త మాతృకలను, అణిమాద్యష్టసిద్ధులను, ధర్మార్థ ధర్మంబులను, దత్తదేతాకంబులైన మంత్రంబున సమర్చితులం గావించి, నందీశ్వర, చండీశ్వర, భృంగీశ్వర, కుమార వీరభద్ర సమేతుండును, తేజోమయుండును నైన సాంబశివుని షోడశోపచారంబులఁ బూజింపవలయును.

అట్లు ధ్యానంబును గావించి, ఆవాహనించి, నవరత్న సింహాసన మర్పించి, అర్ఘ్యపాద్యంబులొసంగి, ఆచమనంబు చేసి, పిమ్మట ఆ నీహారావగాధరునకు వస్త్రయుగ్మంబు, యజ్ఞసూత్రంబు, గంధపుష్పాక్షతములు, పరిమళోపేతధూపంబు నర్పించి ఆ బ్రహ్మాండదీపమునకు దీపమియ్యవలెను. తదనంతరమున గోఘృతము, శర్కర మిశ్రితమైన భక్ష్యభోజ్యములను, ఫలములను, కందమూలములను, పాయసాన్న సూపములను, శీతలజలమును, దధితక్ర ప్రదితోపహారముల నొసంగి

గౌరీహృదయారవింద కమలాప్తునకు కర్పూర నీరాజనము నిర్మలభక్తి తో నొసంగవలెను. అనంతరము పుష్పాయుధసంహారుండై, సకల దేవతాపూజ్యుండైన పరమేశ్వరునకు పుష్పాంజలి యొసంగవలెను. ఆ పరమశివునకు ప్రదక్షిణ నమస్కారపంచకంబు సలిపి సిద్ధసేవ్యుం డైన శ్రీ సదాశివుని మ్రోల నృత్య గీత విధుల నెరపవలయును.

క॥ "శరభావతార శంకర
శరభా హేరంబజనక చంద్రవతంసా
శరభార్క చంద్రపాండుర
శరభంగాదిక మహర్షి సన్నుతచరితా॥

గీ॥ శరణు శ్రీ పార్వతీనాథ శరణు శరణు
శరణు కైలాసగిరి వాస శరణు శరణు॥

క॥ "రక్షింపుము పరమేశ్వర
రక్షింపు ఫాలనేత్ర రమ్యచరిత్రా
రక్షింపుము భక్తవత్సల
రక్షింపు విపన్న జన శరణ్య మహాత్మా॥"

అని ప్రార్థించి సాధకుండు సచ్చాల్యన్నదాన క్రియాద్యుపచారం బుల వీరశైవులకు సంతోషంబు గావించి మాన్యపదేశుండగుచు భక్తి జ్ఞాన వైరాగ్యములతోను, మాధిపుని సేవించిన సకలసంపదలు చేకూ రును. అట్లు చేసినయెడల యీ భూమిపై మానవులకు శివద్రవ్యాప హార క్రియాదురితం బొక్కటి దప్ప తక్కిన దుష్పాపంబు లన్నియు పోయి బంధుజనక్షేమములతో, స్థిరసంపదలతోను, ఆయురారోగ్య ములతోను చిరకాలము క్షేమముగ నుందురు. క్రిమి కీటక పతంగ ములకంటె పశువు లధికము. పశువులకన్న నరు లధికులు. వారిలో ద్విజు లధికులు. ద్విజులకన్న వేదాధ్యయనసంపన్ను లధికులు. వారి కంటె సన్న్యాసాశ్రమవాసు లధికులు. వారికంటె జ్ఞానవంతు లధికులు.

వారలకన్న శివపూజాపరులు శ్రేష్ఠులు. వారికంటె షట్సల శివపూ
జ్ఞానసంపన్ను లధికులు. వారికంటె అధికమైనవాఁడు ముల్లోకము
దును లేడు. గనుక నీ వింక ఈ బాలకులచేత శంకరవ్రతం బాచరిం
జేసిన వీరలకు దారిద్ర్యంబులు దొలంగి మహదైశ్వర్యము సిద్ధించు
అని మునీంద్రుఁడు నుడివినపిమ్మట ఆ విప్రవనిత సాష్టాంగదండప్రమా
ణంబు లాచరించి ముకుళితహస్తయై "మునిచంద్రా! ఈ మహాఘో
దారిద్ర్యపీడా పారావారంబున మునింగియున్న మమ్ముద్ధరింపఁ నీ
అర్హుఁడవు. అనన్యశరణ్యులమైయున్న మమ్ము అనుగ్రహింపుము
అని బలికిన యా భూసురభామినినిఁ గటాక్షించి యమృతోపమా
బులగు వాక్యముల నూరడించి, యా బాలకులకు మహేశ్వరారాధ
పరంబైన మంత్రవిద్య నుపదేశించినవారును బ్రహృష్టాంతరంగు
యా మహర్షిసత్తమునకు బ్రణమిల్లి తదనుజ్ఞాతులై యా మువ్వు
నిజమందిరమునకు గ్రమ్మర జనుదెంచిరి. శాండిల్యమహాము నీంద్రు
డును నిజతపోవనమునకుం జనియెను.

అంత టా మునివర్యుని ఆజ్ఞప్రకారము నయ్యిరువురు బాలకులు
ప్రదోషకాలమందు అనుదినము శివపూజాపరులై వర్తింపుచుండి
ఇట్లు నాలుగుమాసములు గడచెను.

ఒకనాఁడు ఆ బాలకు లిరువురు మాధ్యాహ్నిక స్నాన మాచ
రింపఁబోయి తటంబున విహారము సల్పుచుండ శ్రీ పరమేశ్వరాను
గ్రహమున ధనరాశిని గాంచిరి. బాలకులు ఆశ్చర్యజనితులై పరమా
నందముతో నా ధనము నంతయు నెత్తుకొని తల్లివద్దకుఁ జనిరి. ఆమె
యు తమ యదృష్టము ఫలించినందులకు ఆహ్లాదమును జెంది ఆ బాలకు
లుభయులను ధర్మరీతిని సమానముగ బంచుకొనుమనెను.

అంతట రాజకుమారుఁ డగు ధర్మగుప్తుఁడు "అమ్మా! ఇప్పుడు
స్వామి యనుగ్రహము వలన లభించిన ధనమునంతయు గొనుటకు నా

యగ్రజుండగు యీ శుచివ్రతుఁడే యర్హుఁడు. కనుక ఈ ధననిక్షేపము నందు నాకేమియు వలదు. ఈశ్వరుఁ డింకను యేమైన నిచ్చునేని దానిని నేను భక్తితో గ్రహించెదను" అని ముదమారఁ బలికెను. ఇట్లు వైదర్భనందనుఁడు గురూపదేశము ననుసరించి శివపూజాధనుఁడై షోడశవర్ష వయస్కుఁ డయ్యెను.

## 14

### ధర్మగుప్తుఁడు గంధర్వ రాజకన్యకను వరించుట

దిక్కులనన్నిటిని ప్రకాశింపఁజేయునట్టియు, చాతక పక్షి సము దాయమునకు సంగమకాలమైనట్టియు, సంతోషదాయకమైనట్టియు, మన్మథోద్రేకమును హెచ్చుగావించునట్టియు, తుమ్మెద లను బాణము లచే ప్రకాశించునట్టియు, భూమినంతయు వేడిచే కప్పునట్టియు, మార్గ స్థులకు సహింపరానట్టియు, వసంతఋతువు ప్రవేశించెను. కానన భూము లన్నియు కలకంఠ శుకపికావళియొక్క గళకలారవములతో విరాజిల్లుచుండెను. కాసారంబు లన్నియు జలజేందీవర హల్లక కలిత ములై యొప్పుచుండెను.

ఇట్లు అఖిలజన చిత్తానందకరంబును సమస్తమంగళాయతనం బును, అశేష వృక్షవాటికాజీవనౌషధమును, రతిరాజ విజయకారణం బును నైన ఆ వసంతసమయమున ఆ బ్రహ్మ క్షత్రియ నందను లిరు వురు వినోదార్థముగా వనమునకుం జని యథేచ్ఛావిహారముల వర్తింపు చున్న సమయమున, అనతిదూరంబున యొక రమ్యసరోవరమందు క్రీడించుచున్న అసమాన రూపురేఖావిలాసములు గల గంధర్వ కన్య కలం జూచి, తద్విలాసాతిశయములకు దన మనంబున విస్మయము దీపింప శుచివ్రతునిఁ జూచి రాజనందనుఁడు "అన్నా! ఇటుజూడుము.

ఈ వనాంతరంబున అత్యంత సౌందర్య సంపన్నాకారములతో దివ్యస్త్రీలు భాసిల్లుచుండిరి. గనుక విలాసార్థముగ మనము వారి సాన్నిధ్యమున కేగి నేత్రోత్సవమును గావించుకొందము" అని పలికిన భూసుర నందనుఁడు శాంతస్వభావముతో హితయుక్తముగ "అనుజా! మనము విద్యావంతులము. మరియు బ్రహ్మచారులము. ఇప్పుడు మనమా స్త్రీల సామీప్యమున కరిగెదమేని యుపకులమగు మనము కామోద్రేకులమై చెడుమార్గమును బట్టుదుము. కనుక తక్షణమే మనగృహమున కేగుట అతి యుత్తమము" అని జెప్పెను.

అప్పుడు రాజనందనుఁడు "అన్నా! అట్లైన నీవు ఇచ్చటనే నిలచియుండుము. నే నచ్చటకుఁ జని క్రమ్మర యరుదెంచెదను" అని చెప్పి వేడుకతో దాను వెడలెను. అట్లు ఆ రాజకుమారుఁడు గంధర్వ కామినులు విహరించుచున్న యుద్యానవన ప్రదేశమునకు వచ్చి అత్యంతానందభావముతో వారిని గాంచుచుండెను.

అందొక బాలికారత్నము మన్మథాకారుఁడగు రాజకుమారుని జూచి ఆ కల్యాణ సుందరరూపమున కచ్చెరువంది "ఆహా! బ్రహ్మ సృష్టి వైచిత్రి మహానందదాయకము. కమలదళాయత తేక్షణుఁడై కంబుగళుండై, దీర్ఘబాహుఁడై, గజేంద్రగమనుఁడై, విశాలసువక్షుఁడై, సుందరాననుండై, సువర్ణ వర్ణుఁడగు ఇట్టి లక్షణాంగుని యెన్నడును గాంచి యెఱుంగను. నిక్కముగ నీతఁడు మారుండో నలకూబరుండో మరేదేవతాపూజ్యుండో ఇట్టి మంగళకరమైన రూపముతో మానవుఁడై నాకు నేత్రానందమును కలుగజేయవచ్చినట్లు తోచుచున్నయది. ఇట్టి ధైర్యశౌర్యరూపంబులన్నియు దీపింపఁజేయు మంగళాకారుని నే నేరాజకుమారునియందును జూడనైతిని. ఈతఁడు యొక రాజకుమారుఁడగుట నిక్కము. గనుక ఈతనిని వరింప నామదికి తొందరజెందుచుండెను" అని యబ్బురమందుచుండెను.

అంతట ధర్మగుప్తుఁడు విమలోత్పలనేత్రియు, మరాళగామినియు, శరత్కంజాతపత్రేక్షణయు నైన చిత్రరథపుత్రికను గాంచి "ఈ కోమలి దేవలోకసుందరియో గంధర్వరాట్కన్యయో నాగకామినియో నా మదికి లోకమోహినివలె దోఁచుచుండెను" అని మోహపరవశుఁడై తలఁచుచుండెను.

గంధర్వకన్యక నృపకుమారుని విలాసవిభ్రమములఁ జూచి సంపూర్ణ వేడ్కఁగలదై తన చెలికత్తియల నచటయునిచి యా రాజసుతుని పద్దకు వచ్చి "ఓ రాజతనయా! నీవు గృహంబున కిప్పుడు జని రేపటి దినంబున ప్రాతఃకాలమందు యీ వనమునకుఁ దప్పక యరుదెంచెదవేని నీకు సకలశుభంబులును చేకూరును" అని మృదువచనములతో నుడివి ఆ గంధర్వరాజకన్యక సఖీజన సమీపంబునకు మరలెను. అంతట రాజకుమారుఁడు భూసురనందనుం డున్న యెడకు వచ్చి గృహంబునకుంజని తన తల్లికి యావద్వృత్తాంతము నివేదించి ఆమె మనంబునకు ప్రియము గొల్పి మరునాఁడు ప్రభాతకాలమున ద్విజపుత్రక సహితంబుగా వనంబును ప్రవేశించి పూర్వనిర్దిష్టంబైన ప్రదేశమునకుఁ జనెను.

## 15

### ధర్మగుప్తుఁడు సామ్రాజ్యాధిపతి యగుట

అంతట గంధర్వరాజచంద్రుఁ డగు చిత్రగుప్తుఁడు వారలను గాంచి సాదరాహ్లాదముతో సన్మానించి యొక లలిత వృక్షమూలతలమున గూర్చుండి "భూపాలసుతా! ఇటీవల నేను కైలాసశైలమునకు వెడలి అందు ఆర్యాసమేతుఁడై వెలయు శ్రీవిశ్వనాథుని దర్శించితిని. ఆ మహానుభావుఁడు అఖిల సుపర్వులు వినుచుండ 'భూలోకమునందు యేకఛత్రపురమున ధర్మగుప్తుండను రాజకుమారుఁడు హితబాంధ

వుఁడై, రాజ్యభ్రష్టుఁడై బరగుచుండెను. అతఁడు గురువాక్యమునఁజేసి నన్ను నను దినము భక్తిశ్రద్ధలతో గొల్చుచుండెను. వారు గావించిన పూజా మహిమఁజేసి ఆ బాలకుని మాతాపితృలు మదీయలోకంబునందు సుఖంబుగ నున్నవారు. నీవు వివేకశాలివి, మరియు నిశ్చలచిత్తుండవు గావున నిర్మల సద్గుణగణుఁడైన యీ భూవరనందనుండు పరభూపతు లను వధించి రాజ్యసంభావితవృత్తినుండ ననపాయసహాయము నాచ రింపుము. మరియు మదీయ వరమున నీకు జన్మించిన కుమార్తెను వానికి నుద్వాహ మొనర్చి ధన్యుఁడవుకమ్ము' అని నాతో వచింప మహాప్రసాదమని పరమేశ్వరునకు సాష్టాంగవందనము లాచరించి భూలోకమున కరుదెంచి గతదినంబున ఈ వనమునకు నా ప్రియపుత్రి కతోను, సపరివారములోడను నరుదెంచితిని. గనుక ఈశ్వరాజ్ఞా బద్ధుండవై మదీయపుత్రికను పాణిగ్రహణ మొనర్చుకొని అటుమీఁదట కుటిలులైన నీ శాత్రవరాజ సముదాయము నెల్ల సంహరించి నీ రాజ్య మును నీ కర్పింపఁజేయుదును. పిమ్మట నీవు వైభవముమీర పదివేల వత్సరంబులు అధిక కళ్యాణసౌఖ్యంబు లనుభవించి యక్ష కిన్నరవిద్యా ధరాది సేవ్యమగు శివపదమును జేరగలవు" అని పలికి గంధర్వుఁడు తన పుత్రిక నొసంగి రాజతనయునకు ఆ వనమధ్యమందు వివాహం బొనరించి యథోక్తవిధిని మహోత్సవ మాచరించెను.

అట్లు నిజతనూజను బాణిగ్రహణ మొనరించి పారితోషికముగ కనకరత్నమయంబులైన అమేయ దివ్యాంబరాభరణంబులును, భాస మానంబులగు ముక్తాహారంబులు చంద్రసన్నిభంబైన శిరోరత్నంబును దశ సహస్ర సంఖ్యాతంబులైన కాంచన స్యందనంబులును, మరియొక దివ్యరథంబును, దివ్యకార్ముకంబును, దివ్యాస్త్ర మంత్రప్రయోగోప సంహారంబులును, శత్రుమర్దనంబైన ఖడ్గంబును, అమోఘంబైన శక్తి యును, దుహితృపరిచర్యార్థంబుగా దాసీజన సహస్రంబు నొసంగిన

యా రాజకుమారుఁడు మహైశ్వర్యసంపన్నుఁడై నిజభార్యాసమేతం బుగా బరమానందంబును జెందియుండెను. అంత నా గంధర్వపతి ఆ దంపతులను వీడ్కొని విమానారూఢుండై క్రమ్మర నిజలోకంబు నకుఁ జనియెను. పిమ్మట రాజనందనుండు శుచివ్రతునితో సమర సంగంబును తాను వైరివీరులను దునిమి తన రాజ్యము నాక్రమించి వారల శాసించెద నని ప్రియమారఁ బలికి సమ్మతింపఁజేసి ఆత నిని గృహంబునకనిపి తాను సంగ్రామాభిలాషియై విదర్భాభిముఖుండై యేగెను.

అప్పుడు కృతకృత్యుండగు ధర్మగుప్తుఁడు కృతోద్వాహుఁడై చతు రంగబలంబుతో జని శత్రుసైన్యములను దునిమి, వారిని పరాజితులను గావించి నిజమిత్రామాత్య యుక్తంబుగ భేరీవాద్యము లుల్లసిల్ల వైభవ యుక్తముగ పురప్రవేశమును గావించి సింహాసనాసీనుఁడై గౌరీనా థుని కృపాకటాక్షమున తన కీర్తి దిగంతరాక్రాంతమగునట్లు రాజ్య మును బాలించుచుండెను.

ఏ కరుణామయి మాతృహీనుండగు తన్ను ఘోరకాంతారంబుల నుండి దెచ్చి మచ్చికజేసి స్తన్యమునిచ్చి పెంచి నామకరణాది సంస్కా రంబు లొనరించి శ్రీ గురుకారుణ్యసిద్ధుని జేసెనో, ఏ జనని తన్ను సతతప్రదోష సువ్రతశీలుని గావించి పరమేశ పూజాపరునిగా నొన రించెనో, ఏ వనితామణి తన్ను ఘోరదారిద్ర్యాంధకారంబుల నెడ బాపి భాసురైశ్వర్యసంపన్నుని జేసెనో యట్టి యా భూసురాంగనను తనయుని సహితంబుగ రప్పించి జననిమాడ్కి తన శుద్ధాంతముననుంచి నిజవధూయుక్తుఁడగుచు నుపచరించుచుండెను. ఆ విప్రాంగనయు రాజ దంపతులను కూరిమితో తన కోడలు కొడుకులుగా భావింపుచు గారా బము చేయుచుండెడిది.

ఇవ్విధముగ ధర్మగుప్తుఁడు పూర్వజన్మంబున గర్వాంధతచే ప్రదోష శివపూజ యొనర్చనందున యా దోషముచే బాల్యకాలము నందా దృశ్యంబగు దైన్యం బనుభవించి క్రమ్మర మహేశ్వరారాధనా తత్పరుండై తత్సుకృతంబున నిజభార్యయైన గంధర్వకన్యకతోఁ గూడి పితృపైతామహంబైన రాజ్యమును అఖండ సామ్రాజ్యభోగముల ననుభవించి యంత్యమున అనంత తేజోవిరాజమానంబైన శివలోకమున పరమేశ్వర సాన్నిధ్యంబున సుఖంబుగ నుండెను.





శుభమస్తు

# బ్రహ్మోత్తర ఖండము

## ద్వితీయ భాగము

### సీమంతినీ జననము

మ. "అలరం సాంబశివుండు కాలమదసంహారుండు సర్వాత్మకుం
డలఘు ప్రాభవు డట్లుగావునఁ దదీయారాధనాంకవ్రతం
బులు నశ్రాంత మకాలమృత్యుభయముల్ ద్రోయు టాశ్చర్యమే
తొలగుం దారుణకాలమృత్యువు దత్యుగ్రప్రభావంబునన్"

సూతమహాముని శౌనకాది మహామునులను సంబోధించి "మహేశ్వరవ్రతములలో నొకటగు సోమవారవ్రతమును బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో స్త్రీ పురుషు లెవ్వారైనను బ్రహ్మచర్య, గృహస్త, వానప్రస్త, సన్యాస, ఆశ్రమవాసు లెవ్వారైనను ఆ నాఁడు ప్రాతఃకాలమున లేచి స్నానమాచరించి రాజిత మంటప మధ్యపీఠమందు హిమగిరి పుత్రికారమణుండైన యిందుకళాధరుని షోడశోపచారములఁ బూజచేసిన వారు దురంతవిపద్భయ మెన్నఁడును యెరుంగకుందురు. మరియు ధన కనక వస్తు వాహన వనితా సుత భోగ మోక్ష

వాంఛాపరులై ఆ మనసిజహరుని సేవించిన వారలకా కామితార్థములు సంసిద్ధియగును” అని చెప్పి మరియొక యితిహాసమును చెప్పఁ దొడంగెను.

అమలాచార కలితమైనట్టి ఆర్యావర్తదేశంబున కాళిందీతీరమున కమలేందీవర హంస కాక విలసితములు గాసాగములతోడను, లతాగుల్మ ఫలవృక్షాదులతోడను విరాజిల్లు నుద్యానవనములు గలిగినట్టియు, భద్ర గజాశ్వ రథ పదవీకాని సంసేవితంబైనట్టియు రాజధాని యొకటి గలదు. ఆ రాజ్యము నేలు చిత్రవర్మ ధర్మవర్తనుండై పరిపూర్ణ కృతాధ్వర పుణ్యకర్ముండై భూపతిశేఖరుండై విద్యయందు కమలభవుని, వర భోగ సౌందర్య వాగ్విశేషంబుల విష్ణుమూర్తిని, వైరుల నడంచి ప్రతాపమును వెల్లడించుటయందు పరశురాముని, ఘన బుద్ధి సత్కళా గాంభీర్యములందు చంద్రుని పరిహాసించుచు దిగంతరమున సకల జనులు వినుతింప సమ్మదముతో రాష్ట్రము నేలుచుండెను. మరియు శరణాగత రక్షణమును, దైవభక్తియు, గురుభక్తియు గలిగి రాజన్యుఁడు వెలయుచుండెను. ఇట్లుండ ఆ ధర్మరతుండైన చిత్రవర్మకు ఆరుగురు కుమారులను, పిమ్మట చిరకాలమునకు కళ్యాణ ధన్యయు సకలజనమాన్యయు నైన యొక కుమార్తెయు జనించిరి.

చిత్రవర్మ తన పుత్రికను గాంచి పార్వతిని గనిన హిమవంతుని వగిది యుజ్జ్వలతేజోవిభవంబులతో అమితోత్సాహియై చిత్తము రంజిల్ల మహాసిద్ధాంతుల రావించి బహూకరించి ఆయమ పుట్టిన లగ్నభావంబున జాతక లక్షణములను దెలిసికొని “ఓ విద్వాంసులారా! మా వంశమున బుట్టిన రాజకన్యక లెల్లరు సామ్రాజ్యాభియోగార్హ సౌభాగ్యముతో వర్ధిల్లుచుందురు. అట్లుగనే యీ శిశువు గూడ దైవపూజాభిరతయై యీ ధరణీతలమున నెట్లు దీపించునో దెలుపఁగోరుచుంటిని” అని నుడివెను. అది విని వారు సంతోషాంతరంగులై ప్రావీణ్యముతో

జ్యోతిషశాస్త్రము లన్నియు వితర్కించి ఆ రాజన్యునితో "నృపా పతంసా! ఈ మానిని యాగర్భశ్రీమంతినియై, సత్కళావిశేషాత్మయై, సీమంతవతీమణియై యీ పృథివీతలముపై ప్రసిద్ధివహించును. మరియు యీ కన్యకారత్నము మహాలక్ష్మిపగిది సౌభాగ్యవతియు, సరస్వతివలె కళాప్రౌఢి మెరయ విద్యాధరియు, పార్వతీదేవిరీతి మాంగల్యవతియు, రేవతి కరణి సంపదలం జెందియు, దమయంతిలీల సౌందర్యమును వహించి అరుంధతిపగిది ఆచారమును కలిగియు సావిత్రివలె సాధుత్వమును జెందియు విభునితోఁగూడి పదివేలవత్సరములు అఖలసామ్రాజ్య భోగంబు లనుభవించి, యష్టపుత్రుల నొక్క కన్యకనుగాంచి, పుణ్యాచారిత్రి యగును" అని యీ విధంబున నిజపుత్రికా జాతకఫలంబులు చెప్పిన సైద్ధాంతికజనంబుల సుధారసోపమానంబులైన భాషణంబు లాకర్ణించి పరమానంద కందళితాంతరంగుండై యా భూపాలుండు వారల ననేక మణిమయ భూషణాంబరంబులం బూజించియున్న సమయంబున ఒక ధూర్తబ్రాహ్మణుండు లేచి యెల్లరకు నాశ్చర్యంబు గొల్పునట్లు దైవగతిని యా కన్యక షోడశవర్షప్రాయంబున పతివియోగమును జెందునని రాజునకుం దెల్పెను. ఆ పిడుగుంబోలిన మాటను వినినంతనే యా రాజచంద్రుండు బహుతర చింతాసముద్రమున మునింగి కొంతప్రొద్దు తల్లడిల్లెను. తదనంతరమున ఆ వేదాంతసార పారంగతుండైన యమ్మహీపాలుండు గ్రమ్మర ధైర్యం బవలంబించి సర్వము దైవాధీనంబని మనంబున నిశ్చయించి నిశ్శంకుండై యా విద్వాంసుల నెల్ల నిజనివాసంబులకుం బోవంబనిచి తాను అభ్యంతరమందిరమునకుం జని భార్యాసమేతంబుగా నతి ప్రేమంబున నక్కన్యకారత్నమునకు సీమంతినియని నామకరణంబిడి అనుదినము పలాలనము చేయుచుండెను.

ఆ సీమంతిని సౌందర్యవిలాసినియై, వివిధధాత్రీవర్ధమానాంగియై, హాసోల్లాస ముఖాబ్జయై చంద్రబింబముపగిది దిన దిన ప్రవర్ధమాన

యగుచుండెను. మరియు ముద్దులొలుకు మొగంబును, యెర్రని మోవియు, తెలికన్నులును, సువర్ణాంబరములును, నల్లని వెంట్రుకలును, మోహనమైన రూపంబును మెరుగారు చెక్కుటద్దములును గలిగి పితృ బాంధవ పౌరులకెల్ల నేత్రానందమును కలుగఁజేయుచు అల్లారు ముద్దుగా బెరుగుచుండెను. ఆమె చెలికత్తెలతో గూడి శైశవక్రీడా శక్తిఁ గలిగి సమ్మోదముతో బొమ్మలపెండ్లిండ్లు జేయుచు, పుష్పవాటి కలలో పొలుపుమీర విహరించుచు, గుజ్జనగూళ్లను వండుచు, బంగరు తూగుటుయ్యాలల నూగుచు, పంతంబుతో చెబంతుల నాడుచు, హంస లకు నడకల నలవడఁజేయుచు, మయూరములకు నృత్యముల నేర్పుచు, శారికా కీరములకు మాటలు జెప్పుచు, దాగుడుమూతల నాడుచు, సుశీలయు, జగన్మోహినియు నగు సీమంతిని దినకరునివలెఁ దిన భాజిల్లు చుండెను. ఇవ్విధంబున నా రాజకన్యక బాల్యక్రీడా వినోదంబుల గొంతకాలమును గడపి పంచమవర్షంబున గురుజనంబుల వలన నక్షర స్వీకరణాది కృత్యములను బొంది పిమ్మట బహువిధ శాస్త్ర గ్రంథ పరిశీలనము గావించి సమస్త విద్యాప్రవీణయు, నత్యంత మేధాధురీణ యు, ప్రౌఢభాషావిజృంభమాణయునై యుండెను.

అంత నొకనాఁట రేయి ఆ రాజకన్యక నిజప్రియ దూతికవలన తనకు పదునారవ సంవత్సరప్రాయమున కలుగఁబోవు వైధవ్యము నెరింగి ఘనతర సంతాప శోకసంతప్త యగుచు, మనమున దహతహ జెందుచు, గురుపత్ని యగు మైత్రేయి సదనమునకుఁ జనెను. అప్పుడు స్వచ్ఛమైన కేశసముదాయము కలిగినట్టియు, కాషాయాంబరధారి ణియు, శోభనార్థము నిచ్చునట్టియు, శ్రీ యాజ్ఞవల్క్య మునిశేఖరుని హర్షవిధేయయు, నిజభక్తిచే మహాదేవుని స్వాధీనము చేసుకొనినదియు, మహాపతివ్రతయు నగు మైత్రేయిని ఆ సుహృత్తమైన రాజకుమార్తె నిజగృహమధ్యమున సుఖాసీనయై యుండగఁ గాంచి తత్పాదాంబుజ

ములకు తన ఫాలము సోఁక మ్రొక్కి తన విచారమునకుఁ గల కారణము నెల్లఁ దెల్పి "అమ్మా! నేను నిన్ను శరణుజొచ్చితిని. కరుణించి యే సువ్రతము నొనరించిన సౌభాగ్యము ప్రాప్తించి సుఖము కలుగును? అదియునుంగాక భయాతురస్వాంతనైన నన్నుఁ గరుణించి దీర్ఘ సుమంగలి నగున ట్లనుగ్రహింపవలయును" అని తన పాదములకు ప్రణమిల్లియున్న యక్కన్యకాంతన్నంబును అత్యంత కారుణ్యదృష్టితో జూచి తద్గుణశీలంబు లింత యొప్పునే యని యగ్గించి యా శుభాంగికి మనఃప్రియంబుగా మైత్రేయి "ఓ రాజకన్యకా! వినుము. నీవు గౌరీ శంకరులను భక్తితో నారాధింతువేని ఘోరాపద్భయంబులను బాసి కుశలమతి వగుదువు. మరియు నీవు సోమవారమున సురుచిరభక్తితో నుపవసించి, స్నానమాచరించి, ధౌతవస్త్రయుగ్మధారణ మొనరించి, శమదమయుక్తవై, విమల సౌమ్యమనస్కవై, సదాశివాగమ నియమజ్ఞవై, విగతకైతవభావము గలిగి, సోమవారము ప్రదోషమున షోడశోపచారములతో బార్వతీ పరమేశ్వరులు రంజిల్లునట్లు పూజ యొనర్పవలయును. పూజానంతరమున పవిత్రులైన శైవులకు భోజన మొనరించి శైవవనితలను గౌరవించి హరిద్రాంజన రాజిత సుమ కంచు కాంబరము లీయుదగును. ఎట్టి యాపదలు వచ్చినను ధూర్జటిపూజ విడువరాదు. పట్టుదలతో నయ్యది గావించిన శుభము చేకూరగలదు" అని చెప్పి యమ్మహాముసిపత్ని సీమంతినినిఁ జూచి "నేను ఈ మహా వ్రతఫలంబు వివరించెదను. సావధానముగ నాకర్ణింపుము. అభిషేకమున బాపక్షయంబును, పీఠపూజయందున సామ్రాజ్యభోగంబును, గంధమాల్యాక్షతార్పణంబుల వలన అమిత సౌభాగ్య సౌఖ్యములును, ధూప దానంబున సౌగంధ్యంబును, దీప ప్రదానంబున గాంతి విశేషంబులును, నైవేద్యమున మహాభాగ్యమును, దాంబూల దానంబున సంపత్సమృద్ధియు, నమస్కారంబున ధర్మార్థ

కామమోక్షప్రాప్తియు, మంత్రజపంబున అణిమాద్యష్టైశ్వర్యసిద్ధు లును, హోమంబున సర్వకోశాభివృద్ధియు, వీరశైవులకు భోజన మొసంగినందున సమస్త దేవతాసంతుష్టియు, వీరశైవవనితా పూజ నంబున దీర్ఘసుమంగళత్వంబును గలుగును. గావున నీ విమ్మహా వ్రతంబు నాచరించి భవానీశంకరుల నారాధింపుము. తత్ప్రసాదంబున ఆపదలెల్లఁ బాసి సుఖంబున నుండగలవు. శివపూజామహాత్మ్యమువలన మహా ఘోరసంకటములైనను దొలంగును” అని సోమవారవ్రత ప్ర భావంబును, క్రమంబును మైత్రేయువలన దెలసికొని సీమంతిని నిజాంతః పురంబునకు వచ్చి వ్రతము నాచరించుచుండెను. చంద్రమండల సమానమైన ముఖమును గలుగుటఁజేసి శ్రీ మహాలక్ష్మివలెను, కఠిన మైన వక్షోజము గలిగియుండుటచే పర్వతరాజపుత్రికవలెను, చాతుర్య మైనట్టియు, ప్రౌఢమైనట్టియు సంభాషణ నేర్చి వాగ్దేవివలెను, సుకు మార సౌందర్యములను గలిగి రతిదేవివలెను, వివిధరత్నములచేత కట్టబడిన విశాలహర్మ్యములను భాగ్యభోగ్యములను కలిగి శచీదేవి వలెను, సకల శ్రీ లోకమునకును అలంకారమైన నవయౌవ్వన సుకు మారియై యా సీమంతిని సకల సద్గుణ గరిష్ట యని పేరొందుచుండెను

## 2

### సీమంతినీ కళ్యాణము

లాలితరూపవతియై, లక్షణ లక్షితగాత్రియై, యౌవ్వనాంకుర వతియై షోడశవర్షప్రాయము గల నిజకుమారీరత్నమగు సీమంతినినిఁ గాంచి, చిత్రవర్మ బాంధవ మంత్రి పురోహిత ప్రధానాళి సమే తుండై సభఁ గావించి, పరమహర్షముతో ఆమెకు వివాహమును జేయ నిశ్చయించెను. అప్పుడా రాజకన్యకయొక్క సౌందర్యప్రాభ వంబులను విని వివిధదేశములనుండియు అతి వేడుకతో రాజకుమారు

లనేకులు వచ్చియుండిరి. తుదకు సార్వభౌములలో నుత్తముఁడై కీర్తి వెలసిన నిషధేశ్వరుఁడగు నలుని కూఁతుమిత్రసహునియొద్ద యింద్రసేనుని కుమారుఁడై, మదనసౌందర్య చంద్రాంగదుఁడై, శరచ్చంద్ర చంద్రావతంసుఁడై, యువకుఁడై యొప్పుచుండిన చంద్రాంగదుని రావించి, సకలబాంధవ సమక్షమునను బరమహీనాథులను బరిహసించి, చిత్రవర్మ తన మురిపెంపుల కుమార్తె యగు సీమంతినిని నిచ్చి సకలవైభవములతో యుద్వాహ మొనరించెను.

ఇట్లు వివాహమైనపిదప మహామతిమంతుఁడును, చంద్రశేఖర ధ్యానపరాయణుండును, పరతత్త్వవిదుండు నగు చంద్రాంగదుఁడు యా నలినాక్షినిఁ గూడి మహేంద్రభోగంబుల ననుభవించుచుండెను. ఇవ్విధముగ సాదృశమగు నీతివర్తనముతో కొన్నినాళ్ళు చిత్రవర్మ రాజ్య మందు గడపెను ఇట్లుండ ఒకనాఁడు ఆ రాసుతుఁడు అమాత్య సేనాసమూహముతో బాహ్యారామవాటీ విహారముఁ గావింప యమునానదియందు నోడనెక్కి చనుదెంచెను. అంతట దైవయోగముచే నయ్యది నీటియందు మునిఁగెను. కొందరు మునింగిరి. మరికొందరు దరికిఁ జేరుకొనిరి. మరికొందరి మృతకళేబరములు నీటిపై తేలెను.

యమునానదియందు చంద్రాంగదుఁడు మునింగెనని పిడుగుబోలిన వార్త వినినంతనే చిత్రవర్మ దారుణ శోక సంతప్తచిత్తుఁడై బంధుమిత్రామాత్య సహితంబుగ నదీతీరమున కరుదెంచి జలంబున నెచుకించి నిరాశను జెంది బహుదుఃఖకలితుఁడై "హా! రాజకుమారా! చతుసంభోధిపరీతమైన ఈ భూచక్రము నంతటిని యేకఛత్రాధిపతివై పాలింతువని తలఁచితిని. పూర్ణిమాసుధాంశుఁబోలు నీ నెమ్మోము నా కన్నులారఁ గాంచకున్న నేనెట్లు జీవింపఁగలను? ఈ రాజ్యమేల? ఈ ధనసంపదలేల? బేలయగు సీమంతినిని యెట్లోదార్తును. నీ తలిదం

త్రుల ముఖము నెట్లుజూతును? వారికి యేమని సమాధానముఁ బలుకుదును?" అని పరిపరివిధములఁ దలపోయుచు శోకవ్యాకుల మానసుండై యమ్మహీపాలుండు నితరవ్యాపారంబులు మాని విలపించుచుండెను. అంత పౌరజనులు ఆబాలవృద్ధంబుగా వచ్చి యన్నదీతటంబున హాహారవముఁ గావించుచు శోకింపుచుండిరి జనులెల్లరు గృహంబులను వీడి నదీతీరంబున కేగనందున గోవత్సరములకు పాలు లేక 'అంబా' యని యరచుచుండెను. ఏయింటి యందును వంటకంబుల నాచరింపనందున అగ్నిహోత్రుఁడు ఆకలిచే స్రుక్కుచుండెను. సంధ్యాస్నాన దేవార్చనాదులు లేనందున దేవతలు నిరుత్సాహులై గాంచుచుండిరి. ఆ దినంబున చిత్రవర్మ రాజ్యంబంతయు పాడుపడియుండెను. నెలతకు పరదేశమునుండి బతి బహుకాలమున కేగుదెంచినను సంతోషము లేదు. పుత్రజననమైనను పురుషునకు సంతోషము కలుగుట లేదు. ధనహీనునకు పెన్నిధానము లభించినను, సంతసించుట లేదు. ఇవ్విధముగ రాజనందనుని వియోగభరముచే సకలజనులు నపగతోత్సాహులై యుండిరి.

అంత నిషధపురమున యింద్రసేనమహీపాలుఁడు చారులవలన కర్ణశూలాయమానంబగు నిజతనయుని వృత్తాంతం బాకర్ణించి, యనేకవిధములఁ బ్రలాపించుచుండెను. నగరమునందలి సమస్తప్రజలును దద్వియోగదుఃఖమును సహింపఁజాలక మహాఘోరంబుగా బరిదేవనంబులు చేయువారును, శిరోజబంధనములు వీడ శిరస్నానంబులు చేయువారును, వక్షస్తాడనము చేసుకొనువారును, పరమేశ్వరుఁ డింత దయ తప్పవలయునే యనువారును, జాద్రప్రియదర్శచుండగు చంద్రాంగద కుమారుని ముఖావలోకనము లేని యిచ్చోట నుండవలయునే యనువారునునై నిద్రాహారసుఖంబుల ననుభవింపకయున్న నప్పురము చిత్రవర్మ పురంబునుఁ బోలె అత్యంత కోలాహల సమన్వితంబై యుండెను.

సుతారోగాభిసమన్వితుండై స్రుక్కి స్రుక్కి యడలుచున్న ఆ యింద్రసేనునిం దాయాదు లొక్కుమ్మడి యాతనినిం బాధించి, ఆ రాజ్యము నపహరించి ఆతనిని కారాగారబద్ధుని గావింపఁజేసిరి. అంత నక్కడ మహాశోకంబున గ్రుంగియున్న చిత్రవర్మమహీపాలుని నిశ్చల నైజ్ఞానికులైన వృద్ధజనులు ఆశ్వాసించి తత్త్వోక్తులను దెలియఁజెప్పి నెట్టకేలకు మహాధీరాత్మునిఁ జేసిరి. పిమ్మట నాతఁడు లేచి నిర్మల భావంబున ఆత్మమందిరమునఁ జేరవచ్చెను. అప్పుడా భూతలాధీశ్వరుండు తన జామాతకు ఊర్ధ్వ దైహిక కృత్యంబు లాచరించి పుత్రికకు తత్సమయకార్యముల నొనరింపఁజేసెను.

అనంతరము తండ్రి గృహమందు మునిపత్ని యాజ్ఞఁ గైకొని సీమంతిని రాహుగ్రస్తయైన పూర్ణిమచంద్రునిభాతి ధైర్యమును వహించి ముక్కంటి పూజలను కడు భక్తిశ్రద్ధలతో చేయుచు తన జీవితమును గడపుచుండెను. ఇట్లుండ మూడు సంవత్సరములు గడచెను.

## -౩-

### చంద్రాంగదుఁడు నాగలోకమునకు వెడలుట

కాళిందీ సలిలాంతరంగంబున మునింగినవాఁడై నిరంతర శివ మంత్రపారంగతుఁ డగుచు చంద్రాంగదుఁడు దైవయోగముచే జలవాసక్తలై నట్టి యపూర్వ లావణ్యరాసులగు నాగకన్యకలను గాంచెను. ముద్దులొలుకు మందహాసవదనుఁడును, మన్మథరూపవిలాసుఁడును, శ్రీ శివధ్యానపరుండును, శుభోజ్జ్వల గుణాకరుండును యగు రాజకుమారునిఁ గాంచి, ఆ కుంభీనస రాజకన్యకలు విస్మయమనస్కలై, ఫణిస్థాన మనోహరంబగు రసాతలలోకమునకు ఆతనినిఁ జేర్చిరి

అప్పుడా రాజకుమారుం డగు చంద్రాంగదుఁడు ఆ రసాతలమున మణిదీపకోటి సముజ్జ్వలితంబై, ఫణిఫణా రత్నవిభ్రాజితంబై, వజ్రముక్తాఫల వైఢూర్య రాజిత ప్రాసాద సాహస్రభాసురంబై, చంద్రకాంతోపలస్థలయుతంబై విరాజిల్లుచున్న మంజులంబైన యొక దివ్యమందిరంబున, రత్నాంచితంబైన సింహాసనమున ఆసీనుఁడై, పన్నగేంద్రులచే కొలువబడుచున్న తక్షకునిఁ గాంచెను.

మరియు నా పన్నగేంద్రుఁడు ఫణ సహస్ర సముజ్జ్వలుండును, దివ్యాంబరధరుండును, దివ్య రత్న కిరీట కుండల మండితుండును, నానామణిగణ ప్రభావిభాసుర విగ్రహుండును, సౌందర్య యౌవ్వన విలాసాతి శోభనుండును, దివ్యాంబర భూషితుండును, దివ్యచందన చర్చితుండును, కాలాగ్ని సంకాశ తేజుండును, అనేక పన్నగకుమార సేవ్యమానుండును, పన్నగేంద్ర కన్యకా సహస్ర పరివృతుండును, దుర్నిరీక్ష్యుండునునై శోభిల్లుచుండెను. ఆ రాజనందనుండు ఆ మహాశయుని దుస్సహ తేజంబును చూడఁజాలక నిమీలితలోచనుండై యుండి పిమ్మట ధైర్యం బవలంబించి సభాస్థలంబున ఆతనికి సాష్టాంగనమస్కారంబు గావించెను. అట్లు వందన మాచరించి కృతాంజలియై యున్న గంధర్వసుందర విగ్రహుండగు యా రాజకుమారునిఁజూచి తక్షకుఁడు తన మనంబున కొంత తడ వెద్దియో యోజించి, పిదప ఆ నాగకన్యకలను రాజకుమారునిఁ గూర్చియు, వాని నెట్లు తోడ్కొని వచ్చినదియు ప్రశ్నించెను. అప్పుడు నాగకన్యకలు తాము యమునయందు జలక్రీడ లాడుచుండ, యచ్చటి కేతెంచిన యా సుందరపురుషుని యిచ్చటకుఁ దెచ్చితిమనియు, గోత్రనామంబు లెరుంగమనియు విన్నవించిరి.

అప్పుడు తక్షకుఁడు రాజసుతునిఁగాంచి "ఆయుష్మంతుఁడా! నీవెవ్వఁడవు? నీ నామధేయంబెద్ది? నిన్ను గనిన యా పుణ్యాత్ముల నామం బెయ్యది?" అని ప్రశ్నించెను. అంత చంద్రాంగదుఁడు విన

యముతో భుజంగనాయకా! భూతలంబున నిషధపురమను ప్రసిద్ధి గాంచిన రాజధాని యొకటి గలదు. దానిని నలమహారాజున కగ్ర సుతుండైన యింద్రసేనుడు దయాహృదయుడై ప్రజలను అనురాగ ముతో పాలించుచుండెను. ఆ మహీనాథునకు నేను కుమారుడను. చంద్రాంగదుడనువాడను. నాకు యమునానదిపై విహారిని సలుప నొకనాడు కోరిక జనించెను. అంతట నిజపరివార సహితుండనై ఒక యోడను యెక్కి వెళ్ళుచుండగా నత్యుది దైవయోగముంజేసి నీట మునింగెను. నన్ను యీ యంగనామణులు గాంచి యిచ్చటకుం దోడ్కొనివచ్చిరి. ఓ మహానుభావా! నేను పూర్వమున యెట్టి పుణ్య ముల నాచరించితినో, లేక యెట్టి దానధర్మ సద్గురుసేవ చేసియుంటినో యక్కారణముచే నాకీ జన్మంబున భవదీయ దర్శన మబ్బి నేత్రానంద పరవశత్వమును జెందుచుంటిని. మరియు యేను భవదీయ దర్శన మాత్రమున గుణగణాధిక్యుడనై, ధన్యుడనై నిక్కముగ కృతార్థుడ నైతిని. నా పూర్వు లెల్లరు వారొనర్చిన పుణ్యావశమున కైవల్య ప్రాప్తిని జెందియుండిరి. అట్లుగనే నేను భవదీయ కృపాదర్శనములచే అట్టి భాగ్యమును బడయనుంటిని. మహాత్మా! నీవు మహానుభావుం డవు. నిఖిల సురాసుర గంధర్వ చారణ ప్రస్తవ్యమానుండవు. శరణా గతరక్షకుండవు. గావున భవన్మహామహిమంబు లెరింగి వర్ణింప నా తరముగాదు. నన్ను గటాక్షించు రక్షింప బహువిధంబుల సన్నుతింపుచు వినయ వినమిత శిరస్కుండనై ముకుళీకృత కరమండలుండనై నిన్ను వేడుచుంటిని” అని పలికినంతనే ఫణిరాజు సంతసించి “రాజకుమారా! నీ కిచ్చట యెట్టిభయమును లేదు. నీవు నిక్కముగ ధన్యుండవు. ఈ ముప్పదికోట్ల దేవతలలో యే దేవుని నీవు మానసిక వాచిక కాయిక శుద్ధిం గలిగి బూజచేయుదువు? ధీరుడవై వచియింపదగును” అని హృదయపూర్వకమగు ప్రేమతో ప్రశ్నించెను. అంతట చంద్రాం-

గదుఁడు హర్షవదనముతో "ఓ విమలతేజా! ఈ విశ్వమున కధిపతియై యెవఁడు ఆదిదేవుఁడై సురవరులకు మహాదేవుఁడని బరగుచుండెనో, యెవ్వని రాజసంబుచే యీ జగం బంతయు సృష్టింపఁబడెనో, యెవ్వని సాత్వికంబుచేతనే బ్రహ్మ సృష్టికి కర్తయు శ్రీ రమేశుఁడు పోషకుఁ డయ్యెనో, యెవనికి భూమి, నీరు, వాయువు, ఆకాశము, నక్షత్రములు, వెన్నెల అగ్ని అష్టమూర్తులుగ నయ్యెనో, యే మహాత్ముఁడు సూర్యచంద్రులను రెండు నేత్రములుగ ధరియించియుండెనో, యెవని రూపంబులు అన్నివేళలయందును వేదాంతమృగ్యమై వెలయుచుండునో, యెవని నామము అనుదినము ప్రదోషకాలమునఁ జపియించిన తాపత్రయములెల్ల తొలఁగిపోవునో, యే మహాదేవుని శిరముపై యెల్లప్పుడును సురనది పుష్పదామాకృతితో బొసగుచుండునో, యే భగవానుని ప్రియసఖి యీ జగత్రయమునకు జగదంబయని ప్రసిద్ధిగాంచి యుండెనో, యే భక్తజనమందారునకు వాసుకీతక్షకులు భూషణములై యలరారుచుండురో, యే కళ్యాణదాయకుఁడు వేదాంతవేద్యుఁడై యలరారుచుండెనో, యే దేవుని పాదపద్మములు నిగమాంతచూడామణీస్ఫూర్తితో సొంపుమీర మెరయుచుండెనో, యే గిరీశునిమూర్తి యోగీంద్రుల దివ్యసభలలో నెల్లప్పుడును ప్రఖ్యాతిని గాంచుచుండెనో, యే మహేశ్వరుని దివ్యసామర్థ్య మహిమలు సర్వేశ్వరత్వంబును సంఘటింపఁజేయుచుండెనో, యే పురుషశ్రేష్ఠుఁడు యేకరూపంబుతో జగదంతరాత్ముఁడై సంచరించుచుండెనో అట్టి మృత్యుంజయుఁడు, ఆదిమధ్యాంతరహితుఁడు, పశుపతి, విశ్వనాథుఁడు పూజార్హుఁడు. మరియు నా పరమశివుని యే ననుదినము గొలుచుచుందును" అని పరవశత్వమును బొంది నుడివెను.

ఇవ్విధమున బలికిన చంద్రాంగదుని భాషణంబు లాకర్ణించి ప్రమోదమానసుండై మహాదేవభక్తితత్పరుండగు తక్షకుఁడు రాజ

నందసునితో "ఓ పుణ్యాత్ముఁడా! నీవు జలజభవాదులకైనను దెలియని యపూర్ధంబును మా కొసంగించితివి. నీవలె దైవతత్వమును గ్రహించినవారు బహు స్వల్పము ఇయ్యది పాతాళలోకము. దుర్జరామరణ రాహిత్యంబైనది దేవాసుర ప్రదరాభేద్యమైనది. ఇందు విశ్వకర్మ నిర్మితంబులగు ప్రాసాదంబు లెన్నియో గలవు. మఱియు నిచ్చటి దీర్ఘికాజలము లెప్పుడు దివ్యసుధారసమువలె యుండును. ఇచ్చటి నాగకన్యకలు మహాసౌందర్యవతులు గనుక నీ విచ్చటనేయుండి సౌఖ్యప్రదముగ కాలమును గడపుము" అని పలికినంతనే రాజసుతుఁడు తక్షకునితో "ఫణీంద్రా! నన్ను క్షమించి నా విన్నప మాలింపుము నా తలిదండ్రులకు నే నొక్కఁడనే సుతుండను. వారు నాకై శోకప్రాప్తిని జెంది మిగులను గుందుచుందురు. మఱియు నా వియోగభరముచే సంక్షోభించు సుదీను ప్రియపత్ని మనమునకు ప్రియముఁ గావింప నా మది వేగిరపడుచుండెను. అదియునుఁగాక హృదయమునందు జింత బొందుచున్న నా హితులు, సత్తములు, బంధుకోటియు నన్నుఁ జూచినంతనే శోకముడిగి సంతోషసాగరమున నోలలాడుదురు. మఱియు నా తలిదండ్రులు నేను మృతిజెందితినని దలఁచి దుఃఖవారాసిలో మునింగి జీవములను బాసిరో లేక కష్టములంజియుండిరో యని నా మనస్సు పరిపరివిధముల తల్లడిల్లుచుండెను; గాన బహుదినంబు లిచ్చటనుండుట నాకు ధర్మంబు కాదు. నేను మర్త్యలోకమునకుఁ బోవున ట్లనుగ్రహింపవలయును" అని ప్రార్థింప తక్షకుఁడు కరుణా కటాక్ష వీక్షణంబుల నాతనిని యాదరించి దివ్యమణిభూషణాదులచేతనున్నూ, దివ్యాంబర దామ గంధతిలకాదులచేతనున్నూ, చంద్రాంగదుని పూజించి కామయానమునకు ఒక తురగమును, చంద్రహాసమును, దూణీయుగంబు నొసఁగి పిమ్మట నిరుపమరత్న భూషణ మణి ప్రకరాంబర వహనార్థము ఒక రక్కసుఁతోడిచ్చి, రాజకుమారుఁడు

మనంబునందు తలచినమాత్రమున దాను దప్పక వచ్చి ప్రత్యక్షమగు దునని వరమునిచ్చి, ప్రతివీరమహాబల సామజాధిరాణ్మండల కేసరి యగు నిజకుమారుని కామగంబైన హయంబుపై భూమండలి కేగు నృపకుమారునకు సహాయమిచ్చెను ఇట్లు వీడ్కొల్పిన ఆ మువ్వురును, తక్షకునకు ప్రదక్షిణ నమస్కారంబు లాచరించి, యమ్మహాత్ముని యనుజ్ఞ బడసి యా క్షణమునందే భూలోకమును జేరగలిగిరి.

# 4

## చంద్రాంగద సీమంతినీ సంగమము

అట్లు కామగహయారూఢులై మానవఫణి సుతదానవు లరుదెంచి, కాళిందీతీరంబున కరుదెంచునప్పటికి సఖీజన సమేతయై సత్క్రియాశీలం బొప్పునట్లు సాధ్వియగు సీమంతిని యచ్చటికి విచ్చేసెను. అంత సీమంతిని రతీనాథునిమాడ్కి నిరుపమాన మోహనాకారుండై నరరూపములను దాల్చిన పన్నగదానవులం గూడి విహరించుచు, దివ్యాంభరణ దీప్తదేహంబు గలిగి మొలకల నవ్వుమోముం గలిగి సుమమాలికా గంధ ఘుమఘుమామోదంబు దశదిగంతంబుల గొనంగుచు, విలసదపూర్వాకృతివిలాస మొనంగుచున్న రాజపుత్రుని విస్మయ చిత్తముతోడను, సద్వికాసముతోడను, జూచుచుండెను. ఆ రాజ చంద్రుండు గతసూత్రరహితయు, వ్యక్తాంజనానేత్రి, శృంగారవిరహిత దేహి, ఆభరణావిరహిత, దీర్ఘదుఃఖిత, సదాచారసంపన్నయు నగు నా సాధ్వీరత్నమును జూచెను

చంద్రాంగదుం డామెను దృష్టిపూర్వకముగ నిశ్చయముం జేసుకొని హయమును డిగ్గి, యా లతాంగినిం బిలచి, యామెను యిసుక తిన్నెపై కూర్చుండ నియమించి యింపుమీర "వనితా! నీ వెవ్వరి

కుమారీరత్నమవు? నీ నామధేయ మెద్ది? నీ వెవ్వనిధర్మపత్నివి? నీ వేమిటికై యీ చిరుతప్రాయంబున ఘనశోకమునకు లోనైతివి? యదార్థమును దెలియఁబలుకుము" అని సస్నేహంబుగా నా రాజనందనుఁడు బలికిన, రాజనందని యశ్రుకీలిత నిజలోచనయై లజ్జితవదనయై, వచనరహితయై శిరము వంచి యిన్నకుండెను.

అంత నొక వయస్య యా రాజనందనుని గాంచి గౌరవమున తేటతెల్లముగ సుధామధురవచనములతో యా వధూటి చరిత్ర మాద్యంతము దెలియఁబలికెను. "మహాత్మా! ఈ మానినియొక్క జనకుఁడు లోకప్రసిద్ధుఁడగు చిత్రవర్మ మహీపాలుఁడు. ఈమె సీమంతిని యని బరఁగుచుండెను. ఈయమ నిషధపురాధీశుని తనయుఁడగు చంద్రాంగదుని సతీరత్నము. ఈ వధూమణియొక్క భర్త దైవయోగంబున యమునాజలనిమగ్నుఁ డయ్యెను. పిమ్మట యాతని తలిదండ్రులను వారి దాయాదులు చెరయందు బెట్టి రాజ్యము నపహరించిరి. ఇక్కారణముచే నీ యింతి యధిక శోకతప్తయై యుండ మూఁడు సంవత్సరములు గడచెను. ఈమె యిప్పుడు సోమవారంబులందు దృఢవ్రతయై పార్వతీ పరమేశ్వరులను పూజించుచుండెను. కావున అభిషేకార్థమై ఇప్పు డిచటి కరుదెంచితిమి" అని దెలిపిన సీమంతిని "ఆర్యా! నవమదనాకారుండవగు నీవు గంధర్వుఁడవో, మనుజుడవో నాకుఁ దెలియదయ్యెను. హృదయపూర్వకమగు ప్రేమతో నా వృత్తాంతమునెల్ల ఆరయుచున్న నీవు లోకోత్తరస్నేహముఁగ నన్నెన్నఁడైన గాంచియుంటివా? నీవంటి బుధులు మృషావాక్యము లెన్నఁడు బలుకరు గనుక కరుణించి యువ్వార్త నా కెరిఁగింపఁగోరుచుంటిని. నీ చెంతనున్న యీ పుణ్యపురుషు లెవ్వరు?" అని యిట్విధంబున యా రాజపుత్రిక యన్నరేంద్రనందనునితో సల్లాపంబు లొనరించుచు బాష్పపూరితలోచనయు, గద్గదకంఠయు, మోహమూర్ఛాపరవశయునై ధరణీతలముపైఁ

బడెను. అట్లు బడియున్న నిజకళత్రమును వీక్షించి చంద్రాంగదుడు శోకాకులితమానసుండై మౌనమున ముహూర్తకాలంబట్లుండి పిమ్మట అమృతోపమానంబులగు భాషణంబుల నయ్యింతిని నూరడించి, ఆమె కరమును బట్టుకొని "మేము సిద్ధులము. నీ భర్త యొకప్పుడు నాకు ప్రియమిత్రుఁడై యుండెను. అతఁడు సురక్షితముగ నొకయెడ నున్నవాఁడు. రెండు మూఁడు దినములలో నింటు రాఁగలఁడు. నీవు నాతండును గలసి సకల సామ్రాజ్యభోగంబు లనుభవింపఁగలరు. శ్రీ భక్తవశంకరుని పాదమాన చెప్పుచుండిన నా మాటను నమ్మి శోకంబును మాని యుండుము" అని చెప్పినంతనే యాతని మృదువచనములకు నూరడిల్లి విస్మయంబు దీపింప భయసంభ్రమముల నా రాజనందనుని జూచుచు మనంబున "ఈతనినిఁ జూడ నా భర్తయని దోఁచుచున్నది. లేనియెడల నా ప్రేమ యన్యులపై ప్రసరించునా? ఈతని రూపంబును గాంచిన యక్షుఁడో, గంధర్వుఁడో అయి యుండునట్లు తోఁచుచున్నది. లేనిచో శమనాగారము జేరియున్న నా పతి యీతఁడై సాక్షాత్కరించునా? కానిచో ఇయ్యది మోహస్వప్నభ్రమయా? లేకయున్న నే నొనరించు గౌరీపూజావిశేషమున నా భర్తయై యుండునేమో? ఈ భావిసూచనముల ఫలానుసరమునుబట్టి, పక్షిగౌళి సుగుణములనుబట్టి, వామభుజలోచనము లదురుటను, ఆకారవయోవిలాసములను, సుగుణసద్గోష్ఠుల ననుసరించియుఁ జూడ నీతఁడు నా భర్త వలెఁ గానుపించుచుండెను. మహాత్మురాలైన మైత్రేయి యొటువంటి యాపదలు వచ్చినను శివపూజ మాత్రము దృఢభక్తితో యొనర్పుమని బోధించి వాత్సల్యముతో సోమవారవ్రతము నుపదేశించెను. అట్లు విడువక మహేశ్వరవ్రతము నాచరించుచుంటిని. గనుక సన్మాంగల్యసిద్ధిఁ గలుగ నాకు యుమామహేశ్వరులు కృపచేసియుండిరో! లేనిచో పదివేల వత్సరములు సౌఖ్యసంపదలతో విరాజిల్లుదువని పలికిన విద్వాంసుల

నా కాయ్యస్సుతకులు నిక్కమయ్యెనో! ఈశ్వరునికి దక్క అన్యుల కగో చరములుకదా?" అని తర్కించుచు డోలాయమానసమైయున్న సీమం తిని యొక్క కరమును రాజనందనునకు మరల స్వీకరించి కరగ్రహణ మాత్రమున పులకీకృతాంగియై గళదశ్రుసమ్మిశ్రితాపాంగియై లజ్జావద నయై యున్న యా శుభాంగి కర్ణదేశంబు నగ్గించి రహస్యముగ "కళ్యాణీ! నీవు విషాదమును జెందవలదు. నీ వల్లభుని గూడి సుఖం బుగ నుండగలవు. నేను నాని జననీ జనకులకు యాతని కుశలవార్త నెఱింగింపఁ బోయెదను" అని బలికి ప్రస్మర తురంగారూఢుండై తన సహాయులం గూడి తత్క్షణంబున నిజపురోప కంఠవనమునకు వచ్చి యచ్చట నిలిచి, తక్షకసుతుండైన యశ్వసేనుని బిలచి తన దాయా దులను తా నడుదెంచుటను యెఱింగింపఁ బుత్తెంచెను.

అశ్వసేనుఁడు సభయందు ఆశీనులై యున్న యింద్రసేనుని దాయాదులఁ గని "ఓ యోధులారా! ఇంద్రసేనమహారాజు కుమారుం డగు చంద్రాంగదుఁడు మున్ను యమునానదీజలనిమగ్నుఁడై దైవవశ మున నాగలోకమునకు వెడలి నాగేంద్రుఁ డగు తక్షకునిచే మన్నింపఁ బడి పెక్కు వరములను బడసి భూలోకమున కరుదెంచి భాసుర శౌర్య ధైర్యములతో మీ పురసమీపమునందలి యుపవనంబునందు నిలిచియున్నవాఁడు. భానుతేజుండగు నింద్రసేనమహారాజును బాధ విముక్తినిఁ జేసి సింహాసనమును విడిచి మీరు క్షమార్పణమును వేడ వలయును. అట్లు చేయరేని యా నృపాలతనూభవుఁ డరుదెంచి తక్ష కాహీంద్రదత్త దుర్దమకృపాణధారములతో మీ శిరములను ధరణిఁ గూల్చి నిజరాజ్యము పాలింపఁగలఁడు. నేను తక్షకుని కుమారుఁడను. అశ్వసేనుఁ డనువాఁడను. చంద్రాంగదుని ప్రియమిత్రుండను. ఆతనికి సహాయ్యముగ భూలోకమున కరుదెంచితిని" అని నుడివెను.

అప్పుడు వా రెల్లరు భయాక్రాంతులై చేయునది లేక చంద్రాంగదుని యాజ్ఞను శిరసా వహించి సత్వరము ఇంద్రసేనుని విడుదల గావించి, పుత్రాగమము నాతని కెరింగించి క్షమార్పణను వేడిరి. పిమ్మట ఆప్తజన అమాత్య పురోహిత భృత్యసంఘములతో, శుభోజ్జ్వల తూర్యరవంబులు మ్రోయ పురద్వారమునకు విచ్చేసి రాజసుతునకు స్వాగతమిచ్చి మహోన్నతిని గృహప్రవేశము గావింపఁజేసిరి. రాజదంపతులు తమ కుమారుని గాంచి పేదకు పెన్నిధి దొరకినభంగి ఉప్పొంగి యాతనిని కౌగిలించుకొని ఆనందబాష్పములను విడచిరి. నష్టపోయిన నిక్షేపము తిరిగి లభించినట్లు అష్టైశ్వర్య దురంధరుఁడై వచ్చిన కుమారుని బొందిన తలిదండ్రు లెంత యదృష్టవంతులో యని జనులు హర్షించిరి. నిషధపురమునందలి జనులెల్లరు దుర్గద్వారముకడ కేగి పౌరప్రియుఁడగు చంద్రాంగదుని దర్శనమును బడసి ఆనందమును బొందిరి. పరనృపతులెల్లరు గరుత్మంతునిజూచిన మహామహులఁ బలెను, గ్రహరాజుపజ్జ గ్రహములవలెను చంద్రాంగదునివద్ద మెలఁగఁజొచ్చిరి.

అనంతరము పరమేశ్వరుని కృపాకటాక్షమున పుత్రుని పునః ప్రాప్తిని బొందిన యింద్రసేనుఁడు పరమాహ్లాదమున రుద్రాభిషేకములును, సమస్తదేవతామహోత్సవములును, అఖండదీపారాధనములను, శైవభక్తసమారాధనములను, అపరిమిత సువర్ణదానములును గావించి నిజకుమార బంధుజనసమేతంబుగా మృష్టాన్నపానంబులఁ బరితృప్తిఁ బొంది యిష్టాలాపములఁ బ్రొద్దుఁ గడపుచు సుఖగోష్ఠియం దుండిరి.

మరునాఁ డరుణోదయమున యింద్రసేనమహారాజు కొలువును దీర్చి రాజకుమారుఁడగు చంద్రాంగదుఁడు కాళిందీ సలిలాంతరాళమున నాగస్థానముఁ జేరి రత్నాలంకార చయంబుతో ఫణిరాజగు తక్షకునిచే గౌరవింపఁబడి, తిరిగి పురమును బ్రవేశించెనని చిత్రవర్మమహీపాలుని వద్దకు లేఖార్థసంవాహులను బనిచెను.

చంద్రాంగదుఁడు సజీవుఁడై యుండి నిజరాజ్యమున కరుదెంచె నని వినినంతనే చిత్రవర్మ ఆశ్చర్యమునుబొంది సంతతచింతావిచారంబులను మాని సకలబాంధవ మిత్రసహితంబుగను, పౌరజనసహితంబుగను, సంతోషసాగరమగ్నుఁడై సొంపుదీపించునట్లు పురమందు చాటింపఁజేసెను. లేఖార్థవాహకునికి మృష్టాన్నరాజితభరణాంబరము లొసంగి, ప్రీతిగావించెను. పిమ్మట నిజపుత్రికయగు సీమంతినినిరావించి కృపతో నామెను పూర్వమువలె నవరత్నభూషణములతో మేనును శృంగార మొనరించి హర్షాంబుధిఁ నోలలాడుచుండెను. ఆ సమయంబున సీమంతిని తాను యమునానదీస్నాన మొనర్పఁబోవునప్పుడు ఆశ్వాసయాథుఁడై వచ్చి స్నేహభావమున తన కరమునుబట్టి హితవాక్యములను బలికి వెడలిన మహాసౌందర్యమూర్తియే తన భర్త యని గ్రహించి యానందించి అయ్యది శాంకరీవ్రతి మహాత్మ్యంబని నిశ్చయించుకొనెను. చిత్రవర్మయు శంకర శాంకరీవ్రత మహాత్మ్యమువలన శుభము చేకూరె నని దృఢవిశ్వాసమున ఉత్సవములను సలుపుటకై తగువారిని బంచి, తనకు అల్లుని జూచు వాంఛ యుండుటవలన యాతనిఁ దోడ్కొని వచ్చుటకై మంత్రివర్గమును నిషధాపురికిఁ బంపెను.

వారు సత్వరము నిషధానగరమున కరుదెంచి యింద్రసేనమహీవల్లభుని గాంచి పరమానంద కందళిత హృదయారవిందులై "నిషధ ప్రభూ! చిత్రవర్మమహీపాలుఁడు తన జామాతను జూడ చిత్తము నందు భ్రమగలవాఁడై యా రాసుతుని దోడ్కొనివచ్చుటకై దేవేంద్ర విభవులగు దేవరవద్దకు బుత్తెంచెను. మరియు చంద్రునకు వెన్నెల పులుగులు, సూర్యోదయమునకు కోకములువలె రాసుతుని రాకకై యెల్లరు నిరీక్షించుచుండిరి. గనుక దయయుంచి చంద్రాంగదుని సత్వరము బనుపవేడుచుంటిమి" అని విన్నవించిరి. అంతట చంద్రాంగదుఁడు నిజజనకుని యనుజ్ఞఁబడసి తలిదండ్రులకు బ్రణామంబులు

గావించి విద్వద్దాశీర్వాదములు భేరీభాంకారవంబులు చెలంగ, తత్సా హీంద్రదత్తంబైన యశ్వరత్నంబు నెక్కి, తత్కుమారుండైన యశ్వ సేనుఁడు వెంట రాగా సేనాసమేతుండై బహువిధజనపద ఘనారణ్యా ద్యావళి నదీనదంబులు గడచి, కతిపయదినములకు చిత్రవర్మ రాజధానిం జేరవచ్చెను.

ఆ భేరికారవము నాకర్ణించి పౌరులెల్లరు సంతోషభరితులై యెదురేగి రాజపుత్రునకు అభివాదంబు లొనర్చి వందనాశ్లేషణ స్వస్తిభాషణంబులు గడు మైత్రితో జెప్పఁదొడంగిరి. అప్పురవనిత పుణ్యాంగనలు నవరత్న నీరాజనంబు లొసంగుచు, సౌధభాగంబులం దుండి పుష్పవర్షమును గురిపించుచు రాజకుమారునకు మంగళప్రద ముగ స్వాగతము నిచ్చిరి.

ప్రౌఢోక్తులలో నాగేంద్రుఁడును, శత్రురాజుల నెడు మదగజ ములను సంహరించుటలో సింహమువంటివాఁడును, అంధకాసురసంహార కారియైన ఆదిదేవుని పూజలలో ప్రత్యేక ప్రజ్ఞావంతుఁడు నగు చంద్రాంగదుఁడు భవ్యమైన మహేంద్రవైభవముతో సభాస్థలికి విచ్చేసి, చిత్రవర్మను గాఢాలింగనము చేసుకొనెను. పిమ్మట వినమిత శిరస్కుండై యాతని పాదములకు నమస్కరించి ఆనందాశ్రుజలంబును విడచెను. తదనంతరము అత్తలకు బాంధవులకు గురుజనహితులకు మ్రొక్కి వారి యాశీర్వాదములను బొందెను.

## 5

### సీమంతినీ పునర్వివాహ ఘట్టము

సుహృద్బంధుప్రజలు మెచ్చునట్లు తన కుమార్తెకు పునర్వివా హముఁ జేయఁదలఁచి చిత్రవర్మభూపాలుఁడు భూజనసన్మాన్యులను,

విద్వాంసులను, రాజశ్రేష్ఠులను, బంధుజనులను రావించి, శాస్త్ర నిర్దిష్టక్రియల నన్నియు విశ్చయించి పురసౌధాలంకారములను జేయు తగు యేర్పాటులను గావించెను.

పుణ్యాంగనలు రాజకుమారుని రత్నమయాసనంబున గూర్చుండ నియమించి లలితోక్తులతో సేసలు జల్లి సహాోల్లాసమున భద్రగీతిక లను బాడిరి. అంతట శరత్సమయ రాకాచంద్రబింబంబును బోలు ముఖాబ్జము వెలయ, ప్రభాత వేళా వికాసిత సరోజాత సామ్యముగ నెలయుచున్న లోచనయుగళలలర, అర్క ప్రకాశమానంబగు మేని కాంతితో, నిశీథమునందలి తారకలు మాడ్కి వేణీఖచిత పుష్పవితతులమర, విశ్వకర్మ నిర్మిత వివిధరత్న చిత్రిత సజీవ సాలభంజిక యనునట్లు నిర్మలాంగి యగు సీమంతిని క్రొక్కారు మెఱుగు తెరంగున యరుదెంచి జీవితేశ్వరుని వజ్జ ఆసీన యయ్యెను. శృంగార శేఖరులగునట్టియు, మాంగల్య ధురీణు లగునట్టియు, యా పుణ్యదంపతులకు కామినీజనులు మంగళహారతుల నొసంగిరి.

పిమ్మట బ్రాభవధుర్యులగు యా భోగయౌవనలకు వనితా రత్నములు శోభనములు పాడుచు సురభిళిత తైలముతో గల లంటి కంకణ రాజత్కారులగు యా శంకరభక్తులకు సుంకులు జల్లి పన్నగ జాతీ రస సంపన్నముతో దలలను బులిమి మందోష్ణంబగు పన్నీటను వారిని జలక మాడించిరి. పిదప యా శుభచరితులను ధౌతవస్త్రములతో దడి యార్చి ధరించుటకు కనకాంబరముల నిచ్చి, చంద్రబింబమువంటి లలిత మైన వారి ఫాలఫలకంబునకు తిలకములను దీర్చి, మేనునకు సుగంధ మును బూసి, పుష్పదామములు పొలుపుమీర అలంకారంబులుగ వైచి మణికుండల కంకణాది భూషణంబులను దొడిగి, నీపితి బుగ జెక్కిట దృష్టిచుక్క దిద్ది కామినీమణులు వారిని వివిధరీతిని శృంగారించిరి.

ఇవ్విధంబుగ నవ్వధూవరు లత్యంత శృంగారాభిరాములై యా క్షణమున భేరీమృదంగాది తూర్యరవంబులును, పుణ్యాహఘోషణంబులును, పుణ్యాంగనాసహస్ర మధురగీత నిస్వనంబులును, వందిమాగధ స్తవనాదములును జెలంగ, కళ్యాణవేదికాతలంబున సువర్ణ భద్రపీఠంబున యాసీనులై యున్న సమయంబున అత్యంతప్రియు గర్వ పర్వత సుపర్వాధీశురుండైన రాజ్యశ్రేష్ఠుండగు చిత్రవర్మ విహితాచారంబు దీపించునట్లు నైషధునకు కళ్యాణలగ్నంబునందు కన్యాదానం బొసంగెను. పిమ్మట జాంబూనదాంబరములను, కంబళములను, భూషణములను, గాశేయకములను, తాంబూలములను మోదముతో విద్వాంసుల కొసంగి గౌరవించెను. కలమాన్నంబులును, గోఘృతంబులును, పచ్చళ్ళును, పదంశకాళి మధురాపూపంబులును, పెరుగు మొదలుగా గల పదార్థములతో సంతుష్టిగా బంధుసముదాయముతో అపుణ్యదంపతులు భోజనము గావించిరి.

భోజనానంతరమున తాంబూలసురభిత గంధమాల్యాద్యలంకార కలితుండగుచు, మిత్ర బాంధవ భృత్య సమేతముగ రాజసుతుండు సల్లాపంబులు గావించి, పిమ్మట బహిరాసము లొప్పునట్లు వరాన్విత వసంతంబు లాడెను. రూపస్తుత్యుండును, ధర్మరక్షణ విచారుండైన చంద్రాంగద క్ష్మాపాలుండు నిజాంగనామణికి తాను ఫణిరాజువలన బొందిన భూషామణిని లేపప్రసూనాదికంబుగ నొసంగి యామెకు ప్రియమొనర్చెను. వాటినెల్ల ధరించి సీమంతిని మణిభూషణ హారిదంత ఘుమంఘుమిత గంధదామాన్వితయై యెంతయు తేజంబున సర్వమంగళ పగిది విలసిల్లెను.

అనంతరము శరజన్మప్రతిమ ప్రతాపనిధియగు చంద్రాంగదుండు భాస్వర జాంబూనద చంద్రకాంతామణిమయంబై, కస్తూరీలిప్తంబై భాస్కర తేజోమణిదీప్తంబైన శయనాగారమును జేరి, తల్పనిరుప్రసూన

ఫలగంధ శుభాక్షతసంయుతంబై సంకల్పభవప్రతాపజనకంబై, లాలిత మగు హంసతూలికాతల్పంబునందు శితికంఠపదాంబుజ భక్తియుక్తుండై విశ్రమించెను. అంతట రతిసమాకృతి వెలయుచుండ, భవానీపదయుగ చింతామృతపాన పరవశీకృతయై, విమలస్వాంతముతో సీమంతిని చను దెంచెను. చంద్రాంగదుండును ఆ శుకవాణిని జూచి కౌగిటఁజేర్చి మిక్కిలి కూర్మితో జెక్కిలినొక్కుచు, మచ్చికల్దనరార దీయుని మాటలాడుచు, ప్రేమతో మన్మథకేళికిఁ దనివితీర పైకొనెను మరియు యా రాజ కుమారుఁడు పరిరంభణ చుంబన బంధనంబులందును, రాజితమైన దంత క్షత నఖక్షత ముఖ్య విమర్శనంబులందును, రాజమరాళయానయై మధురాధర నీరద నీలవేణియు నగు యా రాజతనూజను గూడి రాజ వినోదంబును బొందెను. ఇట్లు ఆ దంపతులు అన్యోన్య ప్రేమాతిశయం బుల గొంతప్రొద్దు సురతాభోగముల దృప్తిఁబొంది తత్పారవశ్యమున సుఖనిద్రను జెంది ప్రభాతకాలమున మేల్కాంచి గౌరీశ్వరధ్యానపరా యణులై మంగళస్నానాది కృత్యములు శివపూజావిధానంబు లాదిగా గల కార్యకరణీయంబులు నిర్వర్తించి, పిమ్మట మధురాహారముల సం తుష్టిని జెందియుండిరి.

అంత కొన్ని దినములకు చంద్రాంగదుఁడు నిజకళత్రసమేతంబుగా నిజపురి యగు నిమధకుఁ బో సమకట్టెను. అప్పు డల్లుని యభిప్రాయం బెఱింగి చిత్రవర్మ యాతనికి దశసహస్రాశ్వగజరథప్రకరాంబులను యర ణముగ నిచ్చి కుమార్తెను బిలచి ఆనందబాష్పములను విడచి, మన్నించి యమూల్య వస్త్ర మణిభూషణముల నిచ్చెను మరియు కరుణతో వివిధ గంధమాల్య మృగీమద కుంకుమాంజనార్ద్రిసాంకవములు, సహస్రదాస దాసీజనంబులు గ్రామశతంబులు నొసంగెను.

తండ్రి యాజ్ఞచే చంద్రాంగదుని వెంట వచ్చి మిత్రభావముతో మెలంగి, యాతని కనేక సహాయములొనరించి మెప్పు వడసిన యశ్వ

సేనుఁడు ప్రియమిత్రుని యనుజ్ఞఁ బడసి దానవునితో పాతాళంబున కరిగెను.

అనంతరము చిత్రవర్మమహీపాలునిచే అనుజ్ఞాతుండై నిజకళత్ర మగు సీమంతినినిఁ దోడ్కొని చంద్రాంగదుఁడు విశేష సేనాపరివృతుండై కతిపయదినంబులకు నిజనగరమునకు వచ్చి, దూర్యరవములు చెలంగ శుభముహూర్తమున శుద్ధాంతప్రవేశము గావించి, నిజసతీసమేతుండై జననీజనకులకు, బంధుజనులకు ప్రణామంబు లాచరించి, వారల యాశీర్వాదములు గైకొని పరమానందమున సుఖంబుగ నుండెను.

ఇట్లు ఆత్మవల్లభుని గూడి సీమంతిని స్నానజపపానములందును, భోజన శయనములందును కాలమును మహా వైభవముతో వెడలి బుచ్చుచుండెను. మరియు సోమవారవ్రతముల నాచరించి పార్వతీపరమేశ్వరుల సంతృప్తిఁబరచి తాను పొందిన సుకృతములను మగువక పూర్వమువలెనే భక్తిశ్రద్ధలతో నారాధించుచుండెను. అంత కొంతకాలమునకు ఇంద్రసేన మహీనాథుఁడు నిజ రాజ్యభోగసుఖము లందు విరక్తుండై తదనంతరమున నిజకుమారుండైన చంద్రాంగదునకు పట్టాభిషేక మొనర్చి సకల సామ్రాజ్యభార దురంధరునిగా నియమించి భార్యాసమేతుండై వనమునకుఁ జని యచ్చట వానప్రస్థాశ్రమమున మహాఘోరతపం బాచరించి, దేహమును విడచి భార్యాసమేతముగా దివ్యవిమానారూఢుండై శివలోకమున శివసాయుజ్యమునం దుండెను.

## 6

### సుమేధ సోమవంతులు

విదర్భరాజ్యమునందలి అగ్రహారమునందు సుమేధ సోమవంతులను బ్రహ్మచారులగు బ్రాహ్మణయువకులు స్నేహభావములో మె

లంగు చుండిరి. వారు సకల పురాణేతిహాస శాస్త్రాగమములను ప్రకట ముగ నభ్యసించి, ఆ యగ్రహారమునందలి విద్వచ్ఛ్రేష్ఠుల మెప్పును బడసిరి మఱియును వారు తుల్యప్రాయులై, సూక్ష్మమేధావిభ్రాజితులై, కృతోపనయనోద్వృత్తసర్వశాస్త్రాగులై, శైవోపచారకళాధురంధరులై, చంద్రార్క సంకాశులై, విద్యాధికులై మెలంగుచుండిరి. ఇవ్విధంబున బెరుగుచు సమస్తవిద్యాప్రవీణులును, వివాహ సమయోచిత తారుణ్య ధురీణులును నైన కుమారులను కనుంగొని తజ్జనకులు "పుత్రకులారా! మీరు పరిపూర్ణవయస్కులు గాన యీ యగ్రహారమును వీడి వివిధ రాజన్యులవద్దకుఁ జని మీయొక్క విద్యాకుశలతను వారి యాస్థానము లందు వెల్లడిబరచి, అందలి యాస్థాన పండితవర్యులను తర్కమునం దెదుర్కొని, వారిని పరాజితుల గావించిన నృపులు మెచ్చి మిమ్ములను ధనధాన్యముల, నగ్రహారముల, భూషణముల నిచ్చి సత్కరింతురు. మేము శైశవమాదిగ సర్వసంస్కృతులును వ్రతముల నొనరించి కీర్తిఁ బడసితిమి. ఇప్పుడు మేము వృద్ధులమైనందున దేశసంచారమును గా వింప అశక్తులము. మీరలిప్పుడు పదియేడేండ్ల కుమారులు. విద్యాధి కులు మీరు యాచనకు జనుట కిదియే మంచి తరుణము. మీరలు విదర్భక్ష్మారమణుని మీవిద్వత్తువలన మెప్పించి అర్థబాహుళ్య దెచ్చి, వివాహమాడి మమ్ముల సంతోషాంతరంగులఁ గావింపుఁడు" అని పలి కిన నిజజనకుల వాక్యములకు సమ్మతించి, నయ్యిరువురు బ్రహ్మచారులు విదర్భరాజ సదనమున కరిగిన నమ్మహీనాథుఁడు ప్రత్యుత్థాన పూర్వక ముగ వారల నాదరించి, యథార్హపీఠంబుల గూర్చుండ నియోగించిన యాబ్రహ్మచారులు. ఛందోవ్యాకరణ తర్కమీమాంస శిక్షా జ్యోతిష క్రియా సందర్భంబు లుపన్యసింపుచు రాజశ్రేష్ఠుని మెప్పించి, ఆనంద స్వాంతునిగ నొనర్చి, వివిధామ్నాయోక్త మంత్రాళిచే సింధూరద్రవ మిశ్రితాక్షత ఫలాశీర్వాదములు చేసిరి అప్పుడా నృపుఁడు సంతసించి

తా మచ్చటి కరుదెంచిన హేతు వెద్ది యని వారిని మచ్చికతో బ్రశ్నించెను. అంత టాబ్రహ్మచారులు "మహారాజా! మేము పేదబ్రాహ్మణ సుతులము. మా వివాహార్థమై ధనమును సంగ్రహింప విచ్చేసితిమి. అయ్యది యనుగ్రహింప కోరుచుంటిమి" అని పలికిరి. విప్రాత్మజు లట్లు నుడివినంతనే రాజు తన హాస్యరసంబును బాహ్యకము గాకుండ "విప్ర నందనులారా! నే చెప్పినట్లాచరింతురేని మీకు విపులార్థసంసిద్ధులు గలుగును. నిషధానగరాధిపతి యగు చంద్రాంగదుని పత్ని సీమంతినీ దేవి యనుదినము సోమవారంబున సోమశేఖరుని పూజ లాచరించుచు నిరంతరము దంపతి పూజ లత్యద్భుతంబుగఁ జేసి అభీష్టమైన ధనము నిచ్చుచుండెను గాన మీలో నొకరు యువతిగను, మరియొకరు పురుషుఁడు గను వేషమును దాల్చి యా సాధ్వి మందిరమునకుఁ బోయి ఆమెచే పూజింపఁబడి, యచ్చట భుజించి ధనమును గొని క్రమ్మర నా సన్నిధానమునకు రండు" అని బలికెను. అయ్యది యాలించి బ్రహ్మచారులు భయమును జెంది "నరేంద్రా! మీబోటివారు పరరాజన్యుని యొద్దకు కపటప్రయత్నము చేయుటకై బనుప నయ్యది కలుషము. మేము మీ శాసనమున నిషధపురమున కెట్లు పోవనేర్తుము. కౌటిల్య మార్గమున సంచరింపుచున్న మమ్మెవ్వరేనియు నెరింగిన దండనార్హుల మగుదుము. కులశీల విద్యాగుణముల బ్రయోజనములగు లజ్జాభిమానములు దొలంగిపోవును. మరియు సకలశాస్త్రపారంగతులమగు మేమిట్టి కార్య మాచరించుట వేదబాహ్యము" అని విన్నవించిరి. ఆ పలుకు లాకర్ణించి రాజేంద్రుఁడు వెండియు "విప్రనందనులారా! ఈ ధరణీతలమునందు ప్రతిమానవుఁడును దేవగురు జనక జననీ భూవర శాసనములను గౌరవించుట కర్తవ్యము. మరియు ప్రభువు వచించిన కార్యము శుభప్రదంబైనను, అశుభకరంబైనను ఆచరింతురేని వారికి జయము కలుగును. గనుక మీరు నాయొక్క ఆజ్ఞకు బద్ధులరై యుండవలెను"

అని శాసించెను. అంతట నా బ్రహ్మచారులు మెట్టకేలకు ధైర్యమును చేబట్టి రాజాజ్ఞకు తమ సమ్మతిని దెలియంబరచిరి.

ఇట్లు సమ్మతించిన యా విప్రకుమారుల యభిప్రాయం బెరింగి యా భూవరుండు సుమేధుని పురుష వేషమును ధరింపంజేసి, సోమవంతు నకు కటిభాగంబున దివ్యకౌశేయమును నుదుట కుంకుమరేఖయుఁ గునుకుబరచి ప్రమరతాళంబులఁ గుచమండలమమర్చి, సొగసుగా మృదుల కంచుకమును దొడంగి, మాయాశిరోజములను వేణిగ నొనర్చి, ప్రవిమలంబైన పుష్పములు దురిమి రాణింప మొలనొడ్డాణంబును బిగియించి, చెక్కిళ్ళ మకరికలు చక్కఁగఁ దీర్చి, కరముల రత్నకంకణాంగదము లమర్చి, కర్ణములయందు బేబులకమ్మలొప్పఁ, గంఠసూత్రాది భూషణ కలితుని జేసి కృత్రిమభామవలె నొప్పించెను. సౌందర్యవంతులగు ఆ విప్రులు మాయాదంపతి వేషములను బాల్చి రతి కుసుమాయుధుల మాడ్కి రంజిల్లుచుండిరి.

అట్లు కృత్రిమ వేషంబుల వారు కాగల యుద్ధంబు లవశ్యంబుగా ననుభోక్తవ్యంబులని ధైర్యంబవలంబించి, రాజానుశాసనంబున కొన్ని దినముల ప్రయాణంబును గావించి, యభ్రంకష మణి కాంచన సౌధ ప్రాకార గోపురంబును, నిజవైభవ పరాభూత గోపురంబును నగు నిషధపురంబున బ్రవేశించి తత్పట్టణ విలాసంబు లాలోకింపుచు, రాజమార్గంబున నరుదెంచి యచ్చట నానాదేశ సమాగత శైవభక్తులగు వధూవరుల ననేకులఁ గాంచి వారలతోఁ దామును రాజమందిరద్వారంబును జేరియుండిరి. ఆ దినము సోమవారంబగుటచే భూవరపత్నియగు సీమంతినీదేవి వివిధాలంకారిణియై దేవాగారము సొచ్చెను. ఆ సమయంబున నచ్చటికి శైవభక్తులును భూసురముఖ్యులును మరియు వనితలును హాసోల్లాసముఖంబుల ఆ సాధ్వీమణిని జేర వరుసగనరిగిరి. అప్పుడు ఆ ప్రదేశమంతయు మేదురంబుగ వేణువీణారవంబులతోడను, వేదనాద

ములు ఘంటాఘణత్కారలు శంఖనిస్వనంబులు వీనితో దిక్కులు నిండియుండెను. చతుర్ద్వారంబులు కదళికాస్తంభ సంగతమైనట్టియు, పల్లవతోరణంబులచే యలంకరింపఁబడియున్నట్టియు, బహురంగవల్లికా భ్రాజితంబగునట్టియు, ఫలపుష్పమంజరీ పరిమళోపేతం బగునట్టియు, దేదీప్యమాన ప్రదీపికంబగునట్టియు, మణిమయంబైన కళ్యాణమంటప మున బృధుల సౌవర్ణమయ రత్నపీఠంబున ఆసీనయై యా సిమంతిని ధవుని సాధ్వి చిత్తములర శంకరు నారాధించుచుండెను. ఆమె యా రవికోటి తేజుండగు పరమశివుని ధ్యానంబుఁ గావించి, నాహ్వానమొసర్చి, భద్రా సనంబిచ్చి, నర్ఘ్యమొసఁగి అభిషేకమునాచరించెను. పిమ్మట ఆ కృత్తి వాసునకు వస్త్రయుగ్మంబు లర్పించి, శ్రీగంధతిలకాదులతో నక్షతం బుల నలంకరించి, కుంతి మందార బిల్వ మాకంద వకుళ చంపకాశోక పున్నాగ జలజములతో పూజలొనరించెను. పిదప సౌరభ్య ధూప మొసఁగి, కర్పూర నీరాజన మిచ్చి చమకంబున మధుభక్ష్య శాల్యోదన ము నివేదన మొసఁగి, నవరత్నములతో నక్షత్రహారతి నిచ్చెను. అనంతరము వంశపావని యగు యా చిత్రవర్మ తనయ పుష్పములను దోయిట ధరించి బుధులతో కారుణ్య సాంద్రమతియగు చంద్రమౌళీ శ్వరునకు మంత్రపుష్ప మొసఁగి, ప్రదక్షిణ నమస్కారంబు లొనరించి "ఓ చంద్రశేఖరా! పాపములు, విపత్తులు, దుఃఖములు సహింపరాని కష్టములు, శుభాశుభ వ్యసనములుగలిగి నిరంతరము దుఃఖసముదాయ మైన సంసారదోషమును విదళించి నన్ను రక్షింపుము.

'చ॥ శరణు గిరీంద్రజారమణ చంద్రకళాధర కాలకంధరా!
శరణుమహాత్మ హేమగిరి చాపమహేశ్వర భక్తవత్సలా!
శరణువిరించి విష్ణుముఖసన్నుత భద్రఫలప్రదాయకా!
శరణువియన్నదీధర భుజంగవిభూషణ దీనపోషణా!

అనియు,

చ॥ జయజయ రక్తబీజ దనుజాధిప శుంభనిశుంభమర్దనీ
జయజయ ఖడ్గఖేట శరచాప గదాంకుశ శూలధారిణీ
జయజయ భోగభాగ్య జయ శాశ్వతభద్ర ఫలప్రదాయినీ
జయజయ యోగిమానస వశంకరి శాంకరి విష్ణుసోదరీ!

క॥ భువనత్రాణ సుధాకర ధవళాంగ కర త్రిశూలధారణ శంభో
శివశంకర మృత్యుంజయ భవహర మాంపాహి భక్తనిధానా!

క॥ జపమాత్ర వ్రత నిష్ఠాతపములు నలుపంగ నోప దథ్యముగ భవ
త్కృప నమ్మియుండెదను నా యపరాధంబులు సహింపు మార్త
శరణ్యా!'

అని బహువిధములఁ బ్రార్థింపుచు శంఖకాహళఘంటారవంబులు చెలంగ యనేక ఛత్రచామర కుముదాది రాజోపచారంబులఁ గొంత ప్రొద్దు సేవఁ గావించి పిమ్మట శివమంత్రపారాయణమును శివపురాణ శ్రవణమును గావింపుచు, పార్వతీపరమేశ్వరుల పూజామహోత్సవముల నింపుతో జేసి శైవభక్తులగు దంపతులను పార్వతీపరమేశ్వరులుగ భావించి, నైజమానసాంభోజమునందు నిశ్చలత్వమును జెంది, పుష్ప సుగంధములతో దంపతి పఙ్క్తికెల్ల పూజఁ గావింపుచుండెను. ఆ సమ యంబున కృత్రిమభూసురదంపతుల వేషములను గ్రహించి, ఆశ్చర్య మును వెల్లడిబరుపక శాంకరిపైభారమిడి, ఒకరిని భవానిగను వేరొకరిని శంకరునిగను నూహింపుచు ఆ సీమంతిని వారిని నారాధించెను.

ఇట్లు సీమంతినీదేవి శైవదంపతుల కెల్లరకు షోడశోపచారముల బూజనము లొనరించి షడ్రసోపేతముగ భోజనంబిడి వారినెల్ల పరి తృప్తులఁగావించి, తాంబూలాదులును దక్షిణలొసంగి, ప్రదక్షిణముగ వందనము లాచరించి, స్వేచ్ఛార్థంబు లొసంగి వారల యాశీర్వాదము లను బడసి గౌరవముగ సాగనంపెను. పిమ్మట ఆ సతి మృష్టాన్నపాన ముల నారగించి పతితో నిష్టాగోష్ఠిని ముదముతో నుండెను.

అంతట దేశాంతర సమాగత భక్తప్రకరంబు లా రాత్రి యచ్చటనే వసియించి మరునాడు నిజనివాసంబులకేఁజనిరి. అప్పు డాకృత్రిమ దంపతులు పరజన సందర్శన భీతులై యర్ధరాత్రంబున మేల్కాంచి, తమ తమ గృహంబులకు సత్వరము ప్రయాణ మగుచుండిరి. కొంత దూరము జనిన పిదప సోమవంతుఁడు మేనిపై నున్న వస్త్రంబులను తొలగించఁగా తాను పురుషత్వంబును విసర్జించి కాంతారూపమును పొందినట్లు గాంచి, నిశ్చేష్టతను జెందెను. ఈ రీతిని ప్రభవించిన ఆ తారుణ్యవతీలలామ యగు సోమవతి కామేచ్ఛకు లోనై రతిప్రీతిని సుమేధుని కౌగిలించుకొనగ, వారి కీ విధముగ సంభాషణము జరిగెను.

సోమ:—మనోహరా! ఈ రమణీయతరమగు యుగ్రవనము నందు కొంతతడవాగి పుష్పఫలవితాన పూర్ణమైన యీ లతాగృహంబులందు వసించి కామకేళిని నన్ను గారవింపుము.

సుమే:—ఓయీ! నీ పడుచుదనపు చేష్టలుడిగి మానమున సత్వరముగ రమ్ము. మనము చాలదవ్వు పోవలసియుండెను.

సోమ:—(సుమేధుని పోనివ్వక బిగియార కౌగిలించుకొని యాతని పెదవులను చుంబించి) ప్రాణనాయకా! మన్మథభాషణములకు తాళఁజాలక మిక్కిలి తపించుచున్న నా వలుకు లాలింపవేమి? ముద్దిడవేమి? నీ హృదయ మింత కఠినమైనదా?

సుమే:—(విస్మయముతో) మిత్రమా! నీవిట్లు చేయఁదగునా? అస్ఖలిత బ్రహ్మచర్యుండవై తగు సారస్వత విప్రనందనుఁడవై తర్కాగమామ్నాయ సారములందు మేధానిధివై జితేంద్రియుఁడవై రంజిల్లు నీ విట్లు ప్రవర్తించిన, అయ్యది మన బంధుజనులు వినిన నగరా? మరియు నీవు పురుషుండవు. వనితవుమాత్రము గావు. విధివశమున ఇట్టి మాయావేషమును దాల్చవలసి వచ్చెను గనుక కొంటెతనమును మాని సత్వరము నడవిరమ్ము.

సోమ:—ఆర్యా! నేను వధూటినిగాని పురుషుఁడను గాను. ఇయ్యది అన్యశూన్యంబైన నా వక్షస్థలమును జూడుము.

అని పైటను తొలగించి చూపెను. అంతట సుమేధుఁడు తన మిత్రుఁడగు సోమవర్మయె నిక్కముగ సోమవతి యగుటను గాంచి విస్మయంబంది, కంపితగాత్రుండును, చంచలచిత్తుండును నై దుర్ముఖుఁడగుచు యూరకుండెను.

ఇవ్విధంబున నేమియుఁ దోఁచక, వెరగుపడియున్న యా ద్విజకుమారునిఁ గాంచి నిజానురాగంబున గామోన్మాదయుఁ దోప

సోమ:—భూసురకుమారా! నీవు మౌనమును వహించి చిత్తంబు వెలయ భాషింపవేల? దైవకృతంబును దప్పింప నెవ్వరికిని దరము గాదు. వంచకుఁడైన యా భూవరుని మనసు చేరనేల? చేరితిమి బో యీ మృషావేషంబులను దాల్పనేల? ఆ మహాపతివ్రతయొక్క సమక్షమున కరుగనేల? మరియు నామె నిజమని నమ్మి మనలను పూజింపనేల? అంతమాత్రంబునకు ఇంతలగుట శోచనీయము. ఇంతకును బురాకృతంబని మన మెఱుఁగవలయును. గనుక యెవ్వరైనయొక ధూర్తునిపలుకుల నాలకించి సద్గుణులను మోసపుచ్చినవారికిని మనగతియే పట్టును. అంతయు గతజల సేతుబంధనము. గాన మన మందిరముల కరగి పెద్దల యాజ్ఞను బడసి మన మిరువురము వేదోక్తవిధిని వివాహమాడుదము. ఇక నీవు చింతనుడిగి శివుని పాదములాన సమ్మదమును గలిగియుండుము.

సుమే:—నీవు చెప్పినదంతయు నిక్కువము. మన మిప్పుడు గృహమున కేగి, యుపాయమార్గము నాలోచింతము. సత్వరము నడువుము.

సోమ:—(వలపుచు నిలుపఁజాలక) సుందరాంగా! ఈ వన సౌందర్యంబును జూడుము. ఎంత రమణీయముగ నున్నదో ఇయ్యది జన్మరహితంబై పుష్పఫలసంయుత మంజుల కుంజ పుంజ రంజనము. మయూర కీర పిక షట్పద ముఖ్య సమస్త పక్షి నిస్వనితము. గామినీ

పురుష సంగమ యోగ్య నివాసమైనది. ఇందు రతివల్లభ కేళి చరిత్ర మంతయు నొప్పుచుండెను.

అని నిజమోహముతోఁ బలికి అయ్యంగన యుంగజుని పుష్ప విశిఖాహతి కోర్వఁజాలక ఆత్మ నుప్పొంగుచు లజ్జను బోనిడిచి మోహ భరంబును జెంది ఆ యువకుని మధురాధరము నొక్కి పంటఁ నొక్కి దరళీకృత చిత్తము తత్తరించునట్లు యాలింగనమాచరించెను. ఇట్లు అతిశయ ప్రేమాతిరేకంబున పైఁబడియున్న యమ్మానిని నా భూసురసుతుండు సాంత్వవచనంబుల నెట్టకేలకు ననునయించి క్రమ్మర నవ్విప్రమిథునము నిజగృహంబులకుఁ బోవుచు సీమంతినీప్రభావమునకు మిగుల నాశ్చర్యమును జెందిరి.

## 7

### అంబికా ప్రసన్నము

గృహంబున కరుదెంచిన వారలను వీక్షించి నిజజనకులు కినుకఁ దోప ఆ మహిళారూపంబేమని యహితోక్తుల నడుగ ఆద్యంతముగ జరిగిన వృత్తాంతమును నెల్ల సుమేధ సోమవతులు వారికి తెలియఁ జెప్పిరి. అయ్యది వినినమాత్రంబున వారు క్రోధోజ్జ్వలురై సరభసముగ జనపతి కడ కరుదెంచిరి. అంత నా భూవరునిఁ జూచి సోమవతి జనకుఁడగు సారస్వతుఁడు "ఓ భూవరా! నా కుమారుఁడు శుద్ధశ్రోత్రియుఁడు. గతదోషుఁడు. మరియు మితభాషుఁడు. భూవరుఁడవగు నిన్ను యాచింప వచ్చిన వానిని కామినీవేషమున సన్నద్ధునిఁ గావించి మహా పతివ్రత యగు సీమంతినీదేవి వద్ద కనిపి పూజ గావింప జేసి యీ వారీ రూపము స్థిరమగుటకు కారకుఁడవైతివి అయ్యో! నా యేకపుత్రుఁ

డట్టి దురవస్థకుఁ గొల్పడియుండ నేమి నెట్లు జీవింతును? నీ కపటోద్యోగ
ము వలన యిట్టిగతి పట్టినది. అక్కటా! మౌంజీ దండకమండలములు
రంజితపటుచర్యలుడిగి రమణీమణినై మంజుల భూషణంబులను హరి
ద్రాంజన సింధూరకాదులను ధరించెను. పుత్రహీనుఁడు. లుప్తపిండోద
కుఁడై గతిమాలిన వాఁడగునని వేదములు ఘోషించుచుండెను.
ఓ క్షితివరా! సింహాసనముపై నధిష్ఠించి మహావైభవముతో మురియు
చున్న నీవు నా గతికేమిఁ బల్కెదవు?" అని బహువిధముల నిష్ఠుర
భాషణంబు లాడుచున్న సారస్వతుని దైన్యవాక్యంబు లాకర్ణించి యా
భూపాలుం డతి విస్మయమానసుండై తనమనంబున "ఆహా! దైవమా!
పరిహాసార్థముగా యీ ద్విజసుతుని భామాకృతిని బంపిన బురుషత్వం
బును బరిత్యజించి సతియై విచ్చేసెను. ఔరా! గిరిజామహేశ్వరుల
సామర్థ్యంబులు, వారి భక్తుల మహత్వంబులుఁ జూడ మహాచోద్య
ముగ నుండెను భక్తసాధ్వియగు సీమంతిని యొక్క భక్తిశీలములను
దలఁప బ్రహ్మకైనను శక్యముగాదు" అని వితర్కింపుచు ఆ విదర్భా
ధీశుఁ డాప్తమంత్రి పరిజనులను రావించి వారితో సంభాషించి, ఆక్షణ
మందే తాపసోత్తముండైన భరద్వాజునిరప్పించి యా మహాత్ముని యను
మతంబున నా విప్రులిరువురు నాత్మజయుతముగా దనవెంట రా నతి
త్వరితగతుల నంబికాదేవి గృహంబున కేతెంచి, యా రాత్రి గౌరీ సమ
ర్చనంబుఁ జేయ సమకట్టి యమ్మహీనాయకుండు విగతభోజనపానని వేశు
డగుచు ధీరమతియై, నమ్మునీంద్రోపదేశంబున విహిత నిష్ఠా సమాధిఁ
గావించుచుండెను

## దండకము

శ్రీమహన్మహాదేవురాణీ నతేంద్రాణి రుద్రాణి శర్వాణి కళ్యాణి
దాక్షాయణీ శూలపాణీ పృథుశ్రోణి ధూమ్రాక్షసంహారిణి పారిజాత

ప్రసూరాంచితస్నిగ్ధవేణీ లసత్కీరవాణీ భవానీ శివా శాంకరి రాజరాజేశ్వరీ గౌరీ శాకంబరీ కాళికంకాళి రాజీవనేత్రీ సుచారిత్రీ కాల్యాణగాత్రీ మహాదైత్యజైత్రీ నగాధీశపుత్రీ జగన్మాత లోకైక విఖ్యాత గంధర్వ విద్యాధరాదిత్య కోటీరకోటీ స్ఫురద్దివ్యమాణిక్యదీప ప్రభాత్యుల్లసత్పాదకంకాత కేయూర హారాంగదాది జ్వలద్భూషణవ్రాత కౌమారి మాహేశ్వరీ నారసింహి రమా వైష్ణవి శాంభవీ భారతీ భైరవీ దుర్గ కాత్యాయని పార్వతీ నీదు సామర్థ్యమెన్నంగ బ్రహ్మాదులున్ శేషభాషాదులున్ జాల రేనెంతవాడన్ బ్రశంసింప నేతజ్జగజ్జాల నిర్మాణ సంరక్షణారంభ సంరంభ కేళీవినోదంబులున్ గల్గి వర్తింతు వెల్లప్పుడో యాదిశక్తి పరంజ్యోతి నారాయణీ భద్రకాళీ శుకశ్యామలా భ్రామరీ చండికా లక్ష్మి విశ్వేశ్వరీ శాశ్వతైశ్వర్యసంధాయినీ యంచు నిన్నెంతయున్ సన్నుతుల్సేయు లోకాళికిన్ సంతతాఖండ దీర్ఘాయురారోగ్య సౌభాగ్య సంసిద్ధిగావింతు నశ్రాంతమున్ రక్తబీజాది దైతేయులన్ ద్రుంచి బృందారకశ్రేణి రక్షింతు నీవెప్పుడున్ నారదాగస్త్య సాండిల్య మాండవ్య మైత్రేయ జాబాలి కణ్వాది మౌనీంద్రు లత్యంత నిష్ఠాగరిష్ఠాత్ములై హృత్సరోజంబులన్ ధ్యానము ల్సేయుచున్ బూజగావింతు రంతర్ముఖత్వంబునం జంద్రఖండావతంసా భవద్దివ్యరూపంబు బ్రహ్మాండ భాండంబులన్నిండి వెల్గొందు నేతత్ప్రపంచంబు సర్వంబు నీవై ప్రవర్తింతు వీ సూర్యచంద్రాదులున్ భూజలాకాశ వాతాగ్ని జీవాత్ములన్నీవ నీకంటె వేరైన దింతైనయున్ లేదు యుష్మత్కటాక్షావమున్లైనట్టి వారల్గదున్ ధన్యులై మాన్యులై పుణ్యులై యుందు రీ ధాత్రిలో నేను మూఢుండ గర్వాధిరూఢుండ దుశ్చిత్తుడన్ మత్తుడన్ జ్ఞానహీనుండ దీనుండ నేఁ జేయు నేరంబులుంగాంచి రక్షింప భారమ్మోతల్లి సద్భక్తమందారవల్లీ నమస్తే శరచ్చంద్రబింబాననా యైన నమస్తే శశాంకారుణప్రజ్వలత్కుండలా యై నమస్తే పరిత్రాత భూమండలా యైన నమస్తే విపద్ధ్వాంత భానుప్రభా యై

నమస్తే పరిధస్తతాపత్ర యాయై నమః కామథాయై నమోముక్తిదాయై నమశ్చండికాయై నమస్తేంచికాయై నమస్తే నమస్తే నమః.

కవిరాజ విరాజితము

"జయ జయ పార్వతి శంభుకుటుంబిని చారుసితాంచికంబు
గళే, జయ జయ విద్రుమ బింబఫలాదరి చక్రసహోదరి పీనకుచే
జయ జయ శాంకరి మాధవ శంకరి శత్రుభయంకరి మానినుతే
జయ జయ శుంభనిషూదని సత్యవినోదిని శాంతిరతే"

అని నుతించుచు మహాదీక్షతో అన్నరేంద్రుండు మూఁడు అహోరాత్రములు అంజలిని ఘటించి వినుతులు చేయుచుండెను. అంతట రాకేందు బింబము పగిది ప్రకాశించు మోముతోను, తెల్ల తామరల వంటి విశాలనేత్రములు గటిభాగమున శోభితమైన కనకాంబరము డమరు త్రిశూల ఖడ్గంబు, కంఠమున విరాజిల్లుచున్న మణిగ్రైవేయకములు, చంద్రాయుధమును ధరించిన మస్తకము, సౌమినీపుంజ సన్నిభప్రభ, హారమంజీర కటక కేయూర ముఖ్య భూరి భూషణ రాజి విస్ఫూర్తి లోలయు నిర్భర కృపాప్తి, మహితవిగ్రహముఁ గలిగి విదర్భపతికి అంబికాదేవి ప్రత్యక్షమయ్యెను. ఇట్లు సాక్షాత్కరించిన యిందు మౌళీశ్వరికి విదర్భపతి వందన మాచరించి కేలుదోయి ఫాలభాగంబున ఘటించి ప్రముదితాత్ముఁడగుచు నూరకుండెను అప్పుడు వినయవినమిత శిరస్కుఁడై యున్న యా రాజున కంబికాదేవి "ఓ ధరణీశా! ఏటికై నన్నుఁ గూర్చి ప్రార్థించితివి? నీ కెద్దియేని కామితంబు లున్న సత్వర మెరింగింపుము. ప్రియమార యొసఁగెదను" అని బలికెను. అంతట రాజేంద్రుఁడు భవానీదేవికి తాను బ్రహ్మచారులకు కుటిలవేషమును వేయించి నిషధాపురికిఁ బనుపుటయు, సీమంతిని వారికి పూజలను గావింపుటయు, అందొకఁడు వనితగామారుటయు యాదిగాగల యావద్వృత్తాంతమును నివేదించి "తల్లీ! విప్రుఁడగు సారస్వతున కాతఁడొక్కఁడేకుమారుఁడు

గాన కరుణించి ఆతనిని తిరిగి బుసుషుని గావింపుము. కాదేని నన్ను జనులెల్లరు కపటాత్మకుఁడనియు, బుద్ధిచపలుఁడనియు, కృత్రిమస్వభావుఁడనియు నిందించెదరు. గనుక నన్నట్టియపవాదమునకు లోను గానీయక నరయుచు నీ కృపాపాత్రునిగ యొనర్పుము” అనుచు ప్రార్థించిన అంబికాదేవి యా నృపునితో “ఓయీ! కుటిలవేషములతో జనిన వీరిని గ్రహించి యా మహాపతివ్రతయగు సీమంతిని దంపతులటంచు మనస్సునందు భావించి వారిని పూజించి తన సోమవారవ్రత స్ఫూర్తిని జేసికొనెను. ఆమెయొక్క సంకల్ప మమోఘములు. కావున నయ్యది మరల్ప అజునికైనను నలవిగాదు. గనుక వారల కిరువురకు పాణిగ్రహణంబాచరింపుఁడు. విప్రుఁడగు సారస్వతునకు కులోద్ధారకుఁడగు వేరొక సుతుఁడు జన్మించునట్లు వర మొసఁగితిని” అని నుడివి నృపుని సంతసమున నోలలాడించి అంతర్ధాన యయ్యెను. పిమ్మట ఆ విప్రులకు విశేషార్థము నిచ్చి, తపోధనుఁడగు భరద్వాజుని అర్చించి వారిని తమ తమ నెలవుల కనిపి సంతోషాంతరంగుఁడై యుండెను.

పిమ్మట సుమేధ సోమవతులకు వివాహము జరిగెను. ఆ వధూవరులు అత్యంతసౌఖ్యంబుల ననుభవించుచుండిరి. మరియు సారస్వతునకు వంశోద్ధారకుండును, సత్కళానిధానుండు నగు సుతుఁడు గౌరీ ప్రభావముచే నుద్భవించెను.

## 8

## విమభ్రష్టయగు సుమతి భర్తచే పరిత్యజింపఁబడుట

సీమంతినీ ప్రభావమును, శంభుమహాత్మ్యమును, విన్న శౌనకాది మహర్షులు పరమ ప్రహృష్ట హృదయులై సూతమహామునిని ప్రశంసించి పిమ్మట శివభక్తుల లక్షణంబులను నెరింగింపుమని కోరిరి.

అప్పుడు సూతుఁడు "ఓ శౌనకాది మహామునులారా! నిటలాక్షుని భక్తులు ఘటనాఘటన సమర్థులు. ఘటికాసిద్ధులు. మరియు వినిర్మల హృదయులు. వారి పటుతర మహత్మ్యములను పేర్కొనఁ జతుర్ముఖుని కైనను శక్యము గాదు. కామధేనువునకు తృణము, చెరకునకు ఉదకము యిడినట్లు, శివభక్తులను భక్తితో నాదరించిన యెడల అవి వారికి కోటిమడుఁగులై ఫలిత మునిచ్చును పృథివీస్థలి యందు శ్రీమహేశ్వర పూజ లొనరించు మానవుల సచ్చరితంబులు భుక్తి ముక్తి సాధనములై, జన్మదైన భయతాపహరంబై, సర్వలోకరంజనంబై యొప్పుచుండును గావున శివభక్తుల సామర్థ్యంబును దెలియఁజేయు నొక్క యితిహాసంబును జెప్పెద నాలకింపుఁడు" అని యొక యితిహాసంబును జెప్పఁదొడఁగెను.

దశార్ణవ మను రాజ్యమును వజ్రబాహుండను రాజు పాలించుచుండెను. అతని పట్టమహిషి యగు సుమతీదేవి నిండు గర్భిణియై యున్న సమయంబున సైపఁజాలక సవతులు అమెకు విషాన్నమిడిరి. ఘోరతరంబైన యా విషాన్నము నారగించి, సుమతీదేవి దైవయోగముచే మృతినిబొందక సంతాప దుస్సహంబగు నవస్థను జెందుచుండెను.

అంతలో నొక్కదినంబున సుమతికి మిక్కిలి రోదన ఘోషణ ధ్వనులతోడను, తేజహీనుఁడును, గర్భ స్థవిషముచే విచ్ఛిన్నాంగుఁడై యొక సుతుఁడు జన్మించెను. కాని మాతాశిశువులు బాధాపరితాత్ములై యుండిరి. ఎన్నెన్ని మంత్రౌషధసత్కారంబు లాచరించినను వారు ఆరోగ్యము నొందక రుగ్మతకు లోనై దుఃఖించుచుండిరి. ఇట్లు అహోరాత్రములు రోదనముఁ గావించుచున్న వారలను జూచి, రాజు అసహ్యతను జెంది, బంధుమిత్ర పురోహిత ప్రముఖుల నెల్లరను రావించి, నిష్కరుణతో "వీరు నరకాలయులై యిచ్చటికి కరుదెంచిరి. చిరతర రోగార్తులై విశీర్ణాకృతులై యున్న వీరల వలన నాకు నిద్రాహారములు దూర మ

మ్యేను. గావున సుమతిని పుత్రసహితంబుగ నరణ్యంబున కనిపెదను" అని నిశ్చయించి ఆ భూనాథుఁడు కనిష్ఠపత్నీ వ్యాసక్తుండు గావున నిజ సారథిని బిలచి, నఖ్యామినీడింభకులను రథంబుపై నిడుకొని తన రాజ్యమునకు బయిట విజనప్రదేశమునఁ గుడించి రమ్మని బంపెను. అంతట వాఁడు రాజశాసనప్రకారము. వారలను బహుయోజన విస్తారంబైన దూరంబునకుఁ గొనిపోయి, భయానకంబగునట్టియు, క్రూరజంతు సముదాయముతో నిబిడీకృతమైనట్టియు, బహు ఘోరగుహ్యాకాబిలము లతో గూడుకొన్నట్టియు, నిర్జనమైన కారడవియందు వారిని విసర్జించి తనదారిని జనెను. అంతట ఆ తరళేక్షణయగు సుమతీదేవి మహాకలవర మును జెంది, దుఃఖించి, చేయునది లేక మనంబును కుదురుబరచుకొని దారకు నెత్తుకొని ఆ దుర్గమారణ్యమునందుఁ బడి పోవుచుండెను.

ఇట్లు వాతాతప దుర్గమంబును, నిమ్నమంబును, వేత్రకీచక వేణు కంటక పాద ఫలతాకీర్ణంబును నైన యమ్మహారణ్యమార్గంబును బట్టి యా రాజభామిని ఝల్లీరవంబులకు నదరుచు, కంక కాక గృధ్రోలూక ఘూత్కారరవంబులకు భయంబునొందుచు, వరాహ మహిష జంబుక మార్జాలాది క్రూరమృగ సంచారంబులకు వెరచుచు, వనదేశంబులం గాంచి ఫలాశనంబు నొందుచు జనుచున్న సమయంబున గమనార్తయు, క్షుత్పిపాసాతురయు, శీతవాతాతపక్లాంతయు, క్షురాత్మ కంటకప్రచ్ఛన్న పాదయు, ముక్తకేశియు, భయభ్రాంతచిత్తయు నై ప్రాగ్జన్మ దురిత కర్మంబుల నిందించుకొనుచు నిట్టూర్పులెగయ ధరణీతలంబునంబడుచు లేచుచు మందగమనంబున యరుగుచు ఆ కాంతారమార్గంబులు దప్పి మరల మరలం జనుచు దుర్గంబుల నతిక్రమించి ఘోరారణ్యదేశంబులను ధీరప్రతిజ్ఞలతో నతిక్రమించి, దైవకృపచే సర్వజనసందోహాన్వితంబైన రాజమార్గంబును గాంచెను.

అంత నా సుమతీదేవి దృఢమతియై ఆ రాజమార్గమును బట్టి పోయి లక్ష్మీనివాసంబైన ఒక పురమును జేరెను. ఆ పురంబంతయు హాటకరత్న ధనంబులకోటికి పడగెత్తిన వైశ్యులతో నలరారుచుండెను, ఆ వైశ్యపురంబున కధినాథుఁడైన పద్మాకరుఁడు గురు కృషి వాణిజ్య గోరక్షణ రక్షితుండై ధనవంతుఁడై అత్యంతధార్మికుఁడై యుండెను. దీన వదనయై బాలుని యెత్తుకొని వీధియందు బోవుచున్న రాజ్ఞిని పద్మాకరుని దాసి సౌధమునుండి వీక్షించి, క్రిందికిఁ దిగి రాజమహిషిని సమీపించి ఆమెయొక్క వృత్తాంతమునెల్ల యారసి, సంభ్రమముతో సంగతి నంతయు తన స్వామికి విన్నవించెను. విచారభూయిష్టమగు యామె చరిత మంతయు విన్నవాఁడై, బుధమాన్యుండగు ఆ వైశ్యవిభుఁడు కారుణ్యమును జెంది యామెను తన గృహాంతికసీమయందు యొక రహస్యగేహమందునిచి, దివ్యశయ్యాసన భోజనపాన వస్త్ర మాల్యమ్ములు నౌషధక్రియలతో సాదరణంబొనరించి, మాతృసామ్యమ్ముగ బూజ సేయుచుండెను. అతఁడు ధర్మకాంక్షియై భిషగ్వరుల ననేకుల రప్పించి, వారలను సన్మానించి విషాపహరంబగు ననేక ఔషధముల నిప్పించెను. కాని చికిత్సలెల్ల బూదిలోనిడిన హోమంబై విషవ్యాధి మానక శిశువు విగతజీవుండయ్యెను.

## 9

### ఋషభయోగీంద్రుఁడు శిశువును పునర్జీవితుని గావించుట

ఇట్లు విగతప్రాణుండై పడియున్న కుమారునిఁ గాంచి రాజపత్ని హాహాకారంబులు చేయుచు, నత్యంతవిషాదంబున బరివేదనం బొనరింపుచున్న సమయంబున నయ్యాక్రందనధ్వని విని పురంబునఁ గల వైశ్య స్త్రీజనంబు లచ్చటికిఁ జనుదెంచి, బహువిధంబులగు సాంత్వవాలాప

బుల యూరడింపుచుండ, సయ్యంతి దగ్ధయు ఖేదంబున ఆ బాలకు నుద్దేశించి "ఓ రాజకుమారా! నీవు నా గర్భమునందు బడుట యోగ్యము లేక నాకు విషాన్నమిడి, మన యిరువురను యిట్టి దుస్థితికి లోనుగావించిన నా సపత్నుల గర్భమున జనించి సుఖమొందక, పాపిష్టినగు నా గర్భమందేల జన్మించితివి తండ్రీ! అయ్యో! విషమూ దిననను, యిట్టి కష్టములను బొందినను, నిలచియున్న యీ కఠినజీవము నేనెట్లు బాయగలను? అయ్యో! సపత్నికి యిట్లు విషప్రయోగము గావింపజూచి, యీ విధి యెట్లు మిన్నకుండెను? ఇడినమాత్రంబున ప్రాణ మెడలకుండగ యేల బహుతాపవేదనాధవాసలంబున బడ ద్రోయవలెను? నిర్దయుండై నిజభర్త నన్ను అడవుల పాలుగావించి భైక్షవృత్తిని యేల జీవింపజేయవలెను? ఆహా! పరమేశ్వరా! ఈ దీనురాలి కింకేదిగిక్కు? ఎయ్యదిజూచి నే నింకను యీ భువిపై జీవించియుండవలెను? హా! పరమేశ్వరా! ఈ విధముగ దయ దప్పియుండుట నీవంటి భక్తజన పాలునకు పాడియా? ఓ రాజనందనా! నన్నిట్టి దుఃఖాంబుధిని ద్రోయుచు యెచ్చటికి బోవనుంటివి తండ్రీ!" అని పరిపరివిధముల వాపోవుచున్న యీ రాజమహిషిని యూరడింప, యచ్చట నెవ్వరికిని శక్తి గలుగలేదు.

అంతలో నెట్టి దుర్వ్యాధినైనను భస్మీభూతము చేయగల శివయోగి పుంగవుడగు ఋషభయోగీశ్వరుడు భూతివిలేపన రుద్రాక్షలు దాల్చి, రాజితలింగము హృదయస్థలమందు నొప్పుచుండ దండకమండలములను చేతియందు ధరించి, పాదుకలను ధరించి, ప్రత్యక్ష శివావతారుడై దైవగతిని యచ్చటికరుదెంచెను. అట్లరుదెంచిన యోగివర్యునకు వైశ్యవిభుడు యెదురేగి దోసిట్లనినప్పి, మహార్ఘ్యపాద్యములతి ప్రియభక్తితో నొసగి పుత్రమరణమున విలపించుచున్న సుమతీ

దేవి వద్దకు గొనివచ్చెను. యోగివర్యుఁడు కరుణార్ద్రచిత్తుఁడై వచ్చి సుధాసమయంబులగు వాక్కుల "ఓ భూపాలసతీ! ఏమిటికి నీ విట్లు మూఢచిత్తవై భూరిశోకంబున బొరలుచుంటివి? నాకు తేటతెల్లమగు నట్లు, యీ భూమిపై పుట్టువాఁడెవఁడో చచ్చువాఁడెవఁడో తెలియఁ జెప్పుము? నిధానముంచి యాలోచించిన నీటిబుగ్గలవలె జీవులు బుట్టు చు గిట్టుచు నుండును. సత్త్వాదిగుణములు వట్టిమాయతో గూడినవై సకలము శరీరమును యావరించుకొని యుండును. సాత్త్వికమువలన దేవ తులును, రాజసమువలన మానవులును, మహోగ్రమైన తామసము వలన మృగచయంబులును, రాజసతామససమిశ్రమంబున బహుజంతు కులములై వెలయుచుండెను. పూర్వజన్మకర్మానుభవంబున, దేవతలై నను కష్టముల ననుభవించుచుండ, అనుభవింపకుండుటకు తృణమాత్రు లగు నరులెంతటివారు? ధీయుతులైనవారు అశాశ్వతమైన యీ దేహంబును వీక్షించి భ్రాంతినొందరు. జననమయ్యెనని సంతోషమును బొందరు. లేక మృతినొందెనని సెతలఁబడరు. జీవము జడప్రాయమై జన్మించును. మరియు వ్యక్తమునందు అణగియుండును. ఆ మధ్యను సువ్యక్తముగా సంచరించును. ఈ త్రిగతుల సంభవించు ప్రాణము బుద్బుదప్రాయము. మరియు నయ్యది నిమిషభంగురము.

విధాత యెప్పుడు యొక జీవిని సృష్టింపఁజేయునో యప్పుడే యాజీవి యుండుటకు గూడ పరిమితినిడును. కొందరు జీవులు గర్భము నందే మృతిజెందుదురు. కొందరు పుట్టిన వెంటనే గిట్టుదురు. మరి కొం దరు యావ్వన మంకురించిన పిమ్మటను లేక వార్ధక్యదశయందును జచ్చెదరు. వారియొక్క పూర్వసుకృతములను బట్టి వారి సుఖాసుఖ ములు ఈ ధరపై యాధారపడియుండును. పితృమాతృ సంయోగమున శుక్లశోణిత సంఘటనమున స్త్రీ పురుష నపుంసక జన్మంబులు కలు చుండును.

సుకృతములను గాని, దుష్కృతములను గాని, సుఖదుఃఖము లను గాని, మహావిద్యార్థంబులు గాని, విభవములు గాని, ఆయువు గాని, శుభంబును గాని నిర్ణయించినట్లు అఖిలజనులు యనుభవించుచున్నారు. అనతిక్రమమగు కర్మమును, ఘనతరమగు కాలమును దాట నెవ్వరికి-శక్యముగాదు. గనుక నీవెల్లప్పుడును ఇట్లు శోకించుటఁ దగదు. మనము నిద్రావస్థయందు గాంచు స్వప్నము లెట్లు నిక్కములు గావో యట్లుగనే యీ కళేబరము యెన్నివిధములనైనను శాశ్వతము గాదు. జననీజనకులు బాంధవులు మిత్రులు పుత్రపౌత్రులు వల్లభీనాయకులు యివన్నియు దైవమాయాసంకల్పితములగు వ్యామోహములు. నిజ దేహము శుక్ల మేధోమాంస అస్తిమూత్ర రక్తమాంస యుక్తమైన యొక హేయరూపము. అట్టి అశాశ్వతమైనదానిని 'నా' యను అహం భావమును జేసి దేహముపై కాంక్షించుట ధర్మముగాదు.

ఎంతటివారికైనను తపముచే గాని, విద్యాబుద్ధులచే గాని, జప మంత్రౌషధములచే గాని, సత్క్రియలచే గాని, మరి యేనిపుణతచే గాని మృత్యుభయము నుండి విముక్తులు కాఁజాలరు. వనమృగములకు వ్యాఘ్రము మెదుట యుండ మేత యెట్లు హర్ష మొదవింపదో యట్లుగనే యశాశ్వితమగు ఈ దేహమున కాశించి మృత్యువను యొక భయముచే మానవుఁడు తన మనస్సును పీడింపఁజేయుచుండ వానికి సుఖ మెట్లల వడును? కనుక ప్రారబ్ధములెల్ల నిన్ను వీడి పోవుటకు యెల్లప్పుడును నీవు జగద్రక్షకుండగు ఆ గౌరీవల్లభుని యారాధింపుము. అప్పుడు నీ కష్టములెల్ల నిన్ను వీడిపోవును. నీవు సుఖాస్పదవగుదువు. ఇంతటి సదుపదేశమును బొందిన నీకు శోకోపశమనమయ్యెనో లేదో నా కెరిం గింపుము" అని యోగీంద్రుడడుగ సుమతీదేవి "యోగీంద్రా! భవ త్కటాక్షముచే నాకు భాస్వన్మూర్తి చేకూరెను. కాని బాంధవ భర్తృ పుత్రకులను బాయంద్రోచి యేకాంగినై గరళ క్లిష్టశరీరనై యున్న నాకు

శోకవ్యాకులములను మాన్ప మరణోపాయము దక్క వేరు మంత్రౌషధ ప్రక్రియ లెవ్వియును లేవు గావున నేను యీ బాలకసహితముగ నరుగ మరణోపాయమును యీ నీచురాలిపై కరుణవహించి యెరిగింపుఁడు" అని దైన్యస్వరంబు దోపఁ బలికిన, ఆ రాజపత్ని వాక్యంబుల నాకర్ణించి, కారుణ్యసాంద్రచిత్తుండై ఋషభమహానుభావుఁడు సకల ధర్మజ్ఞుండును, గృతజ్ఞుండును గావున బూర్వోపకారంబుఁ దలంచి మృత్యుండైన శిశుసమీపంబునకు వచ్చి భావితమైన భూతిని కరపద్మమునఁ ధరించి దీర్ఘనిద్రావశుఁడైన బాలుని సుఖమందిడి జనులెల్ల చిత్రముగ నవలోకించుచుండ క్రమ్మర వానిని సజీవితునిఁ జేసెను. బాలకుఁడు మెల్లన కన్నులను విచ్చుచు, కరచరణముల నాడించుచు తల్లిని గనుఁగొని నాక్రందన మొనర్చెను. జనులెల్లరు మృతిజెందిన బాలకుఁడు క్రమ్మర విచ్చేయుట వింతగను, సంతోషముగను గాంచి ఆ మహామునీంద్రుని సామర్థ్యము నెంతయు కొనియాడిరి.

పాడ్యమి చంద్రుని వంటి నెన్నుదుటమీద ముంగురులు వెలయుచున్న యా చిన్నికుమారుని గాంచి సుమతి హర్షస్వాంతమై బాలకు నెత్తుకొని తనివిదీర ముద్దాడి బాలొసఁగి లాలించెను. పిమ్మట యా పరమ తపోధనుఁడగు ఋషభేంద్రుఁడు అయ్యిరువుర దేహయుగ్మమును యీశ్వరమంత్ర పవిత్రమైన భూతిచే లేపనము గావించి, నిష్ఠుర విష వేదన మందున్న శరీరమును శోభితమైన వజ్రశరీరముఁ గావించెను. అంతట నా రాజపత్నియు రాజనందనుఁడు అత్యంత రుచిర దేహములను దాల్చి, యింద్రవైభవశతం బిసుమడించినభంగి నతిశయానంద సౌఖ్యంబును గాంచిరి. పిమ్మట మునీంద్రునకు సుమతీదేవి ప్రణమిల్లెను. అట్లు తన పాదపద్మములపైఁ బడియున్న నయ్యింతిని గనుఁగొని ఋషభుఁడు కరుణతో "ఓ పద్మనేత్రీ! నీవు కతిపయదినంబులలో మహాసామ్రాజ్య వైభవములను బొంది సుఖంబుగ నుండుము. నీవును నీ కుమారుఁడును

యీ భువిపై నెంతకాలము జీవింతురో యంతదనుక మీకు ముదిమి దెవులును లేక యుండురు. నీ కుమారుఁడు విద్యాసమేతుఁడైన వరకు నీ విచ్చోటనే యుండుము. భక్తవత్సలుఁడగు పరమశివుఁడు మిమ్ము లను రక్షించుచుండును. మరియు నేను యీ బాలకుఁడు భద్రయుతుం డగునట్లు దీవించుచు భద్రాయువని నామకరణమును జేయుచుంటిని" అని పలికి ఋషభయోగీశ్వరుఁడు తపోవనమునకుఁ జనెను.

## 10

### భద్రాయువు బాల్యము

ఇట్లు ఆ దాశార్ణవమహీపతి పత్నియగు సుమతీదేవి తనూభవ సమేతముగా ఋషభుని వలన ననుగ్రహింపఁబడి, వైశ్యపురమున సా దరమతియై యుండెను. ఆ బాలుఁడు నానాటికి ప్రాబల్య కళావిశేష పారీణుఁడై శ్రీబాలచంద్రుని కైవడి ధీర బలయుతుఁ డగుచు ఘన తేజముతో బెరుగుచుండెను ఆ రాజకుమారుని కచ్చట సమ వయ స్కుండగు పద్మాకరుని కుమారుండగు సునయుఁ డనువాఁడు సఖుండై నతిశయ మైత్రితో బెరఁగుచుండెను. మరియు నా వైశ్యరాజనందనులు కాంచనాంగద కుండల కంకణాది భూషణంబులు ధరించి పొత్తుఁ గూడి బాల్యక్రీడలను జోడుబాయకుండ మెలంగుచుండిరి. అంతట పద్మాక రుఁడు బాలకుల యోగ్యత్వంబును వీక్షించి, పండితశ్రేష్ఠులచే యథా విధిగ అక్షరాభ్యాసము చేయించి, గురుసన్నిధానమున నానా విద్యా భ్యాసము యొనరింపఁజేసెను.

ఇవ్విధముగ రాజపత్ని నిర్విచారముగ పదునారు వత్సరములు గడపెను. చిరతరకీర్తియుతుండును, శివయోగిచక్రవర్తియు నగు ఋషభ

మహామునీంద్రుఁడు యొకనాఁడు వైశ్యపురమున కరుదెంచెను. అంతట గురుభక్తిపూర్ణులగు వైశ్యరాజనందనులు ఆతనికి భయ భక్తి వినయ సంభ్రమములతో నమస్కరించి, తమ సదనమునకుఁ గొనిపోయిరి. అప్పుడు ఋషభుఁడు రాజకుమారునిఁగాంచి ప్రేమపూర్వకముగ మేను నిమురుచు "రాజకుమారా! నీకును నీ జననికిని క్షేమమే కదా? నీవు శూలిని యనుదినము ప్రార్థించుచుంటివి కదా? గురుజనులకు శుశ్రూషను గావించుచుంటివా? శ్రద్ధతో నాటకాలంకార మహాకావ్యాదుల నెల్ల పఠించితివా? ముసలి నగు నన్నెన్నఁడైన తలంచుచుందువా?" అని వాత్సల్యముతోఁ బలుక భద్రాయువు "మునికులతిలకా! భవదీయ కృపానుగ్రహముచే మేము సుఖంబుగ నుంటిమి. నేను తమ యొక్క ఆశీర్వచనముచే సకలశాస్త్రములు గ్రంథములు పఠించి విద్యాధనము నార్జించితిని. యోగీశ్వరా! ఇదియంతయు నీ యనుగ్రహాభిక్షయేగదా? కృపాంభోనిధివై విషప్రయోగము వలన విగతజీవుఁడనై యున్న నన్ను సజీవునిఁ జేసి నా తల్లికి పుత్రభిక్షను బెట్టితివి" అని ముద్దులొలుకు మృదువచనములతో నుడివెను. అంతట రాజపత్నియు యోగీంద్రునకు ప్రణమిల్లి "మహాత్మా! ఈ బాలకుఁడు యేమియును యెఱుఁగని పసివాఁడు. మరియు జనకబాంధవ విరహితుఁడు. గాన వీనిని మతిమంతుని గావించి సతిశయ కృప వెలయ మమ్ము నారయుమవలెను" అని పలికిన రాజపత్ని వాక్యంబులకు సంతసిల్లి మహామంతుఁడైన ఋషభయోగీంద్రుఁడా రాజనందనునకు సన్మార్గంబుపదేశించి కృతార్థుఁ జేయవలయునని మనంబున నిశ్చయించి, యకుమారు నుద్దేశించి "మహీపాల సందనా! నే సెప్పఁ డొనర్పఁబోవు యుపదేశమును శ్రద్ధాళుఁడవై వినుము. విద్యావంతుఁడవగు నీ వెన్నఁడును శ్రీగురుదేవుని హేళనమును జేయరాదు. పురాణ వేదశాస్త్రాగమ ధర్మములను విడువఁగూడదు. దేవతా నృపులయాజ్ఞను మీరరాదు. మృషలు వచింపరాదు. నిత్యము అభ్యా

గత పూజ లాచరించవలెను ఈ రీతిని నీవు మెలఁగితివేని జన్మము చేకూరును.

నీవు గురుగోను మహేశ్వరపూజాపరుఁడవై యెల్లప్పుడును వర్తింపుము పరధనమునకును పరసతులకును యాశను జెందవలదు. నిరంతరము సదాచారధర్మనియుక్తుఁడవగుచు సంచరింపుము స్నానజప హోమ తర్పణ దానములను, భక్తదేవతా గురుపూజా కార్యములను నిరసించుట తగదు. కోపమును, విద్వేషమును, దాపమును, నాక్రోశవృత్తిని, దంబమును, దురాలాపములను, లోభత్వమును, పాపసంభాషణములను ఓ భద్రగుణాఢ్యా! నీవు విడువుము. నిరంతరము యెడ తెగని విషయ లోలత్వము, సద్గుణులయందసూయ, పరహింస, ఆత్మస్తుతి, పరనింద యొనర్పవలదు. మరియు అత్యాహారము, మతిశ్రమ, అత్యాలాపము, అతిశయకోపము, దీర్ఘనిద్ర, అత్యాకాంక్ష మొదలగు చెడుగుణములను వీడుము.

సద్గుణులగు నీ జననీజనకుల విద్వాంసుల భాషణములను సన్మానించి, విశ్వాసముంచి, నిష్కపటముతో వాటిని నమ్మవలయును. కృపణులను, అనాథులను, వృద్ధులను, అపరాధహీనులను, బాలురను, అబలలను కృప వెలయునట్లు తపనీయాదికముల నైనను ధారఁబోసి దాక్షిణ్యముతో వారిని రక్షింపుము.

మరియు ఓ యనఘచరితా! బంధుమిత్రులయందు అభిమానమును, దుఃఖితులయందు కృపను, సజ్జనులందు హర్షమును గావింపుము. కుజనులను కోపదృష్టిచే వీక్షింపుము. శత్రువు శరణాగతుఁడైన వానిని జంపవలదు. ఎవ్వఁడైనను యాచించినయెడల లేదనక వానికి వలయున దిమ్ము. తలిదండ్రులు గురుఁడు సంపదుఁడు వీరశైవుఁడు యెద్దియైన యుపరాధ మాచరించిన నీ మనస్సునందే సహించి యుండుము ఆత్మరక్షారుఁడవై నప్రమత్తుఁడవై యుండుము.

ఓ ధీరవర్యా! మానవునకు కీర్తి యనునది మహాభూషణము వంటిది. మరియు నయ్యది లక్ష్మీకరంబైనదియు, శుభప్రదమైనదియు గావున కృతపుణ్యుఁడవై కీర్తిని తప్పక జేకొనుము. హయగజాశ్వహాటకంబులను అపహరించిన యెడల యీ ధాత్రిపై నపయశంబు చేకూరును గాన వాటిని తృణముగా దలఁచి నీ బుద్ధిని యటుప్రవేశింపనీయవలదు. గౌరీశంకరుల పాదభక్తులను, సంసారపయోనిధీ నిమగ్నులను, వారు ప్రసన్నులగునట్లు నారాధింతువేని, వారు నిన్ను దప్పక యుద్ధరింతురు. ఆయుర్బల ధనవిద్యాశ్రేయఃకీర్తులు, ప్రతాపశీలంబులు కర్మాయత్తముగ వచ్చినచో వాటిని బాయకుండ ననుభవింపుము. నీవు చేయఁబోవు కార్యములను దేశకాల శక్తులనుబట్టి దృఢమైన యోచనాపూర్వకముగ యాచరింతువేని నెచ్చోటనైనను మేలు జేకూరును. జపహోమములు, స్నానములు, తపములు, పితృకార్యములు చేయుట యందు చపలత్వముడిగి, కపటంబించుకైనను లేక దర్పరమతివై యొనరింపుము. దయతో గూడుకొన్నదియు, అల్పాక్షరమున అధికమైన యర్థము గలదియు, ధర్మయుక్తమైనదియు, మిక్కిలి రంజింపఁజేయునదియు, స్పష్టమైనదియు, శాస్త్రయుక్తమైనదియు మాటను జెప్పవలయును. ఆపదలందును, శత్రువ్యాపారములందును భీతిని జెందవలదు. కాని పాపములకును, గురుభక్త్యాలాపములకును వెరచియుండుము.

పరుల నెవ్వరినేనియు బాధింపవలదు. కరుణ వెలయునట్లు చోరదుష్టారి నివారణంబొనరింపుచు పరుల బాధల నడంపుము. బంధుమిత్ర జ్ఞాతి దారాసుతులకు భోజనమిడి యాదరించుటయందు సమబుద్ధి గలిగి యుండుము. విద్యా కథా ధర్మ విహిత వాక్యోపదేశములందు సతతము నిశ్చలుఁడవై యుండుము. సాధుశైవ భూయిష్టమై యుండునట్టియు, పుణ్యతీర్థములు గలట్టియు, శివనివాసంబులు చెలంగుచుండునట్టియు ప్రదేశంబులందు సంతోషపూర్వకంబుగ నిలువుము. కులటా

వేశ్యాకాముకు లుండు స్థలములకు నీ వెన్నఁడును పోవలదు. ఒకవేళ పోవుట తటస్థించిన నప్రశాంతముగ నలినాక్షుని హృదయమందు ధ్యానింపుము. శాంతి దాంతి శుచివ్రతధర్మములను, జితేంద్రియమును గలిగి వర్తింపుము.

మరియు ఓ రాజనందనా! యతులకును, వీరశైవులకును, పతివ్రతలకును, కామధేను వృషభరత్నములకును, పుణ్య తరు నదీ గృహ దేవతలకును వాలాయముగ వందన మాచరింపుము. అనుదినంబును భక్ష్య భోజ్య లేహ్య ఫల పుష్ప తాంబూల వస్త్ర భూషణాది వస్తు వితతిని శివసమర్పితంబుజేసి పిమ్మట నీవు అనుభవింపవలయును. భద్రాచారపరుఁడవై నిరంతరము బ్రాహ్మీముహుర్తంబున నిద్రాశక్తిని బరిత్యజించి శుచివై నిష్కల్మషత్వంబున రుద్రాణీరమణులను ధీరోదాత్త భావంబుతో చిత్తమునందు భజింపుము. నిర్వికల్పముగ అనుదినము నీ వాచరించు స్నాన దాన హోమ జపతపములు పూజలు ఫలాపేక్ష యుడిగి ఆచరింపుము. విహరణ భాషణ శ్రవణ వీక్షణ భోజనపాన దానసంగ్రహ శయన సమయములందు రాజకళాధురుఁడగు పార్వతీపతిని ప్రార్థించుట మరువవలదు.

ఓ విద్యాధరా! మంత్రరాజంబగు పంచాక్షరీ పాఠకులు, శైవాచార పారీణులు, ఈశ్వరభక్తులు, భసితత్రిపుండ్ర విలసత్ఫాలప్రదేశాంచితులు, గురురుద్రాక్ష మణిప్రదీప్త కరయుగ్మలాదిగాగల పూజ్యులైన పురుషశ్రేష్ఠులు భూతేశుని లోకమునందు నిల్చియుందురు" అని దీర్ఘముగ ఉపదేశించి "వత్సా! ఇవ్విధంబున ననేక పురాణములందు విస్తరింపఁబడిన ధర్మసంగ్రహంబులన్నియు సంక్షేపరూపంబున నీకుఁ దెలియ ననుగ్రహించితిని. ఇంక సమస్త పురాణ గుహ్యంబును, నశేష దోష హారణంబును, బరమపవిత్రంబును, సకలశుభప్రదంబును, సర్వాపన్నివారణంబును నగు శైవకవచంబు నుపదేశించెదము. భక్తిపూర్వక

ముగ నద్దానిని వినుము" అని ఋషభుఁడు భద్రాయువునకు చెప్పఁదొడఁగెను.

## 11

### భద్రాయువు శివకవచోపదేశంబును పొందుట

"ఓ పుణ్యాత్ముఁడా! శివనామధేయుఁడైన సదాశివునకు వందన మొనర్చి శివభక్తుఁడవగు నీకు శివకవచమును సంతోషస్వాంతుఁడనై యుపదేశించెదను. సావధానుఁడవై వినుము—ఏ మనుజుఁడైనను, పరాత్పరుఁడై జగమంతయును విభుఁడై వెలయుచున్న చేతోజాతహరుని మనంబును నిల్పి నిర్ధూతాంగుఁడై, జితేంద్రియుఁడై, జితక్రోధుఁడై లోకవిఖ్యాతంబైన షడక్షరమును జపించినంత మాత్రమున రక్షాన్వితుఁడు కాఁదగును

'ఘోరకష్టపరంపరల ననుభవింపుచు దైన్యపరీతవృత్తిని సంసార గభీర కూపమున సైరిభలీల చరించుచున్న నన్ను పరతత్వమయుండగు శంకరుఁడు కృతార్థునిగ జేయుఁగాక. మరియు తారకనామ మంత్రమును సహా జపించుటచే నస్మదాది దురితంబులనన్నిటిని నడంచుగావుత' అనియు, 'అణువులకెల్ల నణువైన యప్రమేయభావుఁడు. మరియు అధికములకెల్ల నధికుఁడైనట్టి విభుఁడు. జ్యోతిర్మయానందమునుకలుగఁజేయు ఘనుఁడైన యజుండును చిన్మయాత్ముండును నగు పరమేశ్వరుఁడు నన్ను రక్షించుగావుత.

ఏ పురుషుఁడు భూస్వరూపమును దాల్చి ప్రపంచంబునంతను తానే భరింపుచుండెనో, జలరూపుండగుచు నే సర్వజ్ఞుండు భూమిపై గల నరులకు సజీవనంబొనర్చుచుండెనో, కాలాగ్నిరూపుండై ఏ కల్పాంతకుఁడు అద్రిలోకములెల్ల దగ్ధముచేయునో, వాయురూపమున సర్వ

వ్యాప్తియై యెవ్వఁడు గగనాకృతిని బూర్ణుఁడగుచు వెలయుచుండెనో అట్టి లోకైకనాయకుఁడు అష్టమూర్తి సచ్చిదానందమయుఁడు వృషధ్వజుండు సలిలవాతాగ్ని బాధలనుండి నన్ను బొలియకుండ జిరకృపాదృష్టితో రక్షించుగావుత.

మరియు, ఆ పురుషాఖ్యుఁడు పూర్వభాగమున పరశుహస్తుఁడై తటిదగ్నివర్ణుండుగను, దక్షిణమున దక్షాధ్వరధ్వంసియై ఢక్కాక్షమాలాగ్నిని ధరించి ఘోరాకృతిని బొల్చువాఁడుగను, పశ్చిమమునందు శ్రీ సదాశివుఁడగు రాజశేఖరుఁడు అభవుండుగను, పార్శ్వమున మునివందితుఁడగు చతుర్ముఖుఁడగు త్రినేత్రుండుగను వామదేవుండుగను ఊర్ధ్వమున శూలపాణి శుభ్రదేహుఁడై యుగ్రవిక్రముండుగను జగమంతయు వ్యాపించియున్న పంచవక్త్రుండు నన్ను రక్షించుగాత!

శిరమునందు ఫాలనేత్రమును గలిగినట్టియు, శ్రవణములు జిహ్వయు గ్రీవములు కర వక్షోజ కంఠపార్శ్వములు దక్షఃకోశ కట్యూరులు చరణంబులు గలిగినట్టి ఈశ్వరుఁడు నన్ను లీలాగతిని రక్షించుగాత.

శూలాయుధుఁడు. గిరీశుఁడు కాలాంతకుఁడైన నీలకంఠుఁడు లాలిత కటాక్షలక్షితముఖుఁడై రాత్రింబవళ్లు నన్ను రక్షించుగాత.

చింతితఫలదుఁడును అగ్రగణ్యుఁడును నగు గౌరీకాంతుఁడు బాహ్యాభ్యంతర దేశంబుల నన్నంతటను అనవరతంబును రక్షించుగావుత.

నిలచియుండునప్పుడును, కూర్చొనియుండునప్పుడును, మేల్కొనియుండు వేళలందును, త్ర్యంబకుఁడగు అంబికారమణుఁడు నన్ను వేడ్కతో రక్షించుగాత.

మరియు నఖిల గిరిమధ్యమార్గంబులందు నీలకంఠుఁడును, మహారణ్య ప్రవాసంబులవలన త్రిపురాంతకుఁడైన మృగవ్యాధుండును, దుర్మతాఖిల శాత్రవ వ్యూహంబువలన భీషణాట్టహాస పరికంపిత బ్రహ్మాండాకారుండైన వీరభద్రుండును, కరితురగ రథ పదాతి సమేత బహుతర

యక్షౌహిణీ శతపతివృతుఁడైన యాతతాయి సమూహంబువలన ఖండ పరశుండైన మహాదేవుండును, చోరారిగణంబులవలన త్రిశూలధారుఁడైన యంధకాంతకుఁడును, సింహ వ్యాఘ్ర భల్లూక వరాహాది క్రూర మృగంబులవలన బినాకపాణియగు వామదేవుండును, దుష్టాదిష్ట విష మహోత్పాతవ్యాధులవలన జగధీశ్వరుండగు సాంబశివుండును నన్ను రక్షించుఁగాత'

అని పలికి మరియు నప్పరమేశ్వరు నుద్దేశించి 'శ్రీసాంబ సదాశివా సకలలోకైకనాయకా సకల జగదుత్పత్తి స్థితిలయకారణా చంద్ర కోటీరా భానుకోటి ప్రతీకాశా మృత్యుంజయా విరూపాక్షా వృషభ వాహనా నాగేంద్రభూషణా వ్యాఘ్ర చర్మాంబరధరా డమరుత్రిశూల ఖట్వాంగ గదా ప్రాస భిండివాల నరపాల పాశాంకుశాద్యాయుధ పరిశోభిత దీర్ఘ జార్గళా సర్వకాంబును మహా బలపరాక్రమ తేజఃకీర్తి సంపన్నుండ నగునట్లుగా ననుగ్రహించి రక్షింపుము. సర్వవిష బాధల నుపశమనంబు నొందింపుము. మదీయ చోరగుణంబుల మారణంబుగా విదళింపుము. కూష్మాండమారీగణ బ్రహ్మరాక్షస నివహంబులకు సంత్రాణంబు గావింపుము. క్షుత్తృష్ణాతురుండ నగు నన్ను నాప్యాయనంబు నొందజేయుము. దుఃఖార్తుండ నగు నన్ను ఆనందుఁడ నగు నట్లుగాఁ బ్రసాదింపుము. మరణభయంబువలన సంజీవితునిగా నొనర్పుము. నరక భయంబువలన నన్నుద్ధరింపుము. శివకవచంబున నన్ను నాచ్ఛాదింపుము. సదాశివుండవైన నీకు బహువందనంబులు గావింతును' అనుచు ననేకవిధంబుల ప్రార్థింపవలయును" అని చెప్పి ఋషభుండు మరియు "ఓ రాజనందనా! అతి రహస్యంబైన యీ కవచము నాచేతఁ గలితమయ్యెను. ఇయ్యది తాపత్రయంబును, దారుణాపదను దరిఁ జేరనీయదు. సకల సౌభాగ్యైక సామ్రాజ్యములకు ఆకరంబైనది. మరియు పశుపతి కారుణ్యభాజనంబైనది. ఎవ్వరైన నీ శైవకవచము నేకాగ్రచిత్తులై

హితముతో పఠింతురేని వారు శ్రీసాంబశివుని కృపారసమున నతిశయ వ్యాధీ మృత్యు భయంబులుడిగి చిరతరాయుష్కులగుచు లక్ష్మీకటాక్ష పాత్రులై బహుసౌఖ్యములను బడయఁగలరు. కావున భక్తిశ్రద్ధా ప్రావీణ్యము లొప్పునట్లుగ దీనిని పఠింపుము. అప్పుడు నీవు రాజార్హుఁడవై కైవల్యపదమును బొందఁగలవు" అని యానతిచ్చి ఉజ్జ్వలమైన కరుణతో రాజన్యునకు యోగీంద్రుఁడు మంత్రించి తనువుపై భస్మ లేపన మొనరించెను. అప్పు డా రాజనందనుఁడగు భద్రాయువునకు సాయమీంద్రుని కరుణచే ద్విగుణీకృత షట్సహస్ర దివ్య మదేభేంద్ర గరిష్ఠ బలము ప్రాప్తించెను. మరియు నిశిత భాగంబున నిరుపమానమైన కాంతితో వెలయుచున్న యొక చంద్రహాసమును, శంఖమును, సామతేయునకుఁ బ్రసన్నదృష్టియు నొసంగి హితము వెలయ "అఖిల నిగమ గుహ్యంబైన శైవకవచంబు నుపదేశించి నీకు వాత్సల్యంబున ఖడ్గ శంఖంబు లొసంగితిని గావున నృపకుమారా! తత్ప్రభావమును గూడ దెల్పెదను. ఈ మంత్రతపస్సభావితంబైనది. సునిశితధారమును సకలారి నిషూదనంబును నైయుండును. ఈ శంఖనాదంబు వినినంతనే పరిపంథి జనులు స్రస్తశస్త్రులును, విచేతనులును, మూర్ఛాగతులునై భూతల పతితులగుదురు. ఈ రెండు సాధనంబులవలనను పరసైన్య వినాశకములును స్వపక్షసైన్య తేజశ్శక్తివివర్ధనంబులు నైయుండును. నీవు యీ మహా శైవకవచమువలనను ఖడ్గశంఖప్రభావమునను ద్వాదశ సహస్ర నాగబలము వలనను భస్మధారణ సామర్థ్యంబువలనను శత్రు భూపతులను పరాజితులను గావించి పిత్రీయంబైన నీరాజ్యంబున కభిషిక్తుండవై యనేక సంవత్సరంబులు సామ్రాజ్యభోగంబుల ననుభవింపఁగలవు" అని యానతిచ్చి సమాతృకుండైన భద్రాయువునాశ్వాసించి మహానుభావుండైన ఋషభయోగీంద్రుఁడు నయ్యిరువురచేతను బూజితుండై యధేచ్ఛావిహారమున తపోవనికిఁ జనెను.

# 12

## భద్రాయు మాగధుల సమరము

అట్లు యోగీంద్రుని కృపవలన ధన్యులై సుమతీ భద్రాయువులు నద్రిజాకుమారులట్లు చెలువొంది విగతశోకులై వెలయుచుండిరి. ఇట్లుండ దశార్ణవ రాజ్యమందు వజ్రబాహుఁడు స్వరాజ్యంబును యప్రమాదంబుతో నేలుచుండెను. అంతట మగధదేశాధిపతి యగు హేమరథుండు ప్రచండబలగమును వెంటఁ బెట్టుకొని దశార్ణమును ముట్టడించెను. వారు రాజ్యమందుఁ జొరబడి పురములనుగాల్చి, కూపములను బూడ్చి, పేటలను దోచి, సౌధములను ధరఁ బడద్రోచి, భూరుహవితానములను బడలించి, గోధనోత్కరములను చెరఁబట్టి, భూప్రజలనెల్లర నతి వ్యధ నొందింపఁజేయుచుండిరి. అంతట వజ్రబాహుఁడు గొప్ప సైన్యమును జేకూర్చుకొని శత్రువు నెదుర్కొనెను. ఇట్లుభయ సైన్యంబులు దలపడి దేవాసుర యుద్ధంబున బోరాడుచుండిరి.

అసమాన పరాక్రమవంతుఁడగు వజ్రబాహుఁడు కోదండపాణియై రథముపై నెక్కి మగధేశుని కరి గంధర్వరథేగములు భగ్న మగునట్లుగ్ర దుస్సహతేజుండై బాణపరంపరలను యొక్కుమ్మడిగ గురిపించెను. అట్టి దుస్సహవిక్రముండగు వజ్రబాహుని దాడి కోడి మగధేశుఁడు నిజసైన్యసమేతముగ శత్రువును జుట్టుముట్టుకొని సేనానాయక సహితముగ యుద్ధమున విక్రమించెను. యుద్ధమునందు యుభయ కక్షుల యందును యోధు లనేకులు మడసిరి. రథములు ముగ్గెను. అశ్వములు నేలఁగూలెను. ఏనుగులు చెల్లాచెదరయ్యెను.

ఇట్లు ఘోరముగ బోరుచు వజ్రాయుధుఁడు రథ గజాశ్వ సారథి తతులను యోధాగ్రేసరులను గోల్పోయి శత్రువులకుఁ జిక్కి బంధితుఁ డయ్యెను. పిమ్మట మగధేశ్వరుఁడు నిర్భయముగ దుర్గమును బ్రవేశించి

యందు రాజభవనములను జొచ్చి భాండాగారమునందలి యనేక ధన కనక మణి భూషణాంబరములను, సువర్ణ రజిత గజదంత మయములైన సమస్త రాజద్రవ్యములను దన్మహిషి సమేతముగా నపహరించి నిజ నగరమున కేగుచున్న సమయమున నద్దేశంబంతయు నరాజకంబై అంతయు మగధ సైన్యశరిక్షుబ్ధంబయ్యెను. అంత బాల వృద్ధ వనితాజనములు భయాక్రందనం బొనరింపుచు, ప్రణష్ట ధనధాన్య పశుభూషణాంబరులై యథేచ్ఛగా దేశమును విడిచి జనుచుండిరి.

ఇవ్విధంబున మగధేశ్వరుఁడు దశార్ణవదేశంబంతయు నాక్రమించి దుస్థితికి దెచ్చిన వృత్తాంతము దేశంబంతయు వ్యాపించెను. అప్పుడు భద్రాయు విదంతయు నాలించినవాఁడై, రోషపూరిత మానసుఁడై జన్యాకాంక్షితోద్యుక్తుఁ డయ్యెను.

ప్రియజనని అనుమతిని బొంది భద్రాయువు గురుదత్తోచితమైన ఖడ్గ శంఖ ధరుండై శరసంపూర్ణనిషంగుఁడై, కవచియై, శౌర్య ప్రభావాఢ్యుఁడై వైశ్యనందనుని సారథిగాఁగొని ధరణీభాగము కంపమొందునట్లు దాశార్ణవమునకు సంగ్రామకాంక్షియై ప్రయాణమయ్యెను.

పూర్వము, ఖగపతి సుధావరణకాంక్షియై దేవేంద్రునిపై దాడి వెడలిన చాడ్పునను, పరశురాముఁడు కార్తవీర్యుని వధించుటకై వెడలిన విధమునను, మృగపతి కుంభికుంభముల మీఁదికి ద్రావాలు విధంబునను భద్రాయువు మగధపతిని జయింప నిజరాజ్యమునకు నరుదెంచెను. పిమ్మట దేశక్షోభనెల్లఁ గాంచి క్రోధ పరవశత్వమును జెంది, హటాత్తుగ శత్రుసేనపైఁ బడి వారిని చెల్లాచెదరు గావించి, మహావీరు లనేకులను దునిమెను. వారును బహువిధ దారుణ ఖడ్గాది శస్త్ర ధారాహతిచే నారాసుతు నొప్పించి తమ భుజా శౌర్యధైర్య సంపదలెల్ల వెలయునట్లు ఘోరముగ బోరాడిరి. శత్రువు లట్లు పోరుచుండినను భద్రాయువు భవ్యతరమైన శైవకవచప్రభావమువలన సంగరస్థలియందు

ధీరుఁడై సంచరించుచు హస్తిపగిది యస్త్రవర్షంబునెల్ల సైరించి, మాగధ కరితురగ పదాతిరథ నికాయంబులఁ ద్రుంచుచుండెను.

ఇవ్విధముగ మహాసంగ్రామమొనర్చుచుండిన యా రాజకుమారుని ధాటి శౌర్యంజాలక శాత్రవులు చతురంగబలంబులతో యొక్క పెట్టున దలపడిరి. అంతట నా జగజ్జెట్టియగు భద్రాయువు సక్రోధుండై శౌర్యోద్రేకంబున భుజంగంబులం గాంచిన విహంగవల్లభుని వలె వారలకు దాఁకి, కమలాకరంబునందు గేళిసలుపు కలభంబు చాడ్పున యామొగ్గరంబులోనికిఁ జొచ్చి, వివిధాస్త్రములను వారిపై బ్రయోగించి, శుష్కాటవిని దహించు దవానలము మాడ్కి శత్రువులను జర్ఝరీభూత శరీరులఁ గావించి బడలు పడజేయుచున్న సమయంబున గూలెడు తురంగంబులును, వ్రాలెడు మాతంగంబులును, గ్రుంగెడు శతాంగంబులును, నొరలెడి కాల్బలములును, ఖండీభూతములైన మస్తకంబులును, నికృత్తంబులైన కటికంఠ ప్రదేశములును, భగ్నములైన జానుజంఘులును, తెగిపడిన బాహువులును, శకలంబులైన సర్వావయవములును, దునియలైన దివ్యాయుధ విశేషములును, విభ్రష్టములైన భూషణవ్రాతంబులును, విచ్ఛిన్నంబులైన కేతన ఛత్రచామరంబులును, విశీర్ణంబులైన తనుత్రాణంబులును, విభిన్నంబులైన మురజ మృదంగ పటకాహాళ నిస్సాణాదికంబులును, వివర్ధమానంబులైన శోణీత నదీప్రవాహంబులును, విజృంభమాణంబులైన భూతభేతాళ కలకలారావంబులును గలిగి సంగ్రామరంగము అత్యంతభీకరముగ నుండెను.

ఇట్లున్నను మగధరాజు ప్రయుక్తంబున నెట్టకేలకు సైనికులు యొక్కుమ్మడి భద్రాయువును జుట్టుముట్టి యనేకవిధములైన శక్తిశూల పరశ్వధ భిండివాల గదాంకుశతోమర త్రిశిఖా ముసలాది సాధకముల నొప్పించిన, నతఁ డట్టహాసమును గావించి ఋషభయోగీంద్రుని తన మనమందు దలంచి, కరాళ మృత్యుజిహ్వాభీలంబును, మహోగ్రప్రభా

జాలంబును, ధగద్ధగాయమానంబును నైన కరవాలమును కేలంబట్టి ఝుళిపించెను. అయ్యది గాంచిన మాత్రమున శిఖిశిఖాజాలముదగ్గర కరగిన శలభముల విధమున బంచత్వమునొందువారును, వినమ్రభావమునుం జెంది పాదాక్రాంతు లగువారును, మహాభయభ్రాంతులై గంపము నొందువారును నై యున్న సమయంబున రాజకుమారుండు రోదసీకుహర పరిపూర్ణముగా శంఖధ్వానంబుం జేసిన దదీయ భీషణఘోషణా౦ బాలకించి యా మాగధులు మూర్ఛాగతులై రథిక సారథి సిపాదిసాది పదాతిసహితముగా బరిత్యక్తశస్త్రాస్త్రులై భూతలమున బడియున్న వారలం గని యతండు ధర్మశాస్త్రమర్మజ్ఞుండు గావున మృతప్రాయులు నిరాయుధులైన పురుషులు వధ్యులు గారని వారల విసర్జించి రణాంగణమున బద్ధుండై యున్న నిజజనకుని బంధవిముక్తుని గావించెను. పిదప దత్పత్నిని దత్ప్రధాన బంధుజన పురోహిత ప్రముఖ పౌర జానపద వర్గములను మరియు గోవృషాదికములను బంధనిర్ముక్తులనొందించి, విషాద వ్యాకులచిత్తులై యున్న వారల నందరను అత్యంత మధురాలాపముల ననునయించెను. అనంతరము దశార్ణవరాష్ట్రభంగంబు గావించిన యద్దురాత్ముల మానభంగంబుం జేయుట యుచితంబని నిశ్చయించి మగధేశ్వరుని బంధించెను.

పిమ్మట జనులెల్లరు నొంటరిగా నక్షౌహిణీ బలంబునెల్ల నేలం గూల్చి, తమ నుద్ధరించిన యా మహాబలునిం గాంచి, ఆశ్చర్యానందంబులనుం జెంది పలుతెరంగులం బొగడంజొచ్చిరి. అంతలో భద్రాయువు వజ్రబాహునిం జేరి వినయముతో మ్రొక్కెను. వజ్రబాహుండు భద్రాయువును లేవనెత్తి "ఓ యోధాగ్రేసరా! నీవు నిక్కముగ మాపాలిటి భాగ్యదేవతవు. వంటరిగ యక్షౌహిణిని యెదిరించుబలాన నీకు నీవేసాటి. అనఘా! నీ తలిదండ్రులెవరు? నీ దేశమెద్ది? మహావీరుండవగు నీవు ముల్లోకంబులను జయించగలవు. నీ పూర్వభవసుకృతానేక పుణ్యంబుల

నభినుతిం జేయు నా కలవిగాదు. నా పత్నులను, హితులను, నందను లను, రాజ్యంబును విడిచి నా చిత్తంబంతయు అతిశయ ప్రేమబాధకం బగుటం జేసి నీయందు నాటియున్నది" అని పలికెను. అప్పుడు భద్రా యువు నుదయుల్ల హర్ష బాష్పకణములను విడచుచు, గంభీర స్వర మున జనకునితో "నృపావతంసా! నన్ను భద్రాయువని పిలచెదరు. నేను యోగీశ్వరుండగు ఋషభుని ప్రియశిష్యుండను. నాకు సారథియై వచ్చిన యీ నా మిత్రుం డొక వైశ్యుండు. కొండొక కారణమున నా జననియు నేను చాలకాలమునుండి వీరి గృహమందుననే వసించుచుం టిమి. నా వృత్తాంతంబంతయు వినదలంచెద వేని మరియొకప్పుడు వచ్చిం తును. ప్రస్తుతము పోయివచ్చెదను. నే వచ్చుదనుక యీ మగధేశుని వారి యనుచరులను విడువవలదు" అని చెప్పి భద్రాయువు యుధేచ్ఛ గా వైశ్యనగరమునకుం జని మాతృదేవతకు మోదముం జేకూర్చెను.

## 13

### కీర్తిమాలినీ భద్రాయువుల వివాహము

దశార్ణవ క్షమాపాలుని యనుంగుసుతుని చండశౌర్యప్రభావం బును సైపలేకనో యన్నట్లు భానుండు చరమశైలంబుమాటునకు పలా యనముం జేసెను. మాగధు లాతనిం గూర్చి వ్యర్థముగ వర్ణించిన ఐశ్వర్యత్యాగాది అపయశమువలె ఆకాశభాగమున నలుదిశల నంధకార మలముకొనెను. దేవజ్యేష్ఠుండైన బ్రహ్మ మాంగు జరుగంబోవు వివాహ మహోత్సవమున కాకాశపాత్రను భద్రపరచిన ముత్యములవలె తార కలు మెరయుచుండెను. పూర్వభాగమున మన్మథుని మేనమామయు, పరమేశ్వరుని శిరోభూషణమును లక్ష్మీసోదరుండును, లోకరంజకుం డును, సూర్యసహోదరుండును, పాలసముద్రము ముద్దుసుతుండును,

తారకానాథుఁడు నగు చందమామ గగనమున యుదయించెను. ప్రపంచ మను సౌధాంతరమున తేజరిల్లుచున్న బంగారుకలశమో యన గగనలక్ష్మికి కర్ణకుండలములవలె చంద్రమండలము భాసుపించెను. భద్రాయువు యొక్క కీర్తి యనెడు సముద్రము వెల్లివిరిసి భూమినంతను ముంచివైచెనో యన చంద్రకాంతి భూమండలంబంతయు వ్యాపించెను. భూమియందంతయు నిశ్శబ్దముగ నుండెను.

అంతట వృషభధ్వజావతారుఁడగు ఋషభయోగీంద్రుఁడు నిషధాపురికి విచ్చేసి రాజమందిరమున బ్రవేశించెను. చంద్రాంగద మహీపాలుఁడా మునిశ్రేష్ఠునకెదురేగి యభివందనములఁ గావించి, యర్ఘ్యపాద్యాది విధులఁ బూజించి, కనకాసనంబున గూర్చుండ నియమించెను. పిమ్మట యోగీంద్రుఁడు చంద్రాంగదుని కుశల మారసి అనంతరమున "ఓ నైషధేశ్వరా! దాశార్ణపతికి భద్రాయువను కుమారుఁడు పట్టమహిషి గర్భంబున జనించెను. పిదప ఆ శిశువు నిజమాతృసహితంబుగా సవతి ప్రేరేపణచే జనకునిచే పరిత్యక్తుఁడై, యొక వైశ్య పురమున నుండెను. కొన్నిదినముల కా శిశువు విగతజీవుఁడై యుండ నేనా బాలుని సజీవునిఁజేసి, శైవధర్మం బుపదేశించి ధీమంతునిఁ జేసితిని. ఆతఁడు మాగధుని గెల్చి జయంబుఁ గాంచి జనకునకు రాజ్య మర్పించెను. అట్టి యా రాజాత్మజునకు నీ యనుఁగు పుత్రియగు కీర్తిమాలిని నిచ్చి సత్కీర్తి వెలయునట్లు వివాహము గావింపుము" అని యానతిచ్చి తా నరిగెను.

పిమ్మట చంద్రాంగదుఁడు నిజభార్యయగు సీమంతినీదేవియొక్క యనుమతిని బడసి దృఢనిశ్చయుండై సుఖనిద్రను జెందియుండెను.

ఉదయభాస్కరుఁడు తా నరుదెంచునట్లు జనుల కెరింగించుచుండెనో యనునట్లు నగారామ్రోత వినవచ్చెను. జారచోరుల గుండియలు

ఝల్లుమనునట్లుఁ 'గొక్కురోకో' యని గోళ్లు గూసెను. పద్మాకరంబుల బద్మములు వికసించెను. కమలములు ముడుచుకొనెను. పిల్లగాడ్పులు వీవఁజొచ్చెను. పక్షుల కలకలారావంబులు మించెను. చక్రవాకములకు సౌఖ్యముఁ జేకూరెను. వివిధ కాపోత హుంకృతులు మించెను. వత్సరంబు లంబారవములుఁ గావించుచుండెను. దేవాలయములందు ముదితలు భూపాళగౌళాది విదిత రాగగీతములు పాడఁజొచ్చిరి. వేద పాఠక రవంబులు వెలయుచుండెను. ప్రత్యూష మాయెను.

అంతట యజినాభిరతులౌ ద్రేతాగ్నులుప్రణయింప మునివర్యులు సాగిలి మ్రొక్కుచుండ, అధ్వన్యజనులు దేశాంతరంబులకేఁగ, హాలికులు కేదారంబులకు జనుచుండ, ఘూకరవంబులు కోటరంబులు జేర, చక్రవాకముల కుత్సవముదనర, బుష్పజాతులు పరిస్ఫుటములై వికసింప, సకలజీవులు సంతసమున బొదల, హల్లకారాతి పద్మినీ వల్లభుండు దేవవంద్యుఁడు భువనప్రదీపకుండైన భానుఁడు పూర్వ దిగ్భాగమున నుదయించెను.

అంత నిషధభూమండలాఖండలుఁడైన చంద్రాంగద నృపాలుఁడు బ్రాహ్మీముహూర్తమున మేల్కాంచి, మనంబునఁ బరమేశ్వరధ్యానం బొనర్చి అనంతరమున గాల్యకరణీయంబులు నిర్వర్తించి, వీరశైవసంఘములకు బహువిధముల దానములాచరించి, తదీయాశీర్వాదంబు గైకొని గురువందన మాచరించి, తదనుమతిఁ బడసి దివ్యాంబరాభరణాద్యలంకృత శరీరుఁడును, దత్తవదత్తతురంగారూఢుండై వందిమాగధ స్తవంబులాకర్ణింపుచు, నిజసందర్శనాగత పౌరజానపద వర్గంబుల నెడగలుగఁ జడియుచు, కంచుకీజనంబులు బరాబరులు గావింపుచు, ముందటనడువఁ జనుదెంచి మొగసాలను హయావతరణంబుఁ జేసి సభాస్థలమునకుఁజని యచ్చట సింహాసనాసీనుఁడై, సమస్తప్రధాన సామంత దండనాయక విద్వజ్జనహిత పురోహిత బాంధవ ప్రకృతిజనములు బరివేష్టించి బేరోల

గమున నుండి, యా రాత్రి ఋషభ యోగీంద్రుఁ డానతిచ్చిన వృత్తాంతంబంతయు సవిస్తరంబుగా వారల కెఱింగించి, తదనుమతంబున నా రాజనందనుఁ డోత్త్రేర సుచితజ్ఞులైన ప్రధానులను బిలచి శుభలేఖను లిఖించి వైశ్యానగరమున కనుపఁ బనిచెను.

రాజాజ్ఞను శిరంబునఁ దాల్చి మంత్రిసత్తములు సత్వరంబునఁ జని వైశ్యపురంబును జొచ్చి, నెమ్మనములు పల్లవింప నసమాన బలోజ్జ్వల తేజుండగు భద్రాయువునకు మ్రొక్కి భద్రలిఖితంబు నొసంగిరి.

అప్పుడు భద్రాయువు నిజజనసి సమక్షమున చంద్రాంగదుని లేఖ నిట్లు చదువఁ దొడఁగెను.

"శ్రీమత్సదాశివ శ్రీపాద రాజీవ మధుపాయమాన మానసస్వాంతనుండును, తక్షక నాగేంద్రదత్త ఖడ్గతురంగ భూషణాంబర జాత తోషణుండును నగు చంద్రాంగద రాజన్యచూడామణి, శ్రీయుతుండై ఋషభ దత్తోచితఖడ్గశంఖధరుండై మహావీర తేజోవిశాలుండైన భద్రాయువును ఆశీర్వదించి వృత్తాంతంబు వ్రాయించి బంపిన శుభలేఖార్థము—

రాజకుమారా! శివభక్తాగ్రగణ్యుఁడై తపోధనుఁడై కరుణార్ద్రహృదయుండగు ఋషభయోగీంద్రుఁడు తన రాకవలన మదీయ సౌధంబును పావనంబు గావించి మదీయ క్షేమంబెల్ల యూరసెను. క్రమ్మర భవదీయ వృత్తాంతంబెల్ల నెఱింగించి నా పేర్మిసుతయగు కీర్తిమాలినిచ్చి కూర్మివెలయ నీకిచ్చి మహావైభవముతో నుద్వాహమొనరింప నానతిచ్చి నన్ను ధన్యునిజేసెను. గావున నీవు వైశ్యపతిని భవదీయ జననిని సపరివారమును దోడ్కొనివచ్చి శుభముహూర్తమున మదీయ పుత్రికను పాణిగ్రహణ మొనర్చుకొనవలయును.

నిషధాపురము
శ్రావణశుద్ధ పంచమీ
బుధవారము

ఇట్లు
పరమేశ్వరపాదారవిందుఁడగు
చంద్రాంగదుఁడు

సుమతీదేవి మహానందమును జెంది విచ్చేసియుండిన ప్రధానుల పలుకు లాలించి వైశ్యపతి కెరిగించి వేశ్యతోఁ గనకభూషణ వస్త్ర గంధానులేపన సరసాన్నముల వారిని సత్కరించెను. వైశ్యపతి యగు పద్మాకరుఁడు అధికహర్షంబున యా రాజనందనుని యభినుతించి మంగళ స్నానంబు గావింపఁజేసి, దివ్యభూషణ దీప్త దేహుని జేసి, రథికునిగా నొనరించి, తూర్యములు మ్రోయ జననితోఁగూడ భద్రాయువును దోడ్కొనుచు నిజసతీ పుత్రికలతోఁ సపరివారముగ నిషధపురి కరుదెంచెను.

ఇవ్విధంబున నిషధపురమును బ్రవేశించిన దశార్ణవ రాజనందను నెదుర్కొని చంద్రాంగదుఁడు వారలకు సకల వస్తు పరిపూర్ణంబైన యొక్క నివేశనంబున విడియించి తత్పురం బతి సుందరముగ తోరణ మాలికాకృతంబులతోడను, కర్పూరగంధసార మృగమదమిశ్రిత సలిల సంసిక్తవిపణి మార్గ బహువిధ రంగవల్లీ విచిత్రతతులతోడను నలంకరింపఁజేసెను.

మరియు చంద్రాంగదుఁడు అత్యంతరయమున తన కూర్మి పట్టి యుద్వాహమునకుఁ గాశ్మీర కాంభోజ కర్ణాట దాశార్ణవ మాళవ మత్స్య మద్రపతులకు, గేకయ గాంధార కేరళ ఆంధ్రనేపాళ గౌళ చోళాది భూపాలకుల నతిమైత్రిని రప్పించి యాదరించి, వారి యనుమతిఁ బడసి దైవజ్ఞులను బిలచి, శుభముహూర్తంబునందు భద్రాయువునకు గౌరవప్రదముగ కన్యాదాన మొనరించెను.

సర్వ మంగళకరుణచే యీ జగతియందు దీర్ఘసుమంగళి వగుదువని భద్రాయువు మంగళసూత్రంబును నా వధూరత్న గళమునందుఁ గట్టెను. పిమ్మట లలితమగు మంత్రియములను దోయిళ్ళతుం ధునిచి హృష్టచిత్తము పెలయునట్లు వధూవరులు తలంబ్రాలు బోసికొనిరి. శంకరుని కారుణ్యము సకంటయు లణంగద్రొక్కి భూచక్రంబును నిరా

టంకముగ నేలుమని కీర్తిమాలిని తనప్రియుని కరమునకుఁ గంకణమును గట్టెను, అప్పుడు రాజశశాంకుఁడు అఖిల సామ్రాజ్యభోగంబు లనుభవించి యుర్వియందు వంశాభివృద్ధిగా వర్ధిల్లుమని కీర్తి వెలయునట్లు కీర్తిమాలిని కరమునకుఁ గంకణమును గట్టెను.

ఇట్లు వేదశాస్త్రయుక్తముగ నాట్యగానకళలతో, విందులతోఁ బరమోత్సాహమున దినచతుష్టయంబుఁ గడపి చంద్రాంగదుఁడు సకల దేశాధీశ్వరులను బిలిపించి వారల ననేక మణి భూషణాంబరాది సత్కారంబుల బూజింపుచున్న సమయంబున యా రాజన్యుని గనుఁగొని వజ్రబాహుఁడు "అనఘా! ఈ రాజకుమారుఁడు మున్నొకప్పుడు నా శత్రువుల ఉద్రేకము నడంచి నాకు ప్రాణసంరక్షణం బొనరించి రక్షించెను గాని యీ పుణ్యపురుషుని చరితం బాకింతయైనను యెఱుంగనైతిని గావున కరుణించి ఆ మహాయోధుని వంశంబును తలిదండ్రులను విఖ్యాతంబుగ దెలుపఁ గోరుచుంటిని" అని పలికెను.

అప్పుడు చంద్రాంగదుఁడు దరహాస్యుండై "నరేంద్రా! ఈతఁడు నీ నందనుఁడు. శైశవమున విషవ్రణ రోగపీడితుండై యుండి విషవ్రణ బాధాక్రాంతయగు తల్లియును దానును, దదీయ క్లేశము సహింపనోపక యున్న, నీచేతఁ బరిత్యక్తులగుచు, మహారణ్యంబునఁ బడి పోవుచుఁ, దెరువెఱుంగక, పరిభ్రమింపుచు నొక్కెడనెడఁ బూర్వజన్మకృత పుణ్య విశేషమున నొక వైశ్యపురంబుకు గని, యచ్చట నా వైశ్యనాథుని కృపచే యాతని భవనమునందు సురక్షితముగ నుండిరి. అంతట గతి పయి దినములకు నబ్బాలకుఁడు మృతుండైన నచ్చటికి దైవయోగంబున బుషభుండను శివయోగీంద్రుఁడు విచ్చేసి, యబ్బాలకుఁ గాంచి దయార్ద్రభావంబున గ్రమ్మర సజీవితుఁ జేసి, యమ్మాతృకుమారుల దేహంబులు దివ్యంబులగునట్లుగా ననుగ్రహించి బాలునకు భద్రాయువని నామకరణంబిడి చని, కొంతకాలమునకు నయోగ్యాగీంద్ర సార్వ

భావమునందు మరలఁ జనుదెంచి యకుమారుని బహుశ్రుతునిఁ గావించి యనంతరమున శైవ కవచక్రమం బుపదేశించి, సకల శత్రుభీకరములైన ఖడ్గశంఖంబు లొసఁగి పిమ్మట భస్మలేపనంబున ద్వాదశ సహస్ర నాగ బలమును గలుగునట్లు కటాక్షించి చనెను. కొన్ని దినములకు భవదీయ రాష్ట్రక్షోభవృత్తాంతమును విని భద్రాయువు యచ్చటికిఁజని, యస్మా గధుల నందరను బరాజితులఁ గావించెను. మిమ్మందర నుద్ధరించిన మహానుభావుఁడైన యిప్పురుషశ్రేష్ఠునకు మహాత్ముఁడైన ఋషభయో గీంద్రుని శాసనమున మదీయ పుత్రిక నొసఁగి పాణిగ్రహణము గావించి తిని. నీ విప్పు డిక్కుమారుని మాతృసహితముగా దోడ్కొని నిజ నగ రమునకుఁ జనుము. నీవు శ్రేయోవర్ధనుఁడవై సుఖము లనుభవింప గలవు" అని తన జామాత వృత్తాంతమును సవిస్తరముగ దెలియఁజెప్పి యాక్షణమున సుమనోగంధవిరాజమానయు, దాశార్ణవ భూభృత్సతి యు నగు సుమతీదేవిని బిలువఁబనిచెను. వజ్రబాహుఁడు తాను జేసిన దుష్కృతముల నెల్లఁ దలపోసి తన్నుదాను నిందించుకొని, యానంద బాష్పవశ్యుఁడై, పులకీకృతాంగ విస్ఫురితుండై తన యాత్మజుని ప్రేమతో కౌగిటఁజేర్చి కరుణతో దనపత్నిని గారవించెను.

# 14

## భద్రాయువు నిజనగరమునకుఁ జనుట

అనంతరము విమతేశ్వరునిచేఁ బూజితుండై వజ్రబాహుఁడు భార్యయుఁ దానును శృంగారభరితులగుచు కుమారునితోడను కోడలి తోడను రగణిత విలాసమున ఆత్మనగరమునకు విచ్చేసెను. అప్పుడు పురజను లెల్లరు కరువుదీర నేత్రానందమును బొందుచు మహావిక్రమ గుణాఢ్యుఁడును, యశఃకాముఁడును, పుణ్యపురుషుఁడును, యశఃస్కా

ముఁడును, శుభాచారుఁడు నగు భద్రాయువును కీర్తిమాలినిని సౌధాగ్ర భాగమునుండిఁ బరికించుచు వివిధరీతులఁ బొగడఁజొచ్చిరి. శివనామ స్మరణంబుతోడను, పురోహితుల ఆశీర్వాదనాదంబుతోడను, మాగధ వైతాళిక గాణిక్య గానంబుతోడను ప్రవిభాస్వత్కరదీపికలు వెలుఁగఁ దూర్యధ్వానములు మ్రోయ భవనప్రాంగణసీమయందు భార్యాసమేతుఁడై భద్రాయువు నిలచియుండెను. అంతట పుణ్యాంగనలు పుష్పాక్షతలతో సేసలుజల్లుచు, భాసురగీతములఁ బాడుచు, దంపతులను మందిరమునకుఁ గొనిపోయిరి.

ఇట్లు నిజశుద్ధాంతంబుఁ బ్రవేశించి యనంతరంబున గృహదేవతా ప్రార్థనంబును, వీరశైవ సమారాధనంబులును, దేవతామహోత్సవంబులును గావించి, సుహృద్బాంధవ జన సమేతముగా మధురాహారములు భుజించి, రాకాచంద్రబింబాస్య విభ్రముఁడగు నా భద్రాయువు నిజ ప్రమదారత్నమగు కీర్తిమాలి నిజకరాబ్జాతంబును చేబట్టి శుభముహూర్తంబున కేళికాభవనమును లీలాగతిని చొత్తెంచెను. అందు కవితా దర్పన తాళవృంతకనిసా కాశ్మీర కస్తూరికా ఫలపుష్పాక్షత గంధయుక్తమగు పూబాన్పునందుఁ గూర్చుండి రత్యలఘుప్రాభవులగు యువవధూవరులు సౌహార్ద్రంబు సంధిల్లునట్లు కామినీజనంబులవలన శృంగారింపఁబడిరి. పిమ్మట పుణ్యాంగనలు శ్రావ్యంబులెసఁగ మనోహరాలాపములఁ బాటలు బాడి మంగళహారతు లొసఁగి సకలజనులు వేడ్క సంఘటిల్ల భద్రముగ గవాటమును బంధించి వారి వారి సదనములకుఁ జనిరి.

స్మరసౌందర్యవిలాసుఁడగు భద్రాయువు అంత వివిధ శ్లాఘాల కన్యామణిని బరమప్రేమభవాప్తినో కౌఁగిటను సంభావించి, క్రీడించి కుచనేత్ర ద్వంద్వవస్త్రాది భాసుర శోభంబులఁ జుంబనంబొనరించి, సుఖాబ్ధి నోలలాడి, సమాగత శీతలపవనంబుల నాప్యాయనంబు నొంది తత్సార

వశ్యంబున సుఖసుప్తి జెందెను. ప్రభాతసమయంబునందు ప్రబోధనార్థం బుగా వంది మాగధ వైతాళికాది జనంబుల స్తోత్రపఠనారవంబుల వలనను, గజఘీంకారంబులవలనను, భేరీమృదంగాది వాద్యఘోషంబుల వలనను రాజకుమారుండు మేల్కాంచి శయనంబున నొక్కింత దడవు తన మనంబున పరమేశ్వరధ్యానంబొనరించి తదనంతరమునఁ గాల్యకరణీయంబు లాచరించి పితృమాతృ ప్రముఖ గురుజనంబులకును వీరశైవులకును ప్రణామంబులు గావించి, తదాశీర్వాదంబులు గైకొనుచు బరమాహ్లాదంబున సభామధ్యంబున కరుదెంచి జనకుని సన్నిధానంబున దేజంబుమెరయ నొక యున్నతాసనంబున గూర్చుండి తత్సమయోచితములగు రాచకార్యములను నిర్వర్తింపుచు, సకల ప్రకృతిజనంబులకు సంతోషం బొనరింపుచు, బాంధవజనంబులతో మైత్రి నెరపుచు దీనానాథ జనంబులకు వలసిన యర్థంబు లొసంగుచు, అతిథిసత్కారంబు లాచరింపుచు, యథేష్టభోగంబులనుభవింపుచు, నిజకళత్రసమేతంబుగా బరమానందంబున సుఖంబుగ నుండెను.

అంత నొకనాఁడు తన కారాగృహమందు బంధింపఁబడియున్న మగధేశ్వరుని బంధవిముక్తుని గావించి, సభాస్థలికిఁ దెచ్చి మధుర వ్యాహారపూర్వకంబుగా నీలగ్రీవ పదసాక్షికంబుగా నిర్భీతుఁగావించి, భూషణాలంకారములనిచ్చి, గౌరవప్రదముగా మగధదేశమునకు సాగనంపెను.

ఇవ్విధముగ యువరాజ్యము నేలుచు భద్రాయు వొక దినమున వైశ్యపురనాథుఁడగు పద్మాకరుని రావించి, బహుమణి ధన వస్త్ర వాహనములతో సత్కరించి తన కృతజ్ఞతను దెలియఁజెప్పెను.

ఇట్లు భద్రాయువు జనకుని యాజ్ఞఁ దప్పక సకలజనపూజ్యుఁడై ధైర్యశౌర్యములు గలిగి సమస్త విపక్షమండలిని దునుముచు, ధర్మమార్గంబున మెలఁగుచు, విక్రమశాలియై నిజాప్త మంత్రి సహితముగ నిర్విచారముగ నుండెను.

# 15

## భద్రాయువు పట్టభద్రుఁడగుట

భద్రాయువు తన పదునారవ వత్సరమునకు, బదపడి నిజ పురమును జేరి పదిరెండుసంవత్సరంబు లాయెను. శ్రీయుత దివ్యలక్షణుఁడును, శిష్టజనావనశీలుండును, అంబికానాయక పాదపద్మ భజనారతుఁడు నుజ్జ్వలతేజుండు నగు నిజకుమారునకు వజ్రబాహుఁడు దాశార్ణపును మహీసామ్రాజ్యధురంధరత్వంబునకు నభిషేకము చేయఁ దలఁచి, పురం బతి మనోహరముగా నలంకారముగావింపఁ దగువారల నియోగించి, కోసల, కేకయ, గాంధార, ఆంధ్ర, కాశ్మీర, విదర్భ, మద్ర, మగధ, మాలవ, మత్స్య, పాంచాలాది మహీపతులను, నిషధేశ్వరుఁడైన చంద్రాంగదుని రావించి, క్రమ్మర వైశ్యపతియైన పద్మాకరుని బిలిపించి, వారల యనుమతిఁ వడసి, బంధుమిత్రామాత్య పురోహిత వీరశైవ విద్వజ్జన కవిగాయక ప్రధాన సామంత దండనాయక ప్రముఖ నిఖిలజన బృందంబులు డెందంబుల నానందము నొందుచుండ, జతుస్సముద్రోదకములును, గంగాది మహాపుణ్యతీర్థములను సంగ్రహించి, గ్రహశాంతి యగునట్లుగా హోమంబు గావించెను.

పిమ్మట దైవజ్ఞ నిర్దిష్ట శుభముహూర్తమున భద్రాయువును గీర్తిమాలినీసమేతముగా నౌదుంబర భద్రపీఠంబున గూర్చుండ నియోగించి యాగమోక్తప్రకారంబున మహర్షిసత్తములను, గన్యకాష్టమును వీరశైవులను, క్షత్రియాది పౌరజనపదవర్గములను, సమస్తపరివారములను అభిషేకము లొనరింపఁజేసెను. అనంతరము మూర్ధాభిషిక్తుఁడైన యా రాజనందనుఁడు జాంబూనద పట్టభద్రఫాలభాగుండును, దివ్య దుకూలాంబరధారణుండును, మృగీమద సమ్మిశ్ర గంధసార విలేపిత దేహుఁడును, బహువిధ పుష్పమాలికాలంకృతుఁడును, హార కిరీట

కుండల కంకణాంగుళీయకనూపురాంగద గ్రైవేయాది సమస్తమణిస్థగిత సౌవర్ణభూషణ భూషితుండునునై త్రిలోకరాజ్యధురంధరుండగు మహేంద్రుని బోలె భాసమానుండగుచు నవాక్షౌహిణీబలసమన్వితుండగుచు, భేరీమృదంగ వేణువీణాప్రముఖ చతుర్విధ వాద్యధ్వనములు రోదసీకుహరాంతరాళము నిండి నలుదెసలం బిక్కటిల, భద్రగజారూఢుండై చంద్రమండల ప్రతీకాశంబైన శ్వేతచ్ఛత్రము శోభిల్ల, నిరుపార్శ్వంబుల విలాసవతీజనములు వింజామరములు వీవ, హయగజస్యందన భట సముత్తుంగములగు చతురంగములు పరివేష్టించి నడువ, గరదీపికా సహస్రములు వెలుంగ గంచుకీజనంబులు వేత్రహస్తులై సందడిజనములం జడియంద్రోయుచు ముందునడువ, ధన కనక వస్తువాహనాద్యుపాయన పాణులై సామంతరాజసంఘులు లెదుర్కొని ప్రణమిల్లుచుం జనుదేర, జగన్మోహనాకార విలాస విభ్రమములు మెరయ, వీరకామినీబృందము లెడనెడ నిలిచి, మంజీరకింకిణీస్వనంబులు చెలంగ, మాళవ వసంత సౌరాష్ట్ర ఘంటారవ భైరవ పున్నాగ ముఖారి నీలాంబరీ హిందోళప్రముఖ రాగంబులం బాడుచు, దాళక్రియామానంబులు దప్పకుండ నాట్యాభినయములతో నలుపుచుండ, బుణ్యాంగనామణులు సౌధాగ్రభాగములందుండి పుష్పలాజాక్షతములు సేసలు జల్లుచు జూచుచుండ వందిమాగధ బృందము లనేకవిధములం బ్రశంసింపుచు గైవారములు చేయ వాహ్యాళి వెడలి పరమోత్సవంబున పురవీథులందు ప్రదక్షిణముగా విచ్చేయుచు, ప్రతి గృహాంగణప్రదేశమందును నివాళిత నీరాజనంబులు గైకొనుచు, సకలజనమనోరంజనముగా మహోత్సవములో యూరేగెను. క్రమమ్మర భద్రాయువు సభాస్థానమునకుం జనుదెంచి రత్నసింహాసనాసీనుండై, విద్వజ్జనాశీర్వాదంబులు గైకొని వారల కనేక గో భూ హిరణ్యాది దానంబు లాచరించి సకలబంధుసమేతముగా మృష్టాన్నపానములు భుజించి కతిపయదినములకు దేశాంతరసమాగతులైన రాజులను

మణిభూషణాంబరవాజివారణాది బహుమానంబుల సంతృప్తులఁగావించి, పిమ్మట యథాస్థానంబులకుఁ బోనంబనిచెను. తదనంతరమున గొన్ని దినములకుఁ జంద్రాంగద పద్మాకరులను బ్రణయపూర్వకముగ నంద నాలింగనాది సత్కారములఁ బూజించి వారి వారి పురములకుఁ బోవు నట్లుగా ననుజ్ఞనొసంగెను.

అంత దేవీసహితముగ బరమానందమున రాజ్యపరిపాలనము జేయుచున్న నిజకుమారుండైన భద్రాయువును గాంచి వజ్రబాహుండు పరమాహ్లాదంబున సుఖంబుగ నుండెను. అంతట వజ్రబాహుండు ఆత్మ విజ్ఞానియై నిజపత్నీసహితుఁడై పుణ్యాశ్రమవనికిఁ జని ఘోరతపం బాచ రించి, కొంతకాలమునకు శివలోకమును జేరెను.

భద్రాయువు శరణాగతులకు నభయంబులొసంగుచు, వాపీ కూప తటాకారామ నిర్మాణ వివాహ దేవతాగృహ ప్రతిష్ఠాగ్రహారాది సమస్తధర్మంబు లాచరింపుచు, స్వరాష్ట్రంబునకు యీతిబాధలు లేకుండునట్లుగా భూపరిపాలనంబు గావింపుచు, నిజభార్యయైన కీర్తి మాలినితో సకలసామ్రాజ్యభోగంబుల ననుభవింపుచు, బరమానందం బున సుఖంబుగ నుండెను.

## 16

### మాయా దంపతులు

చంద్రమన్మథులకు స్నేహకారణమైనట్టియు, తుమ్మెదలయొక్క యు, శారికామయూర కోయిలలయొక్క శృంగారమైన కీర్తనచే దిక్కులు సహితము మారుమ్రోగించునట్టియు వసంతఋతువుఁ బ్రవే శించెను. వృక్షములన్నియు చిగిర్చెను. మల్లెలు బూచెను. మాలతీ

లతలు ప్రసవించెను. రాజోద్యాన వనములు పుష్పములతో హర్ష మొందింపఁజేయుచుండెను. గగనతలము నిర్మలముగ నుండెను.

అట్టి మనోహరంబైన యా వసంతఋతువునందు దాశార్హ మహీపాలుఁడు వేడుకతో నిజసతీసమేతుఁడై వనకేళి కరిగెను. అమ్మహీనాథుఁడు కాంతారములఁ దిరుగుచు, సహకార పనస కదళీ ఖర్జూర ద్రాక్షాది ఫలము లారగింపుచు, వాసంతీ మాలతీ కురవక కరవీరాది కుసుమగుచ్ఛంబులు విదళింపుచు, మధురఫల రసములు గ్రోలుచు, మకరందము లాస్వాదింపుచు, కృత్రిమశైలము లెక్కుచు, లతాగృహమ్ములఁ బ్రవేశింపుచు, గిరినిర్ఝరముల దోఁగుచు, సరోవరములఁ గ్రుంకుచు, తాపసాశ్రమములఁ గనుంగొనుచు, పుండరీక వేదండ గండక భల్లూక వరాహాది భీషణమృగముల ఖండింపుచు నిట్లనేక విధముల వనవిహారములు సలుపుచు నొక్కయొక శీతల తరుచ్ఛాయాతలమున కీర్తిమాలినీ సహితుండై విశ్రమించియుండెను.

అట్టి సమయంబున "ఓ మహారాజా! దయాస్వాంతా! ఓ నరనాథా! సత్వరము వచ్చి మమ్ము రక్షింపుము. రక్షింపుము. నాకై కోరలుగల బెబ్బులి వచ్చెను. వచ్చెను" అనుచు నొక వీరశైవుఁడు ఆక్రందన మొనర్చెను. అంత కృపారస ముప్పతిల్ల భద్రాయువు తన మున నస్త్రము సంధిల్లఁజేయునంతలో "ఓ పరమాత్మా! గంగాధరా! హా శివశంకరా! ఎచ్చటనుంటివి తండ్రీ" అని యేడ్చుచున్న యా వీరశైవుసతిని బట్టి బెబ్బులి పరుగిడఁజొచ్చెను. నృపుఁడు వానిపై ననేకము నిశితబాణములను వైచెను, గాని పులి యిసుమంతైనను చలించక బాణములను దప్పించుకొని దృష్టిపథమును దాటెను.

వీర:—హా సతీ! నన్ను వీడిపోయితివా! అహా! నీ వియోగంబును యేనెట్లు భరింతును! అయ్యో! సుఖసంభాషిణివే. మునివాటులయందున్నవే నిన్నెట్లు వీడియుందును. (అని విలపించుచున్న భద్రాయువును వీక్షించి)

రాజా! నీ గురుండగు శివయోగీంద్రుఁ డెచ్చటికేగెను? ఆతఁడు నీకు బోధించిన శైవధర్మంబు లేద్రోవఁజనెను? నీ ద్వాదశ సహస్ర వేదండ బల మే మాటఁగలసెను? నీ నిశిత ఖడ్గశంఖాదు లేమూలఁబడి బూజుఁ గట్టుచుండెను? నీ యస్త్రమంత్రాది విద్యాభ్యాసము యేమాయెను? నీ శౌర్య మేమయ్యెను? ఇన్నియునుగలిగి ఒక్క వనమృగమును జంపి నాభార్యను రక్షింపఁజాలవైతివి. నీ పౌరుషమెల్ల యిప్పుడు దేటపడెను. నిన్ను వజ్రబాహుని కొడుకనుటకు సిగ్గగుచుండెను. భీతులను యార్తులను దీనవ్రాతములను, యనాథజనులను వాత్సల్యముతోడను, ప్రీతితోడను బ్రోవఁజాలని భూకాంతుఁ డీ భూతలమున పూజ్యుఁడగునా? అట్టివాఁడు రాజ్యమును వీడి భైక్షవృత్తిని సంచరించుట మేలు. లేకయున్న విషమునుదినియైనను అగ్నినిబడియైనను జచ్చుట మేలు. శరణాగతుని బ్రోవఁజాలని భూవరుఁడు అధమాధముఁడు. మరియు వాఁడు చిరంజీవియౌటకన్న శీఘ్రగతిని జచ్చుటమేలు.

భద్రా:—(స్వగతము) మిత్రసమాన తేజులును, మేరుధరాధర ధీరులును, సుచారిత్రులును, నార్తరక్షణులును, కలుషౌఘ మల్లికా ధాత్రులు నైన మత్పితృపైతామహులు శైవభక్తాగ్రగణ్యులను బ్రోచి యశంబును గొనిరి. నేనట్టి పుణ్యమును గట్టుకొనఁజాలక తుదకు అపకీర్తికిఁ బాల్పడితిని. యోచించిజూచిన యీ మహానుభావుఁడు దివ్య తపోధనుని వలె నా కంటికిఁ గానబడుచుండెను. మరియు నీతఁడు యుదగ్ర తేజుఁడు. ఈ మహాత్ముఁడు తన తాపసాకృతిని సంహరించి సాత్వికమును వహింప వాంఛితార్థము లెవ్వియైన నొసంగెదను. (అని నిశ్చయించి యాతనినిఁ జేరి మోము వెలవెల బార యాతని చరణములకు సాగిలిమ్రొక్కి, యత్యంత వినయముతో ప్రకాశముగ) మహాత్మా! ఇయ్యది నారాజ్యము. ఈ యంగనామణి నా యర్ధాంగి. ఇయ్యది నా శరీరము. వీటియందు నీ కిష్టమైనది చేకొని నన్ను క్షమిం

పుము. నేను పరతంత్రుఁడను. క్షేత్రబంధువర్గము గలవాఁడను. నా యపరాధమును మన్నింపవేఁడెదను.

వీర:—భూవరా! కాంతావిహీనుఁడ నగు నాకు పలయున దెద్ది? ఈ ధరపై కాంతావిహీనుఁడ నను నపవాదము తొలంగునట్లు ధర్మస్థితిని నీ భార్యనిచ్చి నన్ను సంతృప్తిబరపుము.

భద్రా:—మహాశయా! మీకుఁ దెలియని ధర్మశాస్త్రము లెందును లేవు. పరాంగనలను వరించుట ధర్మదూష్యము కాదా? విశే షించి మీరు పరమశివభక్తశిఖామణులు. మరియు నీ ధరణియందు దాత లనేకులు గలరు. వారు గజ హయ రాజ్య వస్త్ర మణి కాంచ నములను, నిజదేహములను యర్పించియుండిరి గాని యిట్లు నిజాంగన నిచ్చుట యెందైన గలదే? మరియు యోచించిన యీ మహీస్థలి యందు పరభామాసక్తు లెట్టి నిష్కృతులకు లోనైరో తమకే దెలియ గలదు. సురపతి పూర్వము పరవనితాపరుఁడై యెట్లయ్యెనో దమకే దెలియును.

వీర:—ఓయీ! పంచమహాపాతకంబు లన్నియు నా తపో మహిమచే నశింపఁబడును. అవి నన్నంటఁజాలవు. గావున నీవు మారు మాటాడక నిశ్చయముగ నీ సతీమణిని నా కర్పించుము. అట్లు గాదేని శరణాగతులను బ్రోవనేరని కలుషంబు నిన్ను పీడించును.

భద్రా:—(స్వగతము) ఆహా! పరమేశ్వరా! ఏ నిప్పుడు చేయున దెద్ది? ధైర్యం బవలంబించి పాపనాశనమునకై యీ వీరశైవునకు మదర్ధభూటి యగు కీర్తిమాలి నొసఁగి, యపయశంబు దొలఁగ నగ్నియందుఁ బ్రవేశించుట మేలు. అదియే నిశ్చయము. (ప్రకాశముగ) మహాత్మా! భవదీయాజ్ఞానుసారముగ నా నిజపత్నిని మీ కర్పించి పాపవిముక్తుఁడ నయ్యెదను!

అని బలికి భద్రాయువు స్నానాది విహితానుష్ఠానంబు లొనరించి మానసంబునందు గురుధ్యానంబు గావించి ప్రీతితో వివిధదానము లాచరించెను. పిమ్మట శౌర్యాచార్యగుణాఢ్యుండును, వినుతక్ష్మాపాల నాగావళీ హార్యక్షుండును నగు యా వజ్రబాహునందనుఁడు విబుధులు నుతింప జలధారాపూర్వమానట్లుగ పత్నీదానమును యా వీరశైవున కొనరించెను.

అట్లు దానమిచ్చి అగ్నిని బ్రజ్వలింపఁజేసి భద్రాయువు వినతుండై ప్రదక్షిణంబు లొనర్చి యుండు జొరబోవు సమయమున నవసుధా ధవళ వర్ణంబుతోడను, కుండలీకృత మహాకుండలంబులతోడను, డమరు త్రిశూల హస్తములతోడను, ఆకాశగంగ వలె స్వచ్ఛమైన శంఖము తోడను, రమ్యమగు వ్యాఘ్రచర్మాంబరముతోడను, చంద్రపాండుర వృషభేంద్రయానముతోడను, శరవిరాజన్మృగాంకంబుతోడను, నారదాదులు సామగానంబులు జేయఁ బ్రమథగణములు సేవింప, భద్రయశుండును, సకలసుర చక్రవర్తియు నగు శ్రీ సాంబశివుఁడు పార్వతీ సమేతుండై ప్రత్యక్షమయ్యెను.

దేవతలు పుష్పవర్షమును గురిపించిరి. భేరికామృదంగవాయిద్యములను మ్రోయించిరి. దిక్కులన్నియు కోటిసూర్యప్రభతో విరాజిల్లుచుండెను. అప్పుడు కృపాళుఁడగు శంకరుఁడు నిర్నిద్రానలాభిముఖుఁడగు భద్రాయువు పాణితలమును బట్టి మరల్చెను. అయ్యవసరంబున నింద్రాది లోకపాలకులును, నారదాది దేవర్షులును, సనక సనందనాది పురాణయోగీంద్రులును, కపిలాదిసిద్ధులును, చిత్రరథాదిగంధర్వులును, బ్రహ్మాదిదేవతలును, మాణిభద్రాది యక్షులును, రంభాద్యప్సరోగణంబులును, నందీశ్వర భృంగీశ్వర చండీశ్వరాది ప్రమథగణంబులును, విఘ్నేశ్వర కుమార వీరభద్రాది పుత్రవర్గమును జనుదెంచెను. అంత సభామధ్యంబున విరాజిల్లుచున్న జగదీశ్వరుండైన యంబికారమణునకు

అత్యంత హర్షాశ్రుమిళిత నేత్రుండును పులకీకృతగాత్రుండును నై భద్రా యువు సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి, పాణిపంకజంబులు ముకుళించి, వేదవేదాంతాభిప్రాయక ధనంబులుగా నిట్లు స్తుతించెను.

దండకము

శ్రీశైల రాజకన్యా కన్యాకా మనఃపద్మసంచార హంసాసురోత్తంస దక్షాధ్వర ధ్వంస గంగాతరంగాంబురంజజ్జటాభార హాలాహలాహార కర్పూర గౌరాస్ఫటిక్ద్ధార నీహారవాణీకరశ్చంద్ర చంద్రాతపస్వచ్ఛకీర్తి విస్తార సద్భక్తమందార శర్వామహాదేవ మృత్యుంజయా నీలకంఠావిరూపాక్షా కోట్యర్కసంకాశ తేజా బిడౌజప్రధానామరస్తూయమానాంఘ్రి పంకేజగౌరాడ్ధ్వజా సామదేవా శివా శంకరా కామసంహార కాలాంతకా వ్యాఘ్రచర్మాంబరా భూతిలిప్తాంగ రుద్రాక్షమాలాధరా శక్తిశూలాసిఖట్వాంగహస్తా సమస్తాత్మ విధ్వస్త లోకప్రశస్తా వియుత్కేశ భూతేశ విశ్వేశ్వరా శాశ్వతైశ్వర్య సుధాకరా దేవదేవా జగద్రక్ష యుష్మత్ప్రభావంబు వర్ణింప బ్రహ్మాదులుం నేర రెంతవాఁడ నినుంగొల్వ నో చంద్రకోటీర దేవా జగజ్జాల నిర్మాణ సంరక్షణాలంచికేళి న్విజృంభించి వర్తింతు నెల్లప్పుడున్ మాలతీమాధవీ మల్లికాకుంద మందార సౌగంధికాంభోజ పున్నాగ సీమంతికా ద్రోణ పుష్పంబులర్పించి భక్తిన్ భవత్పూజ గావించి సేవించు సర్త్యాళికిన్ మందిరద్వారభూమిన్ హయాందోళికావారణస్యందనంబుల్ జగన్మోహనాకారలై చంద్రబింబాస్యలై యున్న కాంతామణు లనంతతాఖండలాఖండ సామ్రాజ్యముల్ చెందు నత్యంబున న్ముక్తిసిద్ధించి ధాత్రీజలవ్యోమ వాతాగ్నులున్ సోమ సూర్యాది భాస్వద్గ్రహానీకముల్ దారలున్ జంగమస్థావరాత్మ ప్రపంచంబునున్నీవయై యుండు వో భక్తమందార పూరంబునం ధారుణీస్యందనంబున్ జతుర్వేద ఘోటంబులుం బద్మదక్షత్త యున్మేరు కోదండమున్విష్ణుకాండంబు శోభిల్లగా త్రైపురావాస దైతేయులంద్రుంచి సంవర్త

కాలానలా భీలమైనట్టి హాలాహలజ్వాలలఁ బ్రింగి శార్దూల దైత్యుని వ్రిదారించి లోకంబులఁ బ్రోచి రక్షించుదేవుండ వీ వెన్నఁగా దీనచింతామణీ దైవచూడామణీ వేదవేదాంతవేద్యా భవవ్యాధివైద్యా శుకవ్యాస కౌండిన్య మాండవ్య సాండిల్య మైత్రేయ కణ్వాదియోగీంద్రు లెల్లప్పుడుఁ మిమ్ము హృత్పద్మమధ్యంబులన్నిల్పి యష్టాంగయోగంబుల ధ్యానము ల్చేసి దర్శింపగానోపకున్నట్టి శ్రీదక్షిణామూర్తి సచ్చిదానందమూర్తి కృపాస్ఫూర్తిఁ నేనెంతవాఁడ న్నిమ్ముం సన్నుతుల్ చేయ విజ్ఞానహీనుండ నన్నుం గటాక్షించి తప్పులు సైచి మన్నించు మాపన్నరక్షావిచక్షా జగత్రాణదీక్షా లలాటాక్ష కైలాసవాసా సుహాసోల్లాస తాపత్రయత్రాన ధ్వాంతమితోద్యాన చైతామిత్ర బ్రహ్మస్వరూపా త్రిలోకప్రదీపా నమస్తే నమస్తే నమః.

ఉ॥ నీనుతిచేయ నా తరమె నిర్మలబుద్ధివిహీనుడ న్మహా
జ్ఞానుఁడ బ్రాకృతుంత నపచారపరుండను దేవ నీవ వా
ఙ్మానసగోచరుండ ననమానుడ వాద్యుడనద్వయుండ దా
త్మానుగునైకరూపుడ వనాదివతీంద్రియ మూర్తి వెన్నగన్॥

గీ॥ నిర్గుణుండవీవు నిష్కారణుండవు
నిర్వికల్పమతివి నిర్మలుఁడవు
నిగమగోచరుఁడవు నిస్సంశయుండవు
నిన్ను దెలియ దరమె నిటలనేత్ర!

అని ప్రార్థనమును గావించి మరియు "ఓ దేవా! నీవు ప్రధాన పురుషుండవు. సచ్చిదానందవిగ్రహుండవు. స్వయంప్రకాశుండవు. జగత్కారణుండవు. జగదంతరాత్మవు. ఆదిమధ్యాంతరహితుండవు. సత్యజ్ఞానమయుండవు. సర్వజ్ఞుండవు. విశ్వస్వరూపుండవు. విద్వత్తమోహసుండవు. క్షేత్రజ్ఞుండవు. సర్వసాక్షివి. నిర్వికల్పుండవు. నిరంజనుండవు. సదాశివుండవు నైన మిమ్మెరింగి వర్తింప నతి మూఢ హృద

యుండనగు నాకు శక్యంబగునే? అట్లుగావున నాకు దోచినచందంబునఁ బ్రార్థించి ప్రణాముంబు లాచరించెదను. దీనవత్సలుఁడ వైన నన్ను రక్షింపుము" అని నుతించెను. అంత టా నృపుని గనుఁగొని శంకరుఁడు "ఓ జనవల్లభా! నీ సద్భక్తికి మెచ్చితిని. నీవు పుణ్యకీర్తివి. నీ మానసము దొందిక తెలియఁజూడ నేను మాయా వీరశైవునిగను, పార్వతి వట్టి మాయాబెబ్బులివలెను రూపమును దాల్చి వచ్చియుంటిమి. నీ వినయత్వమునకును, ధైర్యమునకును మెచ్చితిని మాకు వలయు కోర్కెలను గోరుకొనుఁడు" అని బలికెను.

"భక్తవత్సలా! నా ప్రియసఖియగు కీర్తిమాలికిని నాకును కృపతో ముక్తినొసంగుము. నా తలిదండ్రులకును, వైశ్యనాథుఁడగు పద్మాకరునకును, వాని సతీసుతులకును ముక్తిని జేకూర్పుము" అని భద్రాయువు గోరెను. పిమ్మట కీర్తిమాలి తన తండ్రియగు చంద్రాంగదునకును, తల్లియగు సీమంతినీదేవికిని కైవల్యప్రాప్తి గలుగునట్లు వరమును గోరెను. అంత శంకరుఁడు ఆ వధూవరుల వాక్యంబు లనుమర్థించి యత్యంతప్రేమతో వారి వాంఛితము లుత్సాహంబుతో నిచ్చి, పదివేల వత్సరములు సతీసమేతముగా శ్రీసముల్లాసిరై రాజ్యమును పాలించునట్లు దీవించి, సమస్తాదిత్యవర్గంబుతో గిరిజాతాన్వితుఁడై అంతర్ధానము జెందెను.

బ్రహ్మేంద్రాది దేవతలకుఁ బడయరాని సాంబశివప్రసాదంబు వడసి, వరములంది, క్రమ్మర నిజపురమున కరిగి భద్రాయువు నిష్కంటకంబుగా నిజరాజ్యంబేలుచు, రంగమేధాది మహాక్రతువులాచరింపుచు, బరమేశ్వరసమారాధనము లొనర్చుచు, నిజభార్యాసహితుఁడై నభీష్ట భోగంబు లనుభవింపుచు, వంశకరులైన పుత్రులంబడసి పరమాహ్లాదంబున సుఖంబుగ జీవితమును గడపుచుండెను. మరియుఁ దాశార్ణవ రాజ్యమందు సమయోచితముగ బర్జన్యుండు వర్షించుచుండెను. పంటలు

సమృద్ధిగ బండుచుండెను. వర్ణాశ్రమాచార వర్తనము దప్పక ఆచరించుచు దైవభక్తి గలిగి సకలజనులు సుఖంబుగ నుండిరి. ఉద్యాన వనములు ఫలపుష్ప కోరక పల్లవాన్వితములై యలరుచుండెను. గోవులు క్షీరము నభివృద్ధిగ నిచ్చుచుండెను. ప్రజలు సౌభాగ్య సంపన్నులైరి. ధాత్రీతలమం దెచ్చటను యీతిబాధలు లేవు. దేవగృహములు మిక్కిలి తేజరిల్లుచుండెను.

ఇవ్విధముగ విరాజిల్లుచున్న రాజ్యమును నృపచంద్రుఁడగు భద్రాయువు బహువర్షంబులు ప్రజాపాలనం బొనరించి, యనంతరమున నిజనందనునకు బట్టముగట్టి, సకల మహీరాజ్యభార దురంధరుఁగావించి కీర్తిమాలినీ సమేతుండై వానప్రస్థాశ్రమవిధానంబునకుఁజని బరమేశ్వరు నుద్దేశించి మహాఘోరతపం బాచరించి దేహంబులు విసర్జించి దివ్య విమానారూఢులై సిద్ధగంధర్వ విద్యాధరాదులు జయ జయ శబ్దంబుల బ్రశంసింప శివలోకమునకుఁ జని సాయుజ్యము నొందిరి.





శుభమస్తు

# బ్రహ్మోత్తర ఖండము



## తృతీయ భాగము



### వామదేవ మహర్షి

"చ॥ శివచరణారవిందములు చిత్తమునన్ భజియింపుచుండు డీ
భువనగణేశునిం దలచి భూతిలలాటమునం ధరింపు డీ
సవనవిరోధికీర్తనము సమ్మతిఁ జేయుడు సర్వకాలముం
దివిజమునీంద్రులార జననీస్తనదుగ్ధము లానరెన్నఁడున్"

అశేషపురాణకథాకథనదక్షుండైన సూతుండు శౌనకాది మహామునులను విలోకించి "మహాశయులారా! ఋషభయోగీంద్రుని మహాత్మ్యము నింతదనుక వినియుంటిరి. ఇఁక నుద్దామ తపోబలాఢ్యుఁడును, సదాశివతుల్యుఁడును, మహితప్రభావుఁడును నగు వామదేవుని చరిత్రము జెప్పుచు విభూతి మహాత్మ్యమునుగూర్చియు చెప్పెద నాలింపుఁడు" అని పలికి కథనమునకు ప్రవేశించెను.

పూర్వము వామదేవుఁడను మహాతపోధనుఁడు గలఁడు. అతఁడు బహుశాంతుఁడు. భస్మవిలేపితాంగుఁడు. శుద్ధపిశంగజటాకలాపుఁడు.

మరియు బరశివతత్త్వవేదియు, సైకపరిగ్రహాజీవనుండు నై జగదాదర ణోత్సుక మానసంబున ధరపై జరియింపుచుండెను.

ఇట్లు భూతలంబెల్ల గలయ గ్రుమ్మరుచు నొక్కనాడు ఆ మునీంద్రుడు శివపంచాక్షరిని జపించుచు, గ్రౌంచారణ్యపథంబున సంచారము జేయుచుండెను. అంతట యద్భుతాకారమును దాల్చి, రూక్షకేశుండై, అతి ఘోరవీక్షణములు గలిగి, అధిక క్షుధాతురుండగు నొక బ్రహ్మరాక్షసుడు వాయుజవమున జనుదెంచి, వామదేవుని భక్షింప నుంకించుచుండెను. అప్పు డా యోగీంద్రుడు అత్యుగ్రమదోన్మత్తుడగు రక్కసునిం గాంచి చిత్తంబున భయ మిసుమంతైన జెందక నిశ్చలచిత్తుడై యుండెను. అట్లు నిర్భయుడై యున్న యమ్మహాత్ముని మ్రింగ దలంపుతో నా రక్కసుడు మీది కురికి తన బాహువులుసాచి బిగియబట్టెను. పరశు చింతామణి స్పర్శంబుచే ఇనుము అతి శుద్ధ కాంచనంబైనట్లును, మానస సరస్సునందు మునిగి వాయసము రాజహంసమైన చందమునను, అమృతపానమును జేసి మానవుడు దేవత్వము జెందినట్లు నమ్మహాత్ముని దివ్యదేహము సోకినంతనే రక్కసుడు దురిత బంధనము లన్నియు దొలగద్రోచి నిర్మలజ్ఞాన హృదయుడై నిలిచెను. తాపసోత్తమునియందు లగ్నమైన మనస్సుగలవా డగుటచే సహజమైన తన బుద్ధిమాంద్యమును వీడి జ్ఞానసంపన్నుడై, ఆ మునివరునకు సాష్టాంగవందనం బాచరించి "మహాత్మా! నన్ను కరుణింపుము. దురితాబ్ధినిమగ్నుడ నగు నన్ను దరిజేర్చి రక్షింపుము. నేను సర్వప్రాణి భయంకరుడనై ఘోరరూపమును దాల్చి క్షుత్పిపాసార్తుడనై, గర్వాంధుడనై, దుర్గారణ్యసంచారుడనై, దుష్కర్మశీలుండనై, బ్రహ్మరాక్షసుడనై జీవితమును గడపితిని. ఓ యుర్వీదేవ కులావతంసా! భవదీయ సందర్శనంబునం జేసి మదీయచిత్తము పరిపూర్ణముగ పవిత్రమును జెందెను. ఈ దాసుని యుద్ధరింపుము" అని ప్రార్థిం

చెను. అంత నా మునీంద్రుఁడు కరుణాంతరంగుఁడై ఆ రక్కసుని దన వృత్తాంతము నెల్ల సవిస్తరముగ బలుకమనెను. రాక్షసుఁడు వినయ వినిర్మితుండై "మునీంద్రా! కొన్నిజన్మములకు బూర్వము యీ వన రాష్ట్రమును మహారాజసముతో నేలుచుంటిని. నేను దుర్మార్గుఁడనై మదించి యథేచ్ఛావిహారమును సల్పుచు దినంబున కొక్కపడతిఁ గొని వచ్చి సౌఖ్యము ననుభవించి యొకగృహమున వారి నరిగట్టుచుంటిని. వారిలో ద్విజరాజన్యపుళింద బ్రాహ్మణశూద్రానేకజాతుల స్త్రీలుంగలరు. ఇట్లాచరించినను నా చిత్తమునకుఁ దృప్తి గలుగదయ్యెను. ఈరీతిగ నేను దారుణ కామాభిలాషినై తుదకు ఘోరరోగములకుఁ బాల్పడి తిని. శరీరపటుత్వము మానసపటుత్వముకూడ తగ్గుచువచ్చెను. అంతట శత్రుపీడితుఁడనై, యనపత్యుఁడనై, దుర్మాయాక్రాంతుఁడనై, విముక్త బలగర్వితుఁడనై, నిజ బంధుమిత్ర సామంత వివర్జితుఁడనై కొంతకాల మునకు శరీరమును పరిత్యజించితిని. కృతాంతు కింకరులు నన్నుఁ గొనిపోయి రేతఃకుండీనరకంబున బడద్రోచిన నందు బదివేల సంవత్స రములు రేతఃపానంబు గావించుచు, గింకర బాధితుండనై యుండి, యనం తరము బాపావశేషంబున గ్రమ్మర నిశానంబైన వనంబున బిశాచత్వం బుననుండి, క్షుత్తృష్ణాసమాకులుండనై దివ్యవర్ష శతంబులుండి, యనం తరము ద్వితీయభవంబున సకలప్రాణిభయంకరంబైన వ్యాఘ్రంబునై జన్మించితిని. మరియు క్రమంబుగ దృతీయభవంబున ఘోరమైన సర్ప ముగను, జతుర్థభవంబున వృకంబుగను, వంచమభవంబున వరాహంబు గను, షష్ఠభవంబున గృకలాపంబుగను, సప్తమజన్మంబున సృగాలంబు గను, అష్టమజన్మంబున మృగంబుగను, నవమజన్మంబున గజముగను, దశమజన్మంబున నివ్వనమున బ్రహ్మరాక్షసుఁడనై జన్మించి క్షుదార్తుం డనై యుండి మిమ్ముఁ గాంచి, భక్షణాసక్తతం బరతెంచి, భవదీయ దేహస్పర్శమాత్రంబున సంప్రాప్తపూర్వజ్ఞానుండనై, నిర్మలహృదయుండ

నైతిని. అటుగావున భవత్ప్రభావంబుఁ దెలియఁబలుకవలయును. శరణాగతుఁడనగు నన్నుద్ధరింపుఁడు" అని వినయవినమితశిరస్కుండై ప్రార్థింపుచున్న నా బ్రహ్మకాత్మజునకు యోగీంద్రుఁడు భస్మప్రభావమును దెలియఁజెప్పెను.

"ఓయీ! భశిత్రిపుండ్రాదులతోఁ యున్న నా దేహమును తాకుటచే నీవు అసమానజ్ఞానుండవైతివి. అయ్యది ఆశ్చర్యమును గొల్పునట్లు రోగాపస్మారచయంబుల నణఁగద్రొక్కును పావనకరమగు భస్మముయొక్క ప్రభావము హరునకు దక్క మఱెవ్వరికిని దెలియదు.

పూర్వము ద్రావిడదేశమందు వసుధామరుండను నొక విప్రుఁడు గలఁడు. ఆతఁడు సత్కర్మపరిత్యాగియై, చౌర్యవర్తనుండై, అనాచారపరుఁడై, శూద్రామణినొకదానినిఁ జేబట్టి సురాపానమును గ్రోలుచు, కాలము గడపుచుండెను. అంత నొక రేయియందు శూద్రుఁ డొకఁడరుదెంచి యా విప్రునివధించి, పురము వెలుపలఁ బారవైచెను. కొంతవడికి భస్మానులిప్తపాదములతో శునక మొకటి రక్తఖాదనాపేక్షయై యచటి కరుదెంచి యాతని కళేబరమును ద్రొక్కెను. ఆ సమయమందు మహేశ్వరదూతలు విమానముతో నచటి కరుదెంచి యంతకుబూర్వమే వేంచేసియున్న యమకింకరులను మోఁది, యా విప్రుని విమానమధ్యగతునిఁ గావించి కైలాసమున కెగయుచుండిరి. అప్పుడు యముఁడు వారలను కలసికొని 'మహాత్ములారా! ఇది యేమిచోద్యము? కులవిభ్రష్టుఁడై, నసత్యవాదియై, జారచోరుండై, దుర్మదాంధుఁడై సంచరించిన యీ పాపాత్మున కిట్టి దివ్యవిమానారూఢత యెట్లు సిద్ధించెను? కైవల్యపదం బీతని కెట్లలవడఁజేతురు?' అని బలికిన శమనునిఁ గాంచి యా శంకర కింకరులు 'ఓ ధర్మపతీ! ఈ విప్రుని శవకాయమునందును లలాట వక్షము లందును భస్మానులిప్తములు గానవచ్చుచుండెను. గావున పరమేశ్వరుని శాసనమున వీనిని మేము కైలాసమునకుఁ గొని పోవు

చుంటిమి. త్రిపుండ్రధారులు మాన్యులని నీకు దెలియదా?' అని బలికి యమునివీడ్కొని ప్రాకటముగ నా విప్రుని పుణ్యలోకమునకుఁ జేర్చిరి"

కనుక "సమస్తపాపక్షయంబుచు మహేశ్వర విభూషణంబైన భస్మమును నిరంతరము నేను ధరించుచుందును" అని వామదేవుఁడు నుడువ రాక్షసుఁడు బ్రహ్మర భస్మప్రభావశ్రవణ కుతూహలుండై యమ్మునీంద్రునితో "యోగిచంద్రా! పూర్వజన్మసుకృతమువలన యిప్పుడు తమదర్శనము నాకు లభించి పాపవిముక్తుండనై ధన్యుఁడనైతిని. నేను పూర్వమున యవనభూపాలుండనై యుండునప్పుడు వీరశైవులకు సంప్రీతితో సస్యకేదారములను సత్సలిలక్షేత్రముల నొసంగియుంటిని. ఆ కారణము వలన యీ జన్మమందు మీ దర్శన మబ్బి కలుమ రహితుండ నైతిని. మహాత్మా! ఇంకేను భస్మంబునుధరించి దురితకర్మముల నెల్ల నిక్కముగ బాయుదును. యోగివర్యా! ఈ భస్మధారణ మెట్లొనరింపవలెను. ధరించునప్పుడు పఠింపవలయు మంత్రం బెయ్యది? ఆచరణలో నడిన లభించు ఫల మెయ్యది? ధరింపవలసిన కాల మెయ్యది? కరుణించి యీ దీనున కియ్యది దెలియఁబలుకవలయును. మహాత్మా! మీవంటి ఘనులు నిక్కముగ పుణ్యవంతులు. సర్వభూతహితులు. సదమలచిత్తులు. కల్పవృక్షంబువలె పరోపకారపరులు. గావున నీ దుర్జన్ముని, విజ్ఞానహీనుని, నిబిడాంధకారకూప ప్రవిష్టుని నన్నుద్ధరింప భస్మదానం బొసంగుఁడు" అని బహువిధముల ప్రార్థింపుచున్న యా బ్రహ్మరాక్షసునకు యోగీంద్రుఁడు విభూతిమహాత్మ్యమును సవిస్తరముగ నితిహాసరూపంబున జెప్పందొడంగెను.

పూర్వ మొకప్పుడు మందరాహ్వాయపర్వత శిఖరమునకు ప్రమథగణములతో శంకరు డేతెంచెను. అంతట గరుడ భాస్వర సిద్ధచారణ మరుద్గంధర్వ విద్యాధరులు, సుర యక్షోరగ సాధ్య రుద్ర వసురక్షోభూత విశ్వాశ్వినులు, హరి వైశ్వానర ముఖ్యదిక్పతులు విమానా

రూఢులై గౌరీమనోహరుని సాన్నిధ్యముం జేరవచ్చిరి. మరియు సనక సనందనాది బ్రహ్మర్షులును, నారదాగస్త్య మార్కండేయ జాబాలి ప్రముఖానేక దేవర్షులును, దక్షాది ప్రజాపతులును, ఊర్వశీ పురోగ మాప్సరోగణములును, జండికాది మాతృకలును, నందిమహాకాళ్యాది శంకర కింకరులును, శంఖకర్ణ ఘంటాకర్ణ వీరభద్ర కుంభోదర వృకోదర మహోదర కర్ణదామాది భూతనాధులును, రక్త నీల పాండువర్ణులును, ధూమ్ర ధూసర కర్బుర పాలాశవర్ణులును, వ్యాఘ్ర సూకర భల్లూక దంతావళ సారమేయ సృగాల మర్కటోలూక సింహ శరభ భేరుండ గృధ్రముఖులును, నేకవక్త్ర ద్వివక్త్ర బహువక్త్ర నిర్వక్త్రులును, ఏకహస్త ద్విహస్త చతుర్హస్త బహుహస్తులును, ఏకనేత్ర చతుర్నేత్ర బహునేత్రులును, దీర్ఘ వామనదేహులును నైన భూతగణంబులును పరివేష్టింప సింహాసనాసీనుండై యున్న సమయమున సనత్కుమారుండను మహామునీంద్రుం డరుదెంచి సూర్యకోటి సమప్రభుండగు విశంగ జటాపటలశోభితుండును, నారోలఫాలనయనుండును, ఖండేందు శేఖరుండును, నీలగ్రీవుండును, నాగేంద్రభూషణుండును, వ్యాఘ్రచర్మ ధారణుండును, ఘంటాదర్పణమండితుండును, ఖట్వాంగ పాశాంకుశ త్రిశూలధారణుండును, నప్రమేయ్యుండును, ననిర్దేశ్యుండును, కాలాగ్ని రుద్రుండును నైన పరమేశ్వరునకు ప్రణమిల్లి బహువిధముల ప్రశంసింపుచు కృతాంజలిబద్ధుండును, వినయ వినిమిత శిరస్కుండును నై యమ్మహాదేవుని వలన సకలధర్మంబులు ప్రశ్నోత్తరంబులవలన నాకర్ణింపుచు యా మునీంద్రుండు పరమశివునితో "పరమాత్మా! నీ వలన నపవర్గహేతువులైన యనేక ధర్మంబులు సవిస్తరముగవింటిని. ఏ ధర్మమార్గ మెంచి జూచినను నయ్యది యాచరించుటకు బహు కష్టతరమై యుండెను. గనుక యే సులభధర్మము వలన నఘనాశనంబై మహాఫలమును బొందవచ్చును? కృపవహించి యయ్యది నా కానతిమ్ము" అని కోరెను.

అప్పుడా చంద్రమౌళి "తాపసోత్తమా! త్రిపుండ్రసంధారణము సర్వప్రాణులకు ధర్మములలో నుత్తమధర్మమై, వ్రతములందెల్ల నంచిత వ్రతమై, యలరుచుండును" అని జెప్పెను. సనత్కుమారుఁడు "భక్త వత్సలా! త్రిపుండ్రసాధనమునకై యే ద్రవ్యము నుపయోగపర్చ వలయును? దానికి ప్రమాణములగు దేవత లెవ్వరు? దానివలనఁ గలుగు మహాశక్తియెద్ది? అయ్యది లోకమున కెట్లు రక్షణకరంబై యలరారును? సెలవీయ ప్రార్థించుచుంటిని" అని వినయముతో బలికెను.

శంకరుఁడప్పుడు "మునీంద్రా! విభూతిధారణము అన్నివర్ణముల వారును, అన్ని ఆశ్రమవాసులును యొనరించిన యెడల పాతకంబు లన్నియు భస్మమగును. మరియు వహ్నిత్రయంబును, శక్తిత్రయంబును, వేదత్రయంబును, విమలమైన సత్త్వాదిగుణములును, ఈశానుండును త్రిపుండ్రకాది దైవతములై యలరుచుందురు. వేల్పులకు మ్రొక్కి, నాభికామధ్యమాంగుష్ఠాగ్రమానితముగ బ్రహ్మమయములైన పంచ మంత్రంబులను, మరియు త్ర్యంబికాది మంత్రంబులను మంత్రితముగఁ జేసి దగ్ధమైన గోమయంబును ఫాలతలమున దాల్పవలయును. ఉదయ కాలమునందు భస్మమును జలముతో మిశ్రితము గావించి ఫాలమునను నురమునందును భుజములయందును బూసిన నరులకు గలిమియు బలి మియు గలుగును. మంత్రము దెలియని మనుజు లెవ్వరైన భూతిరేఖ నుదుటఁ బూసిన వారలు దురితవర్జితులై పరిశుద్ధులై యుందురు. భస్మ సంధారణమున పరసతికి దిరుగుట, పరధనము నపేక్షించుట, పరవృత్తిని హరించుట, కూటసాక్ష్యంబులిచ్చుట, కుత్సితభావమును గలిగి యుం డుట, వేశ్యాలోలత్వము, సురాపానము, నీచసంసేవ, నీచప్రతిగ్రహము, అనృతభాషణము, కన్యారజస్వలాగణికాది కామినీసంగమము, దివా సంగమము, వేదవిక్రయము, కన్యావిక్రయము మొదలైనవాటివలన గలుగు కలుషములన్నియు అణఁగిపోవును. వీరశైవుని నిందించినను

శివధనమును హరించినను, శివుని హేళనము గావించినను మానవుఁడు నిష్కృతులు లేని పాపములకు లోనగును.

భూజనులం దెవ్వరేనియు, ఏజాతివారైనను నుదుట భూతిని బూసినమాత్రంబున వారు సర్వమానవపూజితులై శివపదమును బొందుదురు. మహేశ్వరవ్రతనిష్ఠులైన మానవులు శతత్రయకల్పంబులు బ్రహ్మలోకంబునను, శతత్రయకల్పంబులు విష్ణులోకంబునను వసించి తదనంతరమున బునరావృత్తిరహితంబైన బరమేశ్వరలోకంబునందు ధ్రువంబుగా నుందురు. మునీంద్రా! సర్వభూతరహస్యంబైన త్రిపుండ్రమహాత్మ్యంబును నీకుఁ దెలియఁబలికితిని. దీని యర్థంబు నీచేత ప్రపంచంబునకు వెల్లడికావలయును" అని యానతిచ్చి యంతర్ధానమునొందెను. పిమ్మట సనత్కుమారుఁడు హర్షముతో బ్రహ్మలోకమునకుఁ జనెను.

అని చెప్పి క్రమ్మర వామదేవుఁడు బ్రహ్మరాక్షసునకు శైవమంత్రితంబుగ ఫాలతలమున భూతివిలేపన మొనరించి వానిని భయంకర రూపమునుండి దొలగించి దివ్యశరీరునిఁ జేసెను. పిమ్మట నా రాక్షసుఁడు వామదేవుని పాదములకు నమస్కరించి సెలవుఁగైకొని తపోవనికిఁ జనెను.

## 2

### చండకుఁడు

"శ్రద్ధ లోకహితంబైనది. అయ్యది నిజజననిపగిది శ్రద్ధాపరులకు సౌఖ్యము లొసంగును. మరియు వారి యభీష్టములెల్లప్పుడును సిద్ధించుచుండును. శ్రద్ధాభక్తులతో పూజించువారికి బరమేశ్వరుఁడు కామితార్థముల నీడేర్చుచుండును. శ్రద్ధాహీనుల పూజ నిష్ప్రయోజనము" అని బలికి సూతుఁడు ఆ మహామునుల కొరకు ఇతిహాసమును జెప్పఁదొడంగెను.

పాంచాలము మిక్కిలి విశాలమైన రాజ్యములలో నొకటి. అయ్యది దేవికి నడుమనున్న వడ్డాణము పగిది యొప్పుచు మిక్కిలి రమ్యంబగు ననేక పట్టణములతో నొప్పుచుండెను. ఆ రాజ్యమును సింహకేతువను రాజన్యచూడామణి పాలించుచుండెను. అతఁడు సమస్తారాతి సంఘాతుఁడై, హనుమత్కేతుఁడై, విక్రమస్ఫురణుఁడై, సత్యసారసుఁడై, భూజనవిఖ్యాతుఁడై పరిపాలించుచుండెను. ఆతనికి శత్రువులను సంహరించు మిక్కిలి బలవంతుడైన కుమారస్వామివంటి విక్రముండును, దీనరక్షకుండును, శివభక్తితత్పరుండును, సముద్రగంభీరుండును, మేరుధీరుండును, మన్మథస్వరూపుండును నైన కుమారుఁడుండెను.

ఆ రాజనందనుఁ డొకనాఁడు మృగసంహార కాంక్షనుఁ జెంది నిశితబాణధనోద్ధరుండై కిరాతులతో కాంతారమునకుఁ జనెను. అమ్మహారణ్యముఁ బ్రవేసించి యచ్చటనుండు వేదండ గండక పుండరీకభల్లూకవరాహ మహిషాది దుష్టమృగముల విదళింపుచు విహరింపుచున్న సమయంబున చండకుఁడను నొక కిరాతభటుఁడు మృగాన్వేషణాపరుండై వనముఁ దిరుగుచు, నొక్క జీర్ణంబైన దేవాలయమునందు స్ఫుటితంబైన లింగమును గాంచి దైవయోగంబున దానిని గొనివచ్చి యా రాజనందనునకుఁ జూపి, దానిని పూజించు విధానమును దనకు దెలియఁ జెప్పుమని కోరెను. అంత నా రాజకుమారుఁడు చండకునితోఁ బరిహాసముగ "ఓరీ! నీవు ఈ మహాలింగమునకుఁ బూజ యొనర్చెదవేని మొదట సంకల్పవిధి పూర్వకముగ శుచియైన జలముతో నభిషేక మొనరించి, పీఠమం దునిచి, యా పిమ్మట నతి శుభ్ర పుష్పగంధాక్షతముల నర్చించి, ధూపదీపాదికంబు లొసంగి, మనస్సునందు ధ్యానముఁ గావించి, ముందుగ జితిభస్మము హారముగ నొసఁగి హాత్మోదయుక్తాన్నము నాదరముతో మరల నైవేద్య మొనరించి, ముంత్రపుష్ప వందనాదులు గావింపవలయును. పూజయైన పిమ్మట ప్రసాదమును నీవు స్వీకరింపవలయును.

అనుదినము జితాభస్మమును నివేదించిన గంగాధరుఁడు శీఘ్రముగ సంతుష్టి నొందును" అని పలికిన రాజకుమారుని పలుకులపై దృఢమగు విశ్వాసముగలవాఁడై చండకుఁడు తన సదనమున కరిగెను.

ఆత్మయందు నిరుపమానమైన భక్తిగలవాఁడై, నిజ తరుణీ సహితుఁడై యీశ్వరార్చనాపరత నహించి, జితిభస్మనివేదన మాచరించి, నిజభోగ్యవస్తుచయము నొసంగి, దత్ప్రసాదమును శిరమున దాల్చి, మనస్సును రంజింపఁజేసుకొని పిమ్మట దాను భుజించుచుండును. ఇట్లు భార్యాసమేతముగా చండకుఁడు ఆ మహేశ్వరలింగమునకు దృఢభక్తి పరుఁడై నిరంతరము పూజనంబాచరింపుచు కొన్ని దినముల కొకనాఁడు శివపూజాసమయంబున జితాభస్మరహితంబైన పాత్రమును నిరీక్షించి తత్సంగ్రహణార్థముగా నలుదెసలఁ బరికించి జితాభస్మము నెందును గానక మరల నిజస్థానమునకు వచ్చి విషణ్ణచిత్తమున మౌనవ్రతుండై యుండెను. అట్లు విచారగ్రస్తుఁడై యున్న నిజవల్లభుఁ గాంచి శబరి "నాథా! శైవసమర్చనం బొనరింప కేల విచారగ్రస్తులరై యుంటిరి?" అని యడిగెను. అప్పు డా చండకుఁడు "అతివా! ఈ దినంబున నీశ్వరోపహారంబునకు జితాభస్మము లభింపదయ్యెను గావున శివపూజాంతరాయము సంభవించెను. ఇఁక చేయునదేమి? పరమేశ్వరుని పూజింపక భుజింతునేని యేను గురువాక్యోల్లంఘనీయుఁడనై దురితంబులకు లోనగుదును" అని పలికెను. "ప్రాణేశ్వరా! దీనికై యింతగా మీరు పరితాప మొందవలయునా? నే నొక సదుపాయమును బలికెద నాలింపుఁడు. ఇప్పుడు మన గృహంబు నొకదానిని దగ్ధము గావించి అందు నా శరీరమును భస్మీభూతము గావింతును. అప్పు డా జితిభస్మముతో మీరు ఆ పరమేశ్వరునకు నివేదన మొనరింపుఁడు" అని పలికిన నిజపత్నిని గాంచి చండకుఁడు విస్మయమును జెంది "ప్రేయసీ! సకలభోగభాజనమున దయానిధానంబైన నీ తనువు సకల ధర్మార్థ కామమోక్షముల

కెప్పుడును సాధనమై సుఖాగ్న్యంబును జెందియుండును. మరియు నీవు సంతానహీనవు గాన నీవెట్లు యా దేహమును పరిత్యజింతువు?" అని బలికెను. "నాథా! పరజనులకై శరీరము నర్పించిన మోక్షము గలుగును. ఇఁక సాక్షాజ్జగదీశ్వరునకు నద్దానిని యొసంగిన గలుగు ముక్తిని వేరు చెప్పవలయునా? మరియు పూర్వభవాంతరములం దెట్టి పుణ్యములాచరించియుంటినో లేక పర్వతకందరస్థలిపై నెట్టి దపం బాచరించి యుంటినో లేక యెట్టి పుణ్యతీర్థమునందు స్నాన మాచరించితినో యీ జన్మమున మహేశ్వరునికై నాశరీరము నర్పించనుంటిని" అని బలుకుచు నిజవల్లభుని నొడంబరచి, పుణ్యజలావగాహనం బాచరించి, శుచిర్భూత గాత్రమై, హరిద్రాంజన కుంకుమ గంధపుష్పాద్యలంకృతమై, నిజగృహ ద్వారంబున ననలము దిరిగొల్పి, ప్రదక్షిణత్రయం బొనరించి, యవ్వీతిహోత్రునకు అభిముఖంబుగా నిలిచి, గురువందనంబు గావించి, యమ్మహాదేవుని తన మనంబునఁ దలంపుచు, కృతాంజలియై "దేవా! నేనర్పించు పుష్పములు దేహేంద్రియములు. ఇష్టసంభావితమైన గంధ ధూపములు దేహము. విజ్ఞానమైన చిత్తము నే నర్పించిన దీపము. హవిస్సుకరణంబులు పంచప్రాణంబులు. అట్టి మానసికాపూజ నేనొనర్చుచుంటిని. సర్వలోకాధిపత్యమైనను, స్వర్గమైనను, బ్రహ్మపదమైనను నాకు వలదు. నిరంతరము నీ పాదములను గొల్చు భాగ్యము నాకు గలుగఁజేసిన యదియే చాలును" అని స్తుతించుచు శబరి అగ్నియందు ప్రవేశించి దగ్ధమాయెను. అప్పుడు చండకుఁడు జితాభస్మమును సంగ్రహించి, కౌతుకమతియై పరమేశ్వరారాధన యొనరించి, ప్రసాద సంగ్రహమునకై యెప్పటియట్లు తన పత్నినిఁ బిలచెను. శబరియు నత్యుత్సాహముతో యట కరుదెంచి శివునకు నమస్కరించెను. అంత టా చండకుఁడు ఆశ్చర్యమునుఁ జెంది దగ్ధమైన తా నెట్లు తిరిగి ప్రసాదింపఁబడెనని ప్రశ్నించెను. అప్పుడామె "నాథా! నేను అగ్నిలోఁబడి సుఖ

నిద్రను జెందితిని. పిమ్మట మీరు ప్రసాదసంగ్రహణార్థమై బిలచినంతనే యిచ్చటి కరుదెంచితిని. అంతయు నా నిటలాక్షుని మహిమయే గదా!" అని బలికెను.

ఇట్లు వారు మహాదేవుని మహిమంబును బొగడుచు సంతోషమున నోలలాడుచుండ వారు విస్మయము జెందునట్లు దేదీప్యమానంబగు దివ్యవిమానమున కొందరు శివభటులేతెంచి వారల నిరువుర నందు కూర్చుండనియమించి శ్రీసదాశివలోకమునకు వారలను గొనిపోయెను.

## ౩

## దీర్ఘసుమంగళి

ఆర్యావర్తనమున విశ్వరథుండను నవఘుత్ముండగు భూసురుండొకడు గలడు. అతడు మనసిజ మదహరణ భక్తిమార్గరతుండై వందనీయుండై యుండెను. అతనికి దైవయోగముచే సావిత్రీప్రతిభ గలిగిన శారదాకుమార్తె జనించెను. కొంతకాలమున నా బాలిక యుక్తవయస్కురాలైనందున విప్రుడు తగిన వరుని వెదకి వేదోక్తముగా వివాహ మొనరించెను. కాని వివాహమైన కొలది దినములకే యా యువకుడు సర్పద్రష్టుడై మరణించెను. అంత సకల బంధుజనులు హాహారవములతో విలాపము లాచరింపుచు నిజకర్మయోగమున మరణము నొందిన విప్రయువకునకు నౌర్ధ్వదైహికాది విధానము లాచరించి, పతి వియోగినియగు నా యంగనను విరహితాలంకారను గావించిరి. ఇట్లు దుఃఖభాజనియై విధవయగు శారద నిజజనకుని మందిరమునందే జీవితమును వెలిబుచ్చుచుండెను.

కొంతకాలము గడచెను. అంత శ్రుత్యాచారపరాయణుండును, జపనిష్ఠుండును, ఆగమాంతజ్ఞుండును, ప్రత్యాహార సమాధి ధారణుం

మును, ప్రవ్యక్తయోగాఢ్యుండును, జాత్యంధుడు నగు ధ్రువుండను మునీంద్రుం డట కరుదెంచెను. గురుభక్తి పరాయణ యగు శారద ఆ మునీంద్రునకు స్నానాదికములను, ఆహారపానములను భక్తితో జేకూర్చుచు పూజించుచుండెను. అప్పు డామె భక్తిశ్రద్ధలకు మెచ్చి ఆ మునీంద్రుడు అంధుడగుటచే ఆమె విధునయని దెలిసికొనక 'దీర్ఘ సుమంగళీభవ' యని యాశీర్వదించెను. అంత నా యువతికి ఆశ్చర్యముం దోప "మహాత్మా! నేను భర్తృవిహీనైతిని. ఏనెట్లు చిరంటని కాం గలను? మీరు అమోఘసంకల్పులు. యదార్థవాదులు. విశేషించి మహర్షిసత్తములు గావున భవదాశీర్వచనంబెట్లు సంఘటింపనేర్చును? దురంతచింతాభరాక్రాంతనైయున్న నన్నుద్ధరింప మీరలుదక్క యొండు శరణంబు లేదు" అని బలుకుచు నా మునీంద్రుని పాదములకు ప్రమొ క్కెను. మౌని కటాక్షించి అత్యంతకరుణారసపూర్ణహృదయుండై "ఓ కలభాషిణీ! ఏ నిపుడు జాత్యంధుడ నగుటచే దెలియక నిన్ను శుభాంగివి గమ్మని వచించితిని. అయినను నీ భక్తికి నేను మెచ్చియుం టిని. గాన నప్పరమేశ్వరుడు నిన్నుం గటాక్షించుటకు నీకొక వ్రత ముపదేశించెదను. వినుము.

చైత్రమాసమునందునను, మార్గశీర్ష మాసమునందునను, శుక్ల పక్షమునందు అష్టమీచతుర్దశులయందును ఆ ఉమామహేశ్వరుల నారా ధింపుము. ఆ దినమున ప్రత్యూషకాలమందు పావనోదకముల స్నాన మాచరించి, సమాహితమతివై ధౌతవస్త్రంబులు ధరించి, దేవర్షి పితృ తర్పణంబుల నొనరించి, క్రమ్మర నిజమందిరంబున కేతెంచి, ఫలపుష్ప తోరణ భ్రాజితంబై మణిమయాలంకారంబగు మంటపమున పంచవర్ణ విరాజిత పంచపద్మరంగవల్లులం దీర్చి, తండులములపై వస్త్రమును బరచి యందుం బార్వతీశ్వరులను భక్తితో బూజించి, విధ్యుక్తమార్గం బున సంతానసౌభాగ్యములను పెంపొందింపజేయుటకై ప్రార్థింపవల

యును" అని వ్రతక్రమంబు నుపదేశించెను. సుమతియగు శారద మిక్కిలి సంతసించి "మునీంద్రా! మీ యాజ్ఞానుసారముగ నా వ్రతము నాచరించెదను. నా మనోరథము సిద్ధించునట్లు మీరిచ్చట కొంత తడవు వసించి యమ్మహావ్రతమును నాచే ఆచరింపఁ జేయవలెను" అని కోరెను. అందుల కామునీంద్రుఁడు ప్రియమూర నియ్యకొనెను. అంతట మంటపాంతరమున మునీంద్రోపదిష్టంబైన మంత్రతంత్ర దీక్షలతో మహేంద్రముఖ్య దేవమానిమాన్యంబైన యా యుమామహేశ్వరవ్రతంబును, మంజులవాణియగు శారద యాచరించెను. పిమ్మట సువాసినులకు దృఢభక్తితో కూర్పాసకాంశుకంబులను, శూర్పయుగ్మంబులనుఁ గంఠసూత్రంబులను, కర్పూరవీటికాదులను యర్పించెను.

ఇవ్విధంబున నా శారదావధూటి దనకునై ధ్రువమహామునీంద్రుఁడాచార్యుండుగా మార్గశీర్షమాసమున శుక్లపక్ష చతుర్థీదినమున ఉమామహేశ్వరవ్రతం బుపక్రమించి యథావిధ్యుక్తంబుగా భక్తిశ్రద్ధా సమన్వితయై యొక సంవత్సరము సాంగముగా నాచరించి, యనంతరము వ్రతోద్యాపనము గావింప సమకట్టి నిజమందిరం బలంకృతంబు గావించి, త్రిమ్మర పూర్వోక్తంబైన దినంబునం దుపవసించి పుణ్యతీర్థ జలస్నాతయు, ధౌతపరిధానధారిణియు, మౌనవ్రతపరాయణయు నై సాయంసమయంబున గృహంబుఁ బ్రవేశించి, యచ్చట కదళికాస్తంభ శోభితంబగు మంటపమధ్యమున సువర్ణఖచితంబైన భద్రపీఠమునందు భవానీశంకర ప్రతిమలు ప్రతిష్ఠించి, మంత్రఘోషణములును, మంగళ వాద్యధ్వనులును జెలంగ సంకల్పంబొనరించి, హృత్పద్మమధ్యంబున గౌరీశ్వరధ్యానముఁ గావింపుచు నావాహనాసనార్ఘ్యపాద్యంబులను, బంచామృతస్నానవిధులను రుద్రసూక్తాభిషేకములను, దుకూలాంబర యజ్ఞసూత్ర సమర్పణంబులను, మణిమయభూషణములను, ఘుమఘుమిత గంధలేపనములను, హరిద్రాకుంకుమాక్షతలములను, గమరి

కల్హార మాలతీ మల్లికాది ప్రసూనార్చనములను, గాలాగరు దశాంగ ధూపములను, కర్పూరనీరాజనంబులను, మధురఫలోపహారంబులను, మంత్రపుష్ప ప్రదక్షిణ నమస్కారంబుల ననేకవిధములఁ బూజించి, యా రాత్రి ప్రథమ ద్వితీయ తృతీయ యామంబులు గడపి జాగరణం బొనరింపుచుండెను.

మహోత్సవ సందర్శనార్థమై యేతెంచిన జనులెల్లరు నిద్రా పరవశులై యుండిరి. అప్పుడు నిశ్చలముగ నున్న నాలుగవ యామంబున శారదయు ధృవమహర్షియు పూజలు సల్పుచుండ యాశ్రితకల్పవల్లి యగు యంబికాదేవి వారికి ప్రత్యక్షమయ్యెను. మౌనిశారదలు దేవికి ప్రొక్కి పాద్యాసనసంవిధానంబుల నర్చితగా నొనరించిరి. అంత నా దాక్షాయణి లలితోల్లాసముతో "మీ భక్తిశ్రద్ధలకు మెచ్చితిని. మీ భాస్వద్వ్రతమునకును ప్రీతిఁజెందితిని. మీ యభీష్టార్థంబుల నొసంగెదను. వేడుఁడు" అని యానతిచ్చెను. అప్పు డా జగజ్జననికిఁ బ్రణమిల్లి ధృవమహర్షి "తల్లీ! పురాకృతకర్మచే నేను జాత్యంధుఁడనై యీవనిత నా కొనరించిన పరిచర్యలకు మెచ్చి 'దీర్ఘసుమంగళీభవ' యని యాశీర్వదించితిని గాన నా వాక్యంబులు యదార్థ మౌనటులు గావించి నన్నానందింపఁజేయుము. మరియు ఈమె పతితో చిరకాలము అన్యోన్యముతో మెలంగునట్లును, పిమ్మట సత్సుతు నొకని బడయునట్లును నా యతివకు వరమిమ్ము. ఇదియె నా ప్రార్థన" అని వేడెను.

అంత పార్వతీదేవి శారదను ప్రేమపూర్వకముగ వీక్షించి మునివర్యునితో "ఓ వసుధామరేంద్రా! వినుము. ఈ లతాంగి పూర్వజన్మమున ద్రావిడదేశమందొక విప్రునికి ద్వితీయపత్నియై తన శీలగుణముల చేతను, తన చాకచక్యము చేతను భర్తకు తనపై నధికానురాగము కలుగునట్లు గావించుకొనెను. ఆ విప్రుఁడు చిన్నభార్యపైగల మక్కువచే యగ్రభార్యను పరిత్యజించెను. ఆ విచారమువలన నామె కొంత

కాలమునకు మృతిఁజెందెను. ఆ ద్వితీయభార్య శృంగార విభూషణ కలితాంగికయై గౌరీపూజలు సలుపుచు, సారాచారయుతో మెలంగుచుండెను. ఆ దంపతుల అన్యోన్యతకు నియమహారుగు లెల్లరు కొనియాడుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు సమీపగృహమునందలి యొక బ్రాహ్మణుఁడామెను గాంచి మోహపరవశుఁడై యామెను వశపరచుకొనుటకు మంత్రౌషధములచే ననేక ప్రయత్నములు గావించెను. కాని అవి యెల్ల నిష్ప్రయోజన మయ్యెను. ఆ వ్యామోహమున ధ్యానపరాయణుఁడై కొంతకాలమునకు మరణించెను. క్రమ్మర నాతఁడు విప్ర కులంబునందు జన్మించి, యీమెను పాణిగ్రహణము గావించుకొనెను. ఈమె గత జన్మంబున పతివ్రతయగు నిజపత్నికి భర్తృవియోగము నొనరించెను. గావున ఆదోషమువలన యీ భవంబున యిట్టి దురవస్థ ప్రాప్తించెను. పతివియోగాభితప్తయై పలవరించి ఆమె కాలగతిఁ జెంది భుజంగియై క్రౌర్యమున దీనిభర్తను గరచి జంపెను. సతీపతులకు నెడబాపు గావించిన యతివలు యుక్తవయస్సుననే వైధవ్యమును జెంది చిరకాలము కష్టముల ననుభవించెదరు.

ఈ శారద పూర్వజన్మంబున నన్ను బూజించుటవలనను, నీ యుపదేశమును బొందుటవలనను దోషముల నెల్లఁ బాసి శుభ మందగలదు. ఈమె భర్త యిచ్చటకు మున్నూటయిరువది యోజనముల దూరమున నున్న పాండ్యదేశమం దొక విప్రుఁడై జన్మించెను. ఈ చంచలాక్షి యాతనిని తన స్వప్నసమయములందు యీ ద్విజన్ముని సమాగమం బందుచుండును. పిదప వేదవేదాంత తత్వార్థసన్యుండును, రుపఖ్యాతుఁడును నగు నందనుని గాంచును. పిమ్మట యీమె తనవిభుని గలిసి సంతోషములో జీవితమునుఁ గడపి యనంతరము శంకరసాన్నిధ్యమును బొందగలదు" అని చెప్పి వారలను దీవించి భవానీదేవి యంతర్ధానమయ్యెను.

మరునాడు ప్రభాతసమయమున శారద గావ్యకరణీయములు నిర్వర్తించి వ్రతాంగంబైన హోమముఁ గావించి, గోభూహిరణ్యాది దానములును, వస్త్ర కలశద్వయ సమేతములైన ప్రతిమాయుగ్మము లను దానములును యొసరించి, శైవసమారాధనము గావించి తదాశీర్వాదములు గైకొని తానును విభుసాన్నప్రాశనయై యనుదినమును భవానీశంకరుల నారాధింపుచుండెను.

అంతట ప్రతిదినము శారద గౌరీమహిమచే తనభర్తతో స్వప్న సమయములందు గలయుచు ఆహ్లాదముఁ జెందుచుండెను. ఇట్లుండ కతిపయదినముల కా వధూటి గర్భవతి యయ్యెను. ఆ లక్షణముల నెల్ల గనిపెట్టి యా పురంబునంగల వృద్ధ బాంధవ జనులందరు ఆమె వ్యభిచరించెనని సంశయించి, యందరు నొక్కయెడకుజనుదెంచి, యబ్బాలికను యచ్చోటికి రాపించి "ఓసీకులటా! భర్తజచ్చిననీకు గర్భ మెట్లుగలిగెను? నీ వెవ్వనితో వ్యభిచరించితివి? నీవు నిక్కముగ శిక్షార్హురాలవు" అని తిరస్కారపూర్వకముగఁ బలికిరి. అప్పుడు శారద జనవాక్యము లకులికి దుఃఖించి,నిజముచుదెలుపుటకుసిగ్గునుజెందియుండెను అంతలో బంధుజను లెల్లరు వేదపురాణములను బరికించి యామె జారికాగుణోన్మాదిని యొక్క కర్ణనాశికలు ఖండించి గోత్రదూరముఁ గావింపవలెనని నిశ్చయించిరి. పుణ్యవతి యగు శారద తనకు శరణమెవ్వరు లేక భీతిఁజెంది, పార్వతీపరమేశ్వరులను ప్రార్థించెను. అప్పుడు జనులెల్లరు వినుచుండ అశరీరవాణి "ఈ సాధ్వి, సౌజన్యభాసమానయగు సుశీల. సరసవివేక భాస్వచ్చరిత్ర. ఈ మానవతి దేవతామహత్వంబున గర్భమునుదాల్చెను. గాన యీ వధూటి నెవ్వరేని జారకాంత యని బలికిన, వారి శిరంబు వ్రక్కలగును" అని నుడివినంతనే యెల్లరు ఆమె మహాపతివ్రత యని నమ్మి అభినందనములు గావించిరి.

ఆ సమయంబున తత్వవిదుం డైన యొక వృద్ధవిప్రుఁడు సభికులతో "పౌరులారా! ఈ ప్రపంచంబంతయు ఈశ్వరమాయామయంబు. ఈ సంసారచక్రంబునందు భావ్యాభావ్యంబులు లేవు. నీ యర్థంబు భగవంతుఁడైన పరమేశ్వరుండెఱుంగును గాని యితరులకుఁ దెలియు నలవి గాదు. సురాష్ట్రుండను రాజు దేహంబును స్పృశించినంతనే యొకకురంగి గర్భిణియై, తామసుండను మనువుంబడసెను. ఇవ్విధముగనే వసురాజు వీర్యము యమునాజలంబులంబడి నయ్యది మత్స్యంబు ద్రావుటఁజేసి తద్గర్భంబున సత్యవతి సంభవించెను. వసుదేవ సమాగమంబు లేక రోహిణీదేవి గర్భంబు దాల్చి బలభద్రుని గాంచెను. జాంబవతీనందనుఁడైన సాంబుని జఠరంబున మహర్షి శాపంబుచే నొక్క ముసలంబుద్భవించెను. యవనాశ్వుండను రాజు మునీంద్రాభిమంత్రితంబులైన జలంబులు ద్రావ వాని గర్భంబున మాంధాత యను రాజు యుద్భవించెను గావున నివ్వనితయు వారలయట్లు మహావ్రతప్రభావమువలనను, మహర్షి పాద సేవల వలనను, నిందితంబైన నీ గర్భమును నీమె ధరించియుండును. నారీమణు లెవ్వరైన తద్గర్భలక్షణములను గూర్చి యా బాలికను బుజ్జగించి రహస్యము నడిగి దెలుపవచ్చును గాన నట్లు గానిండు" అని జెప్పెను. అంత కొందరంగనలు ఆ వృద్ధబ్రాహ్మణ వచనంబులకు సమ్మతించి శారదావధూటిని యేకాంతముగ "అమ్మా! ఈ ధాత్రియందు స్త్రీలు బురుషసంగమమువలననే గర్భమును దాల్తురు. పురుషహీనవగు నీవెట్లు ఈ గర్భమును దాల్చితివో మాకుఁ దెలుపుము. లోకములో నిట్టివి యెన్ని యోజరుగుచుండ యేకాంతముగా బ్రశ్నించుచున్న మాకుఁ దెలుపుటకు నీవు సిగ్గుపడవలదు" అని బుజ్జగించిరి. అప్పుడు శారద వ్రీడమువదలి జాత్యంధుఁడగు ధృవమహర్షి తన పరిచర్యలకు మెచ్చి దీర్ఘసుమంగళి యగునట్లు తన్ను దీవించుటయు, మీదట యదార్థము నెరింగి తన వచనంబును తథ్యముజేయ ఉమామహేశ్వర

వ్రతము నుపదేశించుటయు, తానా వ్రతము నాచరించుటయు, పార్వతీదేవి ప్రసన్నమై స్వప్నకాలమునందు తాను భర్తతో గలియునట్లును, పిమ్మట నొక సుగుణవంతుఁడగు కుమారుని బడయునట్లు వరము లొసంగుటయు మొదలుగా గల యావద్వృత్తాంతమును వారల కెఱింగించెను. వారును నయ్యది దైవకృతమని దలఁచి సంజ్ఞావిరహితులై నిజస్థానములకుఁ జనిరి.

నవమాసములు గడచెను. ఒక శుభముహూర్తమున శారద సదమలగుణహారుఁడైనట్టియు, వేదశాస్త్రవిచారుఁడైనట్టియు, మదమాత్సర్య విదూరుఁడైనట్టియు సుతునిఁ బడసెను.

అంత నవ్వనిత పితృ సోదర మాతృ బంధుమిత్రసమేతంబుగా ఆత్మనందనుని నుపలాలనం బొనర్చుచు సుఖంబుగ నుండెను. కొన్ని దినముల కొక పర్వకాలంబున గోకర్ణక్షేత్రమునకు ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరదేశంబులనుండి సమస్తజనులు జనుదెంచుచుండిరి. శారదయు కుమార పితాదిసహితంబుగ నా స్థలమునకుఁ జని యందు స్నాన దానాదికంబులను, రుద్రాభిషేకపూజా మహోత్సవంబులను, శైవ సమారాధనంబులను కొంత ప్రొద్దుఁ గడపి యొక మంటపప్రదేశంబున గూర్చుండి వచ్చుచు బోవుచున్న జనులను జూచుచుండెను. అంత దైవవశంబున మున్ను ప్రతి రాత్రియందును తనకు స్వప్నసమయంబున గానంబడుచున్న పాండ్యదేశ సమాగత బ్రాహ్మణుఁడగు తన నిజవల్లభునిఁ గాంచి, ఈతఁడే గావలయునని సంశయావిష్టచిత్తయై తదేక ధ్యానమున నిరీక్షించుచుండ నా సమయమునసే ఆ భూసురుఁడు అమ్మానినిం గనుంగొని తనకు సార్వకాలమును స్వప్నసమాగమం బొనరించు నింతి యిదియే కావలయునని మనమున సందేహింపుచు నా కామినీ ముఖలక్షణంబులను నిరీక్షించుచు దత్సమీపంబునకు వచ్చి ముకోమలితో "ఓ మదిరాక్షీ! నీ స్థలం బెయ్యది? నీ తలిదండ్రు

లెవ్వరు? నీ మనోహరుఁ డెవ్వడు? ఈ బాలకుండు నీ కేమగును?" అని ప్రశ్నించెను. అప్పుడు శారద బాష్పలోచనయై సిగ్గును విడచి తన యాత్మకథను వినిపింప నాతఁడు "వనితా! నీ భర్త నీ వివాహ దినము దప్పకుండగనే గతించెనంటివే! ఈ కుమారతిలకుఁ డెట్లు నీకు జన్మించెను?" అని పరిహాసముగ బలికెను. అప్పుడు శారద లజ్జను జెంది పిదప ధైర్యమూని యా భూసురునితో "అనఘా! నీవు నన్నిట్లు నడుగనేల? నీవు నన్నెరుంగుదువు. నేను నిన్నెరుంగుదును. మన కిరువురకును మనస్సే సాక్షి. స్వప్న సమయములందు మనము అన్యోన్య సౌహార్దము బొంది శారదేయుఁడను యీ కుమారుని గంటిమి" అని జెప్పి మరియు వ్రతఫలితమునుగూర్చి యంతయుఁ దెలిపి, నిజకుమారుని తన మనోహరున కిచ్చెను.

భూసురుండును సంశయ మించుకయుఁ జెందక యామె తలిదండ్రుల యనుజ్ఞను గాంచి శారద నాత్మపురంబునకుఁ దోడ్కొని పోయి, యా మత్తకాశినిని నిజభార్యవలె భావించి, నృత్య గీత కళాది విద్యలతో సుఖంబుగ కాలముఁ గడపుచుండెను. ఇవ్విధంబున నా దంపతు లశ్రాంతరతికాములై రతీమన్మథుల చందమున బ్రవర్తింపుచు ననేక సంవత్సరములు భూతలమున యథేష్టభోగముల ననుభవించిరి. అంత గొంతకాలమున కా విప్రుఁడు విగతజీవుండైన సతనితో శారదయు సహగమనమాచరించెను. తదనంతరమున అయ్యిరువురు దివ్యదేహములుధరించి విమానారూఢులై శివలోకమునకుజని సుఖంబుగ నుండిరి.

## 4

### భద్రసేనుఁడు

"ఓ మహర్షులారా! అక్షయభోగదాయక మగునట్టియు, శుభప్రదమ్మైనట్టియు, ఫాలాక్షునకు మనఃప్రియంబగునట్టియు, మోక్షఫలప్రదంబగు

నట్టియు, నఘాపహారంబై నట్టియు, గాత్రపవిత్ర మగునట్టియు, రుద్రాక్ష మహాత్మ్యంబును గూర్చి చెప్పెదను. సావధానచిత్తులరై వేడ్కతో వినుఁడు" అని బలికి సూతమహర్షి చెప్పఁదొడఁగెను.

"రుద్రాక్షవిభూషితులగు భద్రాత్ములు నిష్కళంకభాగ్యాన్వితులై పరమశివుని కృపకు బాత్రులై యుందురు. మరియు వారు ప్రజలచే నుతింపబడుచుందురు. భక్తిరహితుఁడైనను, భక్తియుక్తుఁడైనను, నుత్తముఁడైనను, లేక నీచుఁడైనను భద్రఫలదమైన రుద్రాక్షమును ధరించి పాపవిముక్తుఁడు కాఁగలడు. శరీరముపై వేయి రుద్రాక్షలు ధరించినవానికి దేవతలు గూడ బ్రణమిల్లుచుందురు. బాహుయుగ్మమునకు పదియారు పదియారును, శిరస్సున నొక్కరుద్రాక్షయు, ముంజేతులకు పండ్రెండును, కర్ణయుగమున నొక్కటొక్కటియు, వక్షమునందు అష్టోత్తరశతంబును, గనకముక్తాప్రవాళారత్నకలితమైన రుద్రాక్షసరమును కంఠమున ధరించిన మనుజుఁడు ధరపై ప్రత్యక్షశివునివలె వెలయుచుండును.

రుద్రాక్షమాలికను గణియించుచు జప మాచరించిన అయ్యది యొక మంత్రంబై, అనంత సౌఖ్యంబు నొసంగును. తలపై రుద్రాక్ష నిడుకొని స్నాన మాచరించిన జాహ్నవీస్నాన మాచరించిన ఫలము చేకూరును. మర్త్యుఁడైనను రుద్రాక్షను ధరించిన పాపములు వానిదరికి రానేరవు. రుద్రాక్షధారి దరిద్రుఁడైనను, మహాసామ్రాజ్యమొగి నిశ్చలతను జెందును. రుద్రరూపమైన రుద్రాక్షమును పుష్పగంధాక్షతలతో పూజించిరేని అయ్యది శివసమర్చనంబు జేసినట్లగును. రుద్రాక్షములందు యేకముఖ, ద్విముఖ, త్రిముఖ, పంచముఖ, సప్తముఖ, నవముఖ, ఏకాదశముఖ, బహుముఖంబులను రూపభేదము లుండును. శ్రీకరంబైన యీ రుద్రాక్షములు శ్రీకంఠమయంబగుట యదార్థము.

దీనికి యింపుకథాధరహితంబైన యొక యితిహాసము గలదు. అద్దానిని దెలియఁబలికెద నాలింపుఁడు.

ధరణీరత్నమై దీపించు భరతవర్షమునకు కాశ్మీరము ఆరామమువలె యొప్పుచుండును. ఆ రాజ్యమున భద్రసేనుఁడను పార్థివోత్తముఁడు సకలప్రజానురంజకుఁడై పాలించుచుండెను. ఆతనికి ధరణీతేజుండగు సుధర్ముఁడను కుమారుఁ డుదయించెను. మరియు ప్రధానికి ధారకుండను నందనుఁ డొకఁడు గలిగెను. సుధర్మ ధారకు లిరువురు బాల్యభావముచే శయన పానాన్న భోజనసమయములందును, శాస్త్రపఠనాది విద్యాప్రసంగములందును, జోడువాయక మెలంగుచుండిరి. వారు మణిదీప్యమాన కనక గ్రైవేయ కోటీర కంకణహారాదుల నెన్నడును అలంకారంబులుగ ధరింపనొల్లక రుద్రాక్షములను మాత్రము మహోత్సాహముతో ధరించుచుందురు. తలిదండ్రులు వారల నెన్ని విధముల శిక్షించినను రుద్రాక్షధారణము మాత్రము విడువరైరి.

అంత కొన్ని దినంబులకు భద్రసేనుని యాస్థానమునకు పరాశరుఁడను మునీంద్రుఁ డరుదెంచెను. భూపతి యా తపోధనున కెదురేగి ప్రమోద ముదముతో నర్ఘ్యాదివిధుల నాతనినిఁ బూజించి, మృదుతర గంభీర మధుర మితవచనంబులతో "మహాత్మా! నా కుమారుఁడైన సుధర్ముఁడును, ప్రధాని కుమారుఁడైన ధారకుఁడును, మణిమయాభరణంబులను. విసర్జించి రుద్రాక్ష భూషణాలంకృతశరీరులై యుందురు. వీర లిట్లుండుటకు హేతు వెయ్యది? సర్వజ్ఞులును, త్రికాలజ్ఞులును నైన మీర లీ యర్థంబును సవిస్తరముగా మాకు దెలియ నానతీయవలయును" అని కోరెను. అప్పుడు భద్రసేనునితో పరాశరుఁడు మహారాజా! సుధర్మధారకులు ఘనచరిత్రులు వారి పూర్వజన్మవృత్తాంతంబును దెలిపెద నాలకింపుము.

నందిగ్రామంబను పురవరం బొండు గలదు. అందు కోమల పతిమై నవయావ్వన యగు యొక వేశ్య గలదు. ఆమె లాలితా మూల్య దుకూలాంబరాభరణులతోడను, దాస దాసీ జనంబులతోడను, గోమహిషాదిక స్తోమములతోడను, కర్పూర మృగ మద గంధలేపనంబై మణి కాంచన విరాజమానంబగు గృహమందు నప్రమేయ ధన ధాన్యాదికములతో మృష్టాన్నభోజనంబు జేయుచు, పరిపూర్ణ భోగ భాగ్యములతో నెలయుచుండెను. ఆమె యనుదినము శివనామస్మరణ మును, శివార్చనలను జేయుచు, శివభక్తావళికి మ్రొక్కుచు, ధర్మశీల సత్యవచోరక్తిం గలిగి గుణవంతురాలై యుండెను. తన విలువున ధనమిచ్చినను, నామె జారులను, బలుగాకులను, మద్యపాయులను, గుణహీనులను స్వప్నమునందైనను తన ద్వారమును ద్రొక్కనిచ్చెడిది గాదు.

ఆ కామిని వేడుకతో నొక మర్కటమును, కుక్కుటమును బెంచుచుండెను. అవి యెప్పుడును ఆ యింతిమ్రోల నాడుకొనుచుండెడివి. ఆమె యా వానరమునకు రుద్రాక్షహారము నొకదానిని కంఠమునకుం గట్టి, కర్ణకుండలములను, చతుష్పాదములను రుద్రాక్షలతో నలంకరించి, కుక్కుటమునకు గూడ చూళికను గట్టెను. ఆమె అనిశము యాప్తులతో దేవళమున కరిగి నాట్యమంటపమునందు నాట్య గీతములతో గొంత ప్రొద్దును గడపి క్రమ్మర నిజగృహమున కరుదెంచుచుండును.

ఇవ్విధమున నవ్వారాంగనారత్న మనేకవిధముల గ్రీడింపుచు నభీష్టభోగంబు లనుభవింపుచుండ, కొన్నిదినంబులకు భూతి త్రిపుండ్ర రుద్రాక్షమాలికాధారణుండును, జటిలుండును, ప్రకోష్ఠభాగ ప్రదీపిత మణికంకణుండును, మహాధనికుండును, శివవ్రతుండును నగు పురుషుం డొండా వేశ్యాగృహమున కరుదెంచెను. అప్పుడా యంగన యాతనికి

అర్ఘ్యపాద్యాది సత్కారముల సంతుష్టిఁబరపి, సాదరముగ బీఠమున గూర్చుండ నియమించి, సరసానులాపంబుల గొంత ప్రొద్దుఁ బుచ్చి, పిమ్మట పరిహాసము దోప,

వారకాంత:—అర్యా! మీరు శంకరనిభులు, భూషాలంకృత దేహులు, భద్రలక్షణులు, మీరు వామాంకముగ ముంజేతిని గంకణముఁ ధరింప నేమికారణము?

పురుషు:—కలభాషిణీ! ఇయ్యది అనుపమరత్నసంయుత మనర్ఘ్యమైనది. గావున దీని మూల్యమును జెప్పనలవి గాదు. మరియు నియ్యది శుభప్రదంబై నదగుటచే హస్తమున ధరించుచుంటిని.

వార:—మహాశయా! యుద్దానిని ధరింప నాకు అభిమతము గలదు. అయ్యది మీకు హితంబగునేని నా కొసంగుడు. లోక విఖ్యాతమగునట్లు ధరించెదను.

పురు:—నవలా! నీకు వలయునేని సంతోషపూర్వకముగ దీనిని ధరింపుము. ఈ ధరపై వేడుకకు వెలలేదు. దీనిని మచ్చికతో నీ కొసంగుచుంటిని. (అని బలుకుచు కంకణమును వేశ్య కరమున నలంకరించెను) కామినీ! ఈ కంకణమును నీవు గైకొనుచు నే నిచ్చట నుండవలసిన దినములసంఖ్య నుడువుము.

వార:—మహాత్మా! అర్కచంద్రాదులసాక్షిగ నా దేహమును శాశ్వతముగ మీ యధీనమును గావించుచుంటిని. మరియు నేను భవదీయ సహధర్మిణినై విహితక్రియలను వర్తింతును. (అని యాతని పాదములను బట్టును)

పురు:—ప్రేయసీ! నీ పలుకులకే నెంతయు ముదమందితిని. (ఒక మణిమయలింగము నామె చేతియం దిడుచు) ఈ మహాలింగంబును అతి గోప్యముగ భద్రపరచుము. అయ్యది యెప్పుడు శిథిలమగునో నే నప్పుడు ప్రాణములను విడుతును.

వేశ్య యద్దాని నందుకొని వేరొక భవనమునందు గుప్తబర చెను. అనంతరమున వారు దేవదర్శనమునఁ గావించి, మృష్టాన్న పానముల బరితుష్టినొంది, నిర్మల సువర్ణతల్పముల వారు పంచశర కేళిని సుఖంబుఁ జెంది పవ్వళించిరి.

ఈ రీతిని వారు శయనించియుండఁగ నా రేయియందు నహేతు కముగ అగ్నిజ్వాల ప్రజ్వరిల్లి మణిమయలింగమును గుప్తబరచిన భవ నము దగ్ధమయ్యెను. అందు వేశ్య ప్రేమతో బెంచిన కుక్కుట మర్క టములు రెండును భస్మమయ్యెను. మహాలింగము శిథిలమయ్యెను. వేశ్య దానినెల్ల గాంచి నిశ్చేష్టిత యయ్యెను. అంత నా విటుఁడు తన మణిమయలింగము భిన్నమైనది గావున తానా క్షణమునందే యగ్ని ప్రవేశ మాచరింతుననియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు విచ్చేసినను తన నియమమును దప్పింపఁజాలరనియుఁ బలుకఁజొచ్చెను.

ఇట్లు దృఢనిశ్చయుడై యున్న యాతని యభిప్రాయం బెరింగి ఆ వేశ్య బురబాహ్యప్రదేశంబున జితి గావించిన, నా విటుఁడు సూర్యోదయానంతరమునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి, యచ్చ టికిఁ జనుదెంచి శంకరపదధ్యానం బొనరింపుచుఁ బ్రజ్వలితాగ్నికి బ్రద క్షిణత్రయం బొనరించి, సకలజనులు కనుంగొనుచుండ నందు బ్రవే శించెను. అంత నవ్వనితయు నాతని మరణమునకు పామ్పపూరితలోచ నయై నిర్వేదించి, నిర్మలమైన ధర్మంబు మనంబునఁదోవ తాను నాత నితో సహగమనము జేయుదునని నిశ్చయించి, బంధుజనంబులను బంచి సంగతి నంతయు వారల కెరింగించి తా నగ్నిప్రవేశ మొనరింతునని నుడివెను. అప్పుడు వారు "ఓ కామినీ! వారాంగన విటుని సాత్త గుట యెన్నటికిని దగదు. తోడి కులాంగనలగు నారీమణులు విన్న నవ్వుదురు. పూర్వము మన పెద్దలు చెప్పు నీతులను నీవు వినలేదా? చాలు చాలు! నీ చారిత్రము చాల యద్భుతముగ నున్నది. విటుని

మచ్చికజేసి వాని కతి మైత్రితో మెలంగి విత్తంబు నార్జించవలయును. లేనిచో ఘటికాసిద్ధియు, మంత్రసిద్ధియు మొదలగు వాటితో సాధించ వలయును. లేనిచో వీణాది వాద్యములతో మధురమైన నీ కంఠ స్వరమెత్తి విటహృదయమును రంజింపజేసి, వానిని స్వాధీనపరచు కొని, ధనమును సంగ్రహించుకొనవలయును. అదియే వేశ్యాధర్మము అంతియేకాని యొక విటునికై నీవు జీవితమును ధారపోయుట తగదు. గనుక నీ ప్రయత్నమునుండి విముక్తవుగమ్మ" అని మందలించిరి. అప్పుడా కాంత "బాంధవులారా! ఈ తనువులు సిరిసంపదలు శాశ్వ తములుగావు. కలలోనైనను బొంకుట తగదు. సత్యభాషణ మిహ పరసౌఖ్యములకు సాధకమైనది. సత్యవాక్యము ధర్మములలోనెల్ల ఉత్తమమైనది. మరియు నయ్యది జయకరంబైనది. సత్యమువలన సర్వశుభములు సంఘటిల్లును. గావున జను లెన్నియాపదలు సంభ వించినను సత్యమును విడువరాదు. గనుక రవి పశ్చిమమున నుద యించినను, కువలయబాంధవుడు మహోష్ణగుణుడైనను, భువిపై దారక లుల్లసిల్లినను నేను ప్రవిమలంబైన సత్యోక్తిని విడువజాలను" అని యిట్లు దృఢనిశ్చయంబుగాఁ బలికి, బాంధవజనుల నొడంబరచి, యవ్వారకామిని యా క్షణమున మంగళస్నానముఁ గావించి, జాంబూనదాంబర యుగ్మధారిణియై, హారిద్రాంజన సింధూరకాదులు ధరించి, పురంబునంగల శైవభక్తుల నెల్లరను రావించి, తన గృహం బునం గల ధన కనక వస్తు వాహనములను, అమూల్య కాంచన మణి మయాభరణములను, అనేక గో మహిష శిబికాసన శయ్యా ప్రముఖ సర్వవస్తువులను, వారలకు సమర్పించి పరమేశ్వరధ్యానంబు గావిం పుచు హుతాశనునకు ద్రివారముగా బ్రదక్షిణ నమస్కారంబు లాచ రించి వీరశైవులకు బ్రణమిల్లి పౌరజానపదవర్గంబు లాబాలవృద్ధంబుగా నిరీక్షింపుచు ముకుళీకృత కరకమలయై దహనంబునఁ బ్రవేశించు సమ

యేమున ధవళాంగుఁడును, శశాంకశేఖరుఁడును, భక్తత్రాణపారీణుఁడును నగు పరమశివుఁడు ఇంద్ర విరించ్యాదులు చుట్టును గొలువ వృషభవాహనుఁడై భువి యంతయు వెలుంగుచుండ పార్వతీసమేతుఁడై యరుదెంచి యా వారాంగన కరంబునుఁ బట్టుకొనెను. అంతట నా వేశ్యాంగన ఫాలలోచనుఁడును, శశాంకాదిత్యకోటిప్రభుఁడును, దేవర్షిస్తవనీయ పాదకమలుఁడును, దేదీప్యమానాంగుఁడును, భావాతీతచరిత్రుఁడును నగు శంకరుని గాంచి ప్రణామంబు గావించి చిత్తము రంజిల్లునట్లు సేవ లొనర్చుచుండెను.

అంత నా పరమేశ్వరుఁడు "ఓ కామినీ! నీ ధర్మ నిర్మలజ్ఞానములను, సత్యంబును, దృఢభక్తిని, సౌష్ఠవశీలంబులను బరీక్షించుటకై యేను విటురూపంబున నీ గృహమున కరుదెంచి, నీ భవనదహనంబును మణిలింగభిన్నంబును గల్పించితిని. అయ్యది యంతయు నా యొక్క మాయయే. నీయొక్క భక్తిశ్రద్ధలకు, సత్యవ్రతమునకును మెచ్చితిని. గావున నీకు వలయునట్టి వరంబులను గోరుకొనుము" అని కరుణార్ద్రభావమునఁ బలికెను. అప్పుడా వేశ్యాంగన "దేవా! నీ యొక్క పాదసేవదక్క త్రిలోకాధిపత్యమైనను నాకు వలదు. గనుక నాకును, నా బంధుమిత్రాదులకును గైవల్య మొసంగుము" అని ప్రార్థించెను. అట్లు బలుకఁగనే యమ్మహాత్ముఁడు కరుణించి దివ్యపుష్పకంబుపై వారల నందరను నిజలోకమునకు గొనిపోయెను.

అని యితిహాసము నెల్ల భద్రసేనున కెఱింగించి పరాశరుఁడు "నృపావతంసా! వేశ్యాగృహమున దగ్ధమైన వనచరమే నీ కుమారుఁడై జన్మించెను. మరియు కుక్కుటము నీ ప్రధాని కుమారుఁడై బుట్టెను. ఈ బాలకులు తమ పూర్వభవంబున రుద్రాక్షలను ఆభరణముగ ధరించినకతంబున ఈశ్వరకృపచే వారికి ఈ జన్మంబున ఉత్తమకులోదయమును గలిగెను" అని యివ్విధంబున దెలియఁబలికిన నమ్మృతోపమానములగు పరాశరమహామునీంద్రుని వచనము లాకర్ణించి

సంతుష్టహృదయుండై భద్రసేనమహీనాథుఁడా మహామునితో "మీ ధర్మమువలన నా యజ్ఞానమెల్ల నశించి, ముక్తి లభించెను. నా మనంబును రంజింపఁజేయు సత్సంగతులనెల్లఁ దెలిపియుంటిరి. మహాత్మా! నా కుమారుని యాయుఃపటుతర కీర్తి ప్రతాపబలములను గూర్చియుఁ గూడ దెలుపఁగోరుచుంటిని" అని యడిగిన యా మహీపాలునకు వసిష్ఠపౌత్రుఁడగు పరాశరుఁ డిట్లనియెను. "భూనాథా! విద్యమైన పలుకు వచియింపఁదగును. బలుకఁదగని పలుకుఁ బలుకరాదు. అట్లు బలికినచో నెంతటి ధీరుఁడైనను సంతాపమందును గావున ఈ విషయమునందు నిక్కమాడఁజనదు. నిష్కపటంబగు మానసంబుతో నడిగితివి గావున నీ కుమారుని వార్తను యథాస్థితిని దెలియబరచెదను. నీ సుతునకు ద్వాదశప్రాయంబునకు ముందుగా సప్తమదినంబున మరణము ప్రాప్తించును" అని నిశ్చయముగ మౌనీంద్రుఁడు బలికినంతనే అయ్యది కర్ణశూలమైదోప నా జనపతి భీతాత్ముఁడై శోకాక్రాంతుఁడగుచు వివశుండయ్యెను. అంత నా మునీంద్రుఁడు అత్యంతకృపతో "మహీపాలా! నీవు భయముఁజెందవలదు. నాదు హితంబును వినుము. నీవు యథావిధిని శ్రీ రుద్రజపంబును నిర్మలచిత్తుఁడవై సలుపుచుండుము. నీ సుతునకు దీర్ఘాయురారోగ్యములు తప్పక గలుగును" అని చెప్పిన ఉత్సాహముసఁ బొందినవాఁడై భద్రసేనుఁడు మునీంద్రునితో "మునిచంద్రా! శ్రీ రుద్రాధ్యాయజప మేరీతిని నొనర్పవలయును? దైవ మెవ్వరు? అయ్యది యొనర్చిన గలుగఁబోవు ఫల మెయ్యది? దయతో నాకుఁ దెలుపఁ బ్రార్థించుచుంటిని" అని యడిగెను.

## 5

### రుద్రాధ్యాయ ప్రభావము

ఆదికాలంబున ఆదిదేవుఁడైన శంకరుఁడు తన రజోగుణమున ధాతను నిర్మించెను. సృష్టికార్యంబెల్లఁ జేయుటకు వేదంబుల నొసంగి

వేదార్థసారమై యొసఁగు రుద్రాధ్యాయ మిచ్చెను. అప్పు డమ్మహాధ్యాయమును బూర్వులైన భృగు మరీచి అత్రి ఆదిగాగల మహామునులు ప్రీతితో నద్దాని నభ్యసించిరి. క్రమముగా నయ్యది భూలోకమునకు బుధులచే సంగ్రహింపఁబడెను. వారి శిష్యులు సుతులు మొదలైన సంతానము ధరణిపైగల ప్రజలు, రుద్రాధ్యాయమును పాఠముఁ గావించి, మదిలోచ్చాటనదక్షులై పుణ్యపరులై యుండగా నరకావాసమెల్ల సూన్యమయ్యెను. యముఁడు దైన్యమును బొందెను.

అంతట యముఁడు బ్రహ్మలోకమునకుఁ జని యా వనజభవునకు మ్రొక్కి దేవతలెల్ల వినుచుండ "ఓ పద్మగర్భా! మానవులు రుద్రాధ్యాయనిరతులై నిగతదోషులుచు, బవిత్ర చరిత్రులగుచు దీర్ఘాయుష్కులై సుఖంబుగ నుండిరి. కడపట శంకరుని కరుణచే సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్య ముక్తులను ముదముతో గాంతురు. అక్కారణము వలన నా లోక మంతయు సూన్యమయ్యెను. కాంతి రహితమై కానఁబడుచుండెను. నిష్ప్రయోజనమగు నా లోకమందు నే నెట్లు వసింతును? దీని కెద్దియైన నుపాయము నానతిమ్ము. మరియు చిత్రగుప్తుఁడు పత్రముల నెల్ల గట్టి మూలఁబడవైచెను. మద్భృత్యులు తమ తమ సదనములందు నిరుద్యోగులై కాలమును బుచ్చుచుండిరి. కృతఘ్నులును, సురాపాయులును, కాంచన తస్కరులును, గృహదాహకులును, ధర్మహీనులును, పుష్పిణీగమనులును, విశ్వాసఘాతకులును, దుటిలవంచక ఖలక్రూర పాతకులును, వేదాన్న కన్యకా విక్రయులును, హరిహర ద్వేషులును, హంతకులును, అత్యహంకారాత్ములాదిగా గల జనులు కోట్లకొలఁది నా పురమునకు వచ్చియుందురు. అట్టి పురమున నిప్పు డొక్కఁడైనను వచ్చుటలేదు. మహాత్మా! నే నిప్పుడు చేయునదేమి? అనిబలికిన యమునితో వనజభవుడు "ధర్మజా! భూలోకమునందు మాహాత్మ్యములకు అశ్రద్ధ దుర్బుద్ధియను నీ రెండు దుర్గుణములు వంశపర్యంపర వచ్చుచు మానవకోటిని చిత్తవిభ్రష్టులుగఁ

జేసి నరకస్థానమునకు బంపుచుండును. అప్పుడు నీ నరకస్థానము పూర్తియగును. కావున నీవు నిర్వ్యాదుడవై జనుము" అని జెప్పి బ్రహ్మ ఇనసందనుని పీడ్కొలిపి, అశ్రద్ధ దుర్బద్ధుల నిరువురను భూలోకమున కనిపెను.

గనుక యే కార్యమైనను అశ్రద్ధతో జేసిన ఆ కార్యము భంగమగును. జప తపః పూజాదులు, సకలధర్మచయములు శ్రద్ధతో నొనర్చినయెడ సత్ఫలంబు గలుగును. రుద్రాధ్యాయమంత్రము ముఖ్యమైనది. ఇదియే పరమతపము. మఱియు సర్వసుఖాస్పదమైనది. ముక్తి సాధనమై బహు పాతకంబులను హరించును. రుద్రాధ్యాయపరాయణుడును, ఫణిహారుండును, సచ్చిదాకారుండును నగు శంకరుని నిత్యము సేవించుచు నాతని నామము పారాయణము జేయుచు, రుద్రాభిషేకోదకము నిత్యము మాలిన్యము పోవునట్లు స్నానంబును చేయువారికి బూర్ణాయురారోగ్యైశ్వర్యములు గలుగును. అనఘులును, శాంతమానసులును, ఆగమవేదులును, సంశ్రితవ్రతులును, ఘనతరంబగు శైవసూక్తములను ఖండితముగ నెరింగిన సన్మనులు నిత్యము పఠించినయెడల నీ కుమారునకు సర్వమంగళములు గలుగుచుండును.

ఇట్లు నియమించిన యమ్మహాముసనికి నమస్కరించి యమ్మహాకార్యం బంతయు తానే యచ్చటనుండి నిర్వహింపుమని పరాశరుని భద్రసేనుడు కోరెను. భద్రసేనుని ప్రార్థనల కియ్యకొని పరాశరుడు మునిసంఘుంబులను బిల్వంబనిచి తానును వారలును గూడి, ద్రురస ప్రయుక్తకటికంబు నిల్పి, రుద్రాగమంబున రాకుమారునకు రుద్రాక్షలింగధారణములను జేసి, పిమ్మట రుద్రాగమపారాయణమును రహస్యోపదేశములను జేసిరి.

ఇవ్విధంబున నా రాజనందనుడు మహామునులచే అభిషేచనము గావింపబడుచుండెను. సప్తమదినంబున నెల్లరు కనుగొను

చుండ రాజకుమారుఁడు మూర్ఛాగతుఁడై మహామునీంద్రరక్షితుండు గావున కొంతప్రొద్దునకు లేచి వారలం గనుంగొని "మహాత్ములారా! వినుండు. దీర్ఘదంష్ట్రిండును, భయానకుండును, దండహస్తుండును నైన యొక్క మహాపురుషుండు వచ్చి పాశబద్ధుంజేసి నన్నుఁ గొని పోవుచుండ, అంత నతండును మహా బలపరాక్రమవంతులైన పురుషులచేత బద్ధుండై దూరంబుగా గొనిపోబడియెను. నేనును భవత్కటాక్ష ప్రభావంబున లబ్ధజీవుండనైతిని" అని విన్నవించిన మోదంబంది యమ్మహామును లన్న రేంద్రనందనుని గటాక్షించి యనేక ఆశీర్వచనముల నభినందించిరి. భూపాలుఁడును నిర్భయుండై యుండెను. మరియు ఆ రాజేంద్రుఁడు సంప్రహృష్టహృదయుండై శైవభక్తావళికిఁ భూరిప్రాభవ మొప్పునట్లు దక్షిణ తాంబూలములు హేమవాసోరత్నాదు లొసంగి, బాంధవ మిత్రాదులతో షడ్రసాహారంబులను భుజించి, యా స్థానమున కొలువుఁదీర్చి యుండెను.

అప్పుడు సచ్చరిత్రుఁడును, వారిజగర్భనందనుఁడును, అవార్య మహిమానుభావుఁడు నగు నారదముని వీణను మీటుచు, భగవత్సంకీర్తనము గావించుచు, నాట్యమాడుచు విచ్చేసెను. నరపాలుఁ డంత టా మౌని కెదురేగి స్వాగతమునిచ్చి, యర్ఘ్యపాద్యాది సత్కృతులాచరించి, విమల కాంచన పీఠోపవిష్టునిగఁ జేసి, అంజలీబద్ధుఁడై "మునిచంద్రా! మీరు మహాతపోధనులు. మిత్రసమానులు, సర్వలోక సంచారులు. పుణ్యమూర్తులు. అద్భుతమైన వార్త లేమైనసి చూచి వచ్చితిరో మా కెరింగింపుడు" అని యడుగ నారదుఁడు "భూపాలకా! నీ యాత్మజుని విగతప్రాణుని గావింపఁదలఁచి దండధరుఁడు మృత్యువుతో జనుదెంచియుండ, నా సమయంబున శివుండు దెలిసి కోపాగ్ని ప్రదీప్తుఁడై, దన పుత్రుఁడగు వీరభద్రుని బంప, నాతండు ప్రమథగణయుక్తముగ శీఘ్రము మరుదెంచి గృతాంతునిఁబట్టి, యా క్షణంబుననే పెడ కేలఁ నంటఁగట్టి ముష్టినిహతుల నొప్పించి యష్టమూర్తిసభకు రమ్మని నిశ్శంకుఁడై యాడ్చెను.

అప్పు డర్కసుతుని మేను గంపమునొందగా వీరభద్రునకు బ్రణమిల్లి "శివకుమారా! నీ కింత కోప మేటికి? నా తప్పుం సైచుము. నే నెంతయు కృతాపరాధుఁడను. ఈ నరేంద్రనందనుండు విగతజీవుండైన వాఁడు. గావున మృత్యుసహాయుఁడనై యిట కరుదెంచితిని. నే నింతకు మించి జేసిన నేర మెద్దియునులేదు. నన్ను గరుణించి రక్షింపుము" అని వేడిన రవినందనుని గనుఁగొని హరతనయుఁడు "ఓయీ! ఈతఁడు మాన్యచరితుఁడు. ధరణిపై చిరకాలము జీవించి కీర్తిని బడయవలసిన వాఁడు. అట్టివానిని దృంప నీ కర్హంబగునే? నీకు సంశయమున్నచో చిత్రగుప్తుని రావించి వృత్తాంత మారయుము. నిక్కముగ నీతఁడు సూక్తాభిషేచనామహుఁడై పదివేలయేండ్లు ధరపై జీవించును" అని బలికినంతనే యముఁడు చిత్రగుప్తుని రావించి యడుగ నాతఁడు "ఈ రాజపుత్రున కాయువు ద్వాదశవర్షములు మాత్రమే" అని నుడివెను.

వీరభద్రుఁడు చిత్రగుప్తుని వచనంబుల నాకర్ణించి, కృతాంతునిం గనుఁగొని "ఈ రాజకుమారుఁడు వర్షాయుత ప్రమాణజీవితుండు. నీ విందులకు సందేహింపఁగలదు. ఈ యర్థంబు నీ మనంబున దృఢంబుగా నిశ్చయించి క్రమ్మర దశ సహస్రవర్ష ప్రమాణజీవితునిగా లిఖింపుము" అని యానతిచ్చిన వల్లెయని యమ్మహాదేవుని వాక్యంబులకు సమ్మతించి మహాభీతుఁడై యా శమనుండు నగేంద్రనందనుని మృత్యుబంధమువలన వీరభద్రుని యాజ్ఞానుసారముగ లిఖింపఁజేసి తానును వీరభద్రునిచే బంధముక్తుండై మృత్యు కింకర సమేతంబుగా నిజలోకము నకుఁ జనియెను. నేను యీ వృత్తాంతం బంతయుదెలిసి మీ సమీపంబునకరుదెంచితిని. కదనమునందు వైరివీరుల మదమునడంచి నీ సుతుఁడు రాజ్యమునేలుచు బదివేలేండ్లు వసించును" అని జెప్పి నారదుఁడు చనియెను. నారదమునీంద్రుఁ డరిగిన తదనంతరమున పరాశరాది మహర్షులు తమ తమ యాశ్రయములకుఁ జనిరి. కాశ్మీరనాథుండగు భద్రసేనుఁడు శ్రీ రుద్రాధ్యాయప్రభావంబున నిర్ధూతకల్మషుండై నిజపుత్రసమేతంబుగా రాజ్యభోగముల ననుభవింపుచు సుఖంబుగనుండెను.

# 6

## శ్రుతిఫలము

శౌనకాదిమహామునులు సూతునితో "భూతేశా! భక్తిపరులకు ఖ్యాతిగల్గునట్లు కైవల్య మెట్లొదవును? మహాపాతకవిముక్తుల కేవిధముగ ముక్తి కలుగును? సయ్యాని నెరింగింపవేడెదము" అని కోరిరి. అప్పుడు సూతపౌరాణికుం డిట్లు బలికెను.

"మహామునీంద్రులారా! వేదబాహ్యులకును, విద్యాధికులకును, బుద్ధిహీనులకును, పుణ్యులకును, శిష్టసేవ్యంబైన శివకథాశ్రవణము ముక్తినొసంగును. ఈ ధరణీతలంబున నారు లెవ్వరైన పరమేశ్వరుని చరితంబును భక్తిపూర్వకముగ సాదరమొదవున బ్లాలకించినవారు శ్రీ రుద్రతుల్యు లగుదురు. సంపూర్ణముగ శైవకథాశ్రవణం బొనరింప శక్తిలేనివారు ముహూర్తకాలమైనను వివరముగ వినవలయును. పరమశివుని కథనమును వినిన మానవునకు సకలతీర్థములు, సమస్తయజ్ఞములు, వివిధదానములు, జపతపము లొనరించినం గలుగు సుకృతము క్షణమాత్రములో నొదవును.

కలియుగమునందు నరులకు గలుషములనడంచి కైవల్య మొసంగునట్టి ధర్మ్మమీశ్వర పురాణ తత్వశ్రవణంబునందు దక్క మరెందును లేదు. దీనుండైనను, బాలుండైనను, వయోవృద్ధుండైనను భవపురాణజ్ఞానంబుగలవాడు సముచితబుద్ధిగలవాడై వర్ధిల్లును. దేహధారణులకు కామధేనువైనట్టి శివపురాణంబును వచించు శిష్టజనులను నీచబుద్ధితో జులకనగం జూచినవాడు నవశ్యముగ దుర్గతిని జెందును.

పురాణము సంపూర్ణము గాకుండునప్పు డెయ్యది సాంగోపాంగమానంతవరకు, పురాణయుక్తముగ వ్యాఘ్రాసనాసీనుడై యుండు కథకుండు తరుణుండైనను నాతనికి బహు వృద్ధులైనను గురుభక్తితో

నమస్కరింపవలెను. శివకథ వినునప్పుడు శ్రద్ధలేనియెడల నయ్యది నిష్ఫలమగును. అంబరకేశుని కథ హృద్యంబుగ పఠించునట్టి పుణ్యాత్ముని, హేమాంబర మణి భూషణ ధన తాంబూలములొసంగి వినువారు ధార్మికమతులై సత్కరింపవలయును. శివదేవ సత్పురాణశ్రవణావసరంబులందు జయ్యన జనువారికి సంపద్వినాశనమగును.

ఉష్ణీవధారియై పురాణము విన్న మానవుఁడు మరుజన్మంబున భల్లూకమై జన్మించును. తాంబూలము సేవించుచు ఆకర్ణించినయెడ శునకమై జన్మించును. ఉన్నతాసనముపై ఆసీనుఁడై విన్నయెడ వాయసమై బుట్టును. పవ్వళించి వినినయెడ కొండచిలువయై బుట్టును. కథాశ్రవణసమయమందు నీచపు బలుకులు బలికిన నప్పాపాత్ములకు గురుకళత్రగమనదోషము గలుగును. పౌరాణికుని నిందించినచో రౌరవాది గురునరకంబులందు దారుణమైన బాధల ననుభవించుచుండును.

చిత్తమును రంజింపఁజేసికొని శివకథలను వినువారికి ధ్రువమైన బ్రహ్మపదమబ్బును. పౌరాణికునకు దుకూలవస్త్రంబు లర్పించిన ఘనుఁడు, పరమపదమును గాంచును. ఘోరహత్యల నాచరించిన పాపాత్ముఁడైనను పురాణశ్రవణమువలన నిర్మలమోక్షలక్ష్మీసుఖంబుల ననుభవించును.

శా. "కైలాసాచలవాస భక్తజన రక్షాదీక్ష ఫాలాక్ష చం
ద్రాలంకార నిజోత్తమాంగ ముని హృక్షద్రాడీనరోలంబికా
లీలీహాన విభూషితాంగ విబుధాళిస్తుత్య పాందాంబుజా
శూలప్రోజ్జ్వల దాహుదంత గజరక్షోవీర సంహారకా."

[illegible] శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రితం. 1984

# పత్రికాభిప్రాయములు

## చెన్న బసవ పురాణము.
### (వచనకావ్యము)

డెమ్మీ సైజు సుమారు 190 పుటలు. వెల రు 1—0—0 గ్రంథకర్త శ్రీయుత అన్నదేవర నాగభూషణ రావుగారు. శ్రీ శైవ గ్రంథమండలివారి ప్రథమ ప్రచురణము. హైందవ పురాణము లెల్లయు సంస్కృతములో పద్యకావ్యములలో కాని బద్ధములై ప్రజాసామాన్యమున కందుబాటులో లేకుండుట పెద్ద లోపము. వయోజనవిద్య బహుళముగ వ్యాప్తమగుచున్న యీ దినములలో వాటినెల్ల వచనములలోనికి మార్చి ప్రజల కందించుట పండితుల కర్తవ్యము. గ్రంథకర్తగారిట్టి సేవ నొనరించినందులకు ధన్యులు. శైవ మతమునకు సంబంధించిన అనేక కథ లిందుగలవు. ఆధునాతన నాగరికులు వానిని పుక్కిటి పురాణములని కొట్టివేయుట సులభము కాని, మానవునకు చిత్తసంస్కారము. ఆత్మజ్ఞానము, జాతీయాభిమానము, మోక్షప్రాప్తి గూర్చుటలో వానికీడైన యితిహాసము లేమియు లేవు. ఇట్టి పుణ్యసాధనములచేతనే భారతీయులు జైన బౌద్ధాది నాస్తిక మతములను ఖండించి, వైదికమత ప్రతిష్ఠ నిలబెట్టి భారత సాంప్రదాయములను పోషించిరను మాట మరువరాదు. అప్పటికన్న ప్రాచ్య పాశ్చాత్య భావధర్మ సంకరమగుచున్న యీ యుగములో యిట్టి గ్రంథముల యావశ్యకత మరింత యెక్కువగానున్నది. హిందూమత పునరుద్ధారణమునకిట్టి గ్రంథము లెంతయు ఉపయోగించగలవు

(గృహలక్ష్మి)
1 మే 1934

## శ్రీ శైవ గ్రంథమండలి
### రాజమహేంద్రవరము.

—:o:—

ఈ గ్రంథమండలివారు ప్రచురించిన ప్రథమ గ్రంథమైన చెన్నబసవపురాణము వచనకావ్యము మా కార్యస్థాన మలంకరించినది. గ్రంథకర్త: అన్నదేవర నాగభూషణరావుగారు. మృదుమధుర శైలిలో అందరకు తెలియునట్లు వ్రాయబడియున్నది. ప్రతి కథయందును పరమేశ్వరుడైన పార్వతీ పతి యొక్క మహిమ వర్ణింపబడియున్నది. శైవమత సంబంధములగు గ్రంథములు శిధిలములై మూల బడుటయే గాక శివభక్తి తగ్గిపోయి, శైవ సాంప్రదాయములు తెలియకుండా పోయిన యీ కాలములో నీ గ్రంథమండలిని స్థాపించిన కాళహస్తి తమ్మారావుగారిట్టి మహాకార్యమును బూనుకొని శివభక్తుల చరిత్రలనాంధ్రలోకమున కందజేయ దలంచుకన్న గొప్ప పుణ్యకార్య మింకొకటి లేదు. కాలక్రమముగా నీ గ్రంథమండలివారు వ్యాసమహర్షి విరచితములైన అష్టాదశోపపురాణములలో శైవ పురాణములు గూడా సర్వజనోపయోగముగ నిట్లే యాంధ్రభాషలో ప్రకటించి కీర్తి నార్జింతురుగాక యని యాకైలాసవాసుని ప్రార్థించుచున్నాము

వివరములు తెలియగోరువారు—

కాళహస్తి తమ్మారావు & సన్సు
రాజమండ్రి.

(నవ్వులరాణి)
మే 16 1934

# శ్రీశైవగ్రంధమండలి
## గ్రంధములు

— రాబోవు గ్రంథములు —

| | |
|---|---|
| సానందోపాఖ్యానము (వచనము) | 1-0-0 |
| ప్రభులింగ లీలలు (వచనము) | 1-0-0 |

— వెలువడినవి —

| | |
|---|---|
| చెన్న బసవపురాణము (వచనము) | 1-0-0 |
| బ్రహ్మోత్తరఖండము (వచనము) | 1-0-0 |
| షట్స్థల శివపూజావిధానం (అనుబంధ) | 0-4-0 |
| ఆనంద శివపూజావిధానం " | 0-1-0 |

పోష్టుఖర్చులు మేము భరించి యీ ధరలకు యితర్లకు పంపబడును.

కావలయువారు:—

కాళహస్తి తమ్మారావు & సన్సు

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమండ్రి.

Title Page Box Press, Rjy.